# ఆంధ్రప్రదేశ్ గురించి...

* ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 8 శాతానికి, ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.
* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 1,06 052·4 చదరపు మైళ్లు.
* 1961 లో సేకరించిన లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా, 3,59,83,447 మంది.
* 1961 లెక్కల ప్రకారం, అక్షరాస్యుల శాతాన్నిబట్టి, ఆంధ్రప్రదేశ్ భారతదేశ రాష్ట్రాలలో పదవ స్థానం ఆక్రమించింది.
* 1961 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 21.2 శాతం మంది వున్నారు. కాగా భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం 24.0.
* 1961 లో, హైదరాబాదు, కృష్ణా, పశ్చిమగోదావరి, గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాలలో అక్షరాస్యులు, అఖిల భారత స్థాయికంటే ఎక్కువ మంది వున్నారు.
* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ 281లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ· 430 లకు పెరుగుతుంది.
* రాష్ట్రంలో 1 000 అడుగుల లోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2 000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.
* భారత దేశంలో, బారైట్స్ వుత్పత్తిలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. దేశంలో వుత్పత్తి అయ్యే బారైట్స్‌లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో వుత్పత్తి అవుతున్నది.
* అభ్రకం వుత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాతి స్థానం ఆంధ్రప్రదేశ్‌ది.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 14 | ఏప్రిల్ 1970 | సంచిక: 6

చైత్రం – వైశాఖం 1892 శా.శ.

ప్రధాన సంపాదకుడు: మైడ్యాల వామనరావు




**ఉగాది ప్రత్యేక సంచిక**





వెల: 50 పైసలు

సాలుచందా ఆరు రూపాయలు

**Regd. No. H. 135.**

# సౌభాగ్యానికి సోపానాలు

తమ మంత్రివర్గంపై వచ్చిన "విశ్వాస రాహిత్య" తీర్మానానికి సమాధానమిస్తూ ముఖ్యమంత్రి చేసిన ప్రసంగంలోని ప్రధాన అంశం ఏమిటంటే అనేక లోపాలకు ఆర్థిక పరిస్థితి కారణమనీ, కేవలం అభివృద్ధి కృషి పట్లనే దృష్టిని కేంద్రీకరించి శాయశక్తులా పాటుపడినట్లయితే సర్వతోముఖాభివృద్ధి సాధ్యమవుతుందనీ, ఫిర్యాదు చేయడానికి వెనుకబడిన ప్రాంతాలకు ఆస్కారం వుండదనీ ఆయన పేర్కొన్నారు. "విశ్వాస రాహిత్య" తీర్మానాన్ని అత్యధిక సంఖ్యాబలంతో ఓడించడం జరిగింది.

1964 వ సంవత్సరంలో తాము ముఖ్యమంత్రి పదవిని స్వీకరించినప్పటినుంచి తమ సారథ్యం క్రింద తెలంగాణా ప్రాంతంలో జరిగిన అభివృద్ధిని గురించి వివరిస్తూ శ్రీ బ్రహ్మానంద రెడ్డి 1948 వ సంవత్సరం నుంచి 1956 వ సంవత్సరం వరకు తెలంగాణా ప్రాంతంలో పరిశ్రమల రంగంలో పెట్టుబడి పెట్టడం జరుగలేదనీ, నిజాం హయాములో ప్రారంభించిన పరిశ్రమలను సైతం ప్రైవేటు పారిశ్రామికులకు అప్పగించారనీ అన్నారు. ఆకాలంలో అధికారంలో వున్నవారూ, ఇప్పుడు తెలంగాణా అభివృద్ధిని గురించి మాట్లాడుతున్నవారూ ఈ విషయంలో ఏమీ చేయలేదనీ శ్రీ బ్రహ్మానందరెడ్డి వక్కాణించారు.

గత కొన్ని సంవత్సరాల కాలంలో తెలంగాణా ప్రాంతంలో పబ్లిక్ రంగంలో రూ. 100 కోట్ల మేరకూ ప్రైవేటు రంగంలో రూ 70 కోట్ల మేరకూ పెట్టుబడి పెట్టారు తత్ఫలితంగా స్థానిక ప్రజలకు 30,000 ఉద్యోగాలు లభించాయి. ఇది గణనీయమైన విషయం. తమ కృషి ఫలితంగా రాష్ట్రంలో రూ. 35 కోట్ల ఖర్చుతో కూడిన ఔటర్ హార్బర్ ప్రాజెక్టును నెలకొల్పడానికి, విశాఖపట్నంలో జింక్ స్మెల్టర్ కర్మాగారాన్ని స్థాపించడానికి నిశ్చయించారనీ, తెలంగాణా ప్రాంతంలో రామగుండం వద్ద రూ. 75 కోట్ల వ్యయంతో పదివేలు మొదలు పన్నెండు వేల మందికి ఉపాధులు కల్పించగల ఎరువుల కర్మాగారం స్థాపిస్తున్నారనీ, హైద్రాబాదులో హిందుస్తాన్ కేబుల్స్ ఫ్యాక్టరీని ఏర్పాటు చేస్తున్నారనీ ముఖ్యమంత్రి తెలిపారు. విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పగలరన్న విశ్వాసాన్ని కూడా శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రకటించారు.

సాధించిన విజయ పరంపరలను గూర్చి చెబుతూ ముఖ్యమంత్రి, నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిమిత్తం రూ. 35 కోట్ల అదనపు సహాయం లభించిందనీ, పోచంపాడు ప్రాజెక్టు గోదావరిపై రోడ్డు వంతెన మంజూరైనవనీ, సికింద్రాబాదు కార్యస్థానంగా దక్షిణ-మధ్య రైల్వే మండలం ఏర్పడిందనీ, విశాఖ పట్నంలో డ్రైడాక్, భారత హెవీ వెసెల్స్ పరిశ్రమలను నెలకొల్పారనీ, రాయలసీమ అభివృద్ధి మండలి ఏర్పడిందనీ అన్నారు. ప్రారంభం నుండి 1969 అక్టోబరు వరకు 14.5 లక్షల ఎకరాల బంజరు భూములను పంపిణీ చేయగా ఆనాటినుండి తీవ్రతర కార్యక్రమం క్రింద 3.88 లక్షల ఎకరాల భూములు పంపిణీ చేయబడినవనీ. వీనిని గూర్చి ప్రభుత్వం ఎంత ఆదుర్దాగా ఉన్నదో దీనివల్ల స్పష్టమవుతున్నదనీ ఆయన అన్నారు. దీనికి తోడు, చట్ట విరుద్ధంగా శివాయి జమాదార్ల ఆధీనంలో ఉన్న 24,000 ఎకరాల భూమి, భూములులేని పేదలకు పంపిణీ చేయబడింది. ముట్టాదారీ పద్ధతిని రద్దుచేయడం, గిరిజనులనుండి గిరిజనేతరులకు భూమి మార్పిడిని నిషేధించడం, ఋణ విముక్తి సహాయం వంటి చర్యల ద్వారా గిరిజనుల అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేక కృషిని జరిపింది.

రెండు నెలల నిర్విరామ కార్యక్రమాల తర్వాత వాయిదా పడిన రాష్ట్ర శాసనసభ, వివిధ రంగాలలోని అనేక సమస్యలను గూర్చి చర్చించింది. తమ అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి సభ్యులకు అవకాశం కలుగగా, సమస్యలను సక్రమ దృష్టితో అవగాహన చేసుకోవడానికి వీలుగా సందేహ నివృత్తిచేసి వివిధ సమస్యలను వివరించడానికి ప్రభుత్వానికి వీలు కలిగింది. ఇంతవరకు సాధించిన అభివృద్ధికి తాను సంతృప్తి చెందినట్టు భావించరాదనీ, సభ్యులు, ప్రజల సహకారంతో మరింత అభివృద్ధిని సాధించి, యితోధిక ఉపాధి కల్పనకు వీలుగా రాష్ట్రానికి అనేక ప్రాజెక్టులను యిచ్చేవిధంగా కేంద్రాన్ని తాను ఒత్తిడి చేయగలననీ ఆయన అన్నారు.

మనం సాధారణనామ సంవత్సరంలోనికి ప్రవేశిస్తున్నప్పటికి ఇది మనకు 'అసాధారణ' మైన ఫలితాలను చేకూర్చగలదని ఆశిద్దాము.

— పి. వి. ఆర్.



# పోయిరావయ్య సౌమ్యుడా

అయ్యగారి నరసింహమూర్తి
అయ్యగారి రామరాఘవరావు

తెలుగు వత్సరమా నీవు తిరిగి తిరిగి
ఆరువదేండ్లకు వచ్చెద వనుచు నెఱిగి
నీ వొనర్చిన కృత్యముల్ నేర్పుమీఱ
క్రమము తప్పక వ్రాసితి గ్రంథమందు.
చరిత మందలి భేదమ్ము నరయ దలచి.

పెట్టితివో లేదొ పృథ్విపై పాదమ్ము
గడగడ వడకెను పుడమియంత
రెండు మాసములైన నిండెనో మఱిలేదొ
ధరణి 'తుఫాను' చేఁ దలడిల్లె
అనుకోని రీతిగా పెనుఘటమ్మును గూల్ప
రాజకీయమ్మంత రచ్చకెక్కె
చంద్రలోకపు యాత్రసాగింప నౌకపఱి
వేడుక మీఱ నిర్విఘ్నమయ్యె
వాన మీఁద వాన వర్ధిల్లి యేపార
పైరులన్నియు గూడ పాడువడియె
బడులు మూయఁబడియె బెడదలు మెండయ్యె
ఎవరి పాప ఫలమొ యిట్లు పండె.

'అచ్చుపొడిచిన యాఁబోతు'లైన జనులు
'ఆరు మూఁడౌట' నారసి యటమటించి
బుద్ధి చెప్పంగ మదినెంచి హద్దుమీఱి
ప్రళయ తాండవ మాడంగ భావ్యమగునె!

వృద్ధు: మాపాలి కురు, గురువృద్ధు వీవె
యంచు పులకించి గద్దె నెక్కించినాము

దండనము దశ గుణమ్మని తలచి యిట్లు
గాసి పెట్టుట లాభమా పీసమైన
సన్నుతింతురె నీ చర్య కిన్నవారు

గుండె గాలముచేసి మా కొంపఁగూల్చి
పుడమి భారము పోకార్ప పుట్టినావొ.
వింత లేకుండగా నావు లింతయేల
నిజము నిలకడమీదనే నెగడుచుండు.

హృదయ మందున గాంధి, యధరమందున బ్రాంది
తలచి త్రాగు ఫలము కలిగెనీకు
శత జయంతి వేళ చనుదెంచు కతమున
భాగ్యశాలివైతి భవ్య చరిత.

క్రొత్తవారిఁజూడఁ గ్రొంగ్రొత్త భావముల్
పొడుము చుండు మదిని, పొత్తుకుదుర
కాలగమనమందు కల్లయు కపటమున్
వెల్లి విరియుటరుదె విశ్వమందు.

లోభ గుణమున జనులను క్షోభపెట్టి
పేరు చెడఁగొట్టు కొంటివి వేరులేదు
ఇపుడు దూషింప నిన్ను మాకేమిఫలము
పీడ కలయిది యనుచు భావింతుమయ్య
పోయి రావయ్య సౌమ్యుడా! పొదలు సుఖము.

# "మా తెలుగు తల్లికీ మల్లెపూవుల దండ"

—రా పూ రు

కృష్ణా తరంగ నిర్ణిద్ర గానము తోడ
శిల్పమ్ము తొలి పూజ సేయు నాడు_

_విశ్వనాథ

కృష్ణా తరంగ పంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళించ
నాంధ్ర నౌకలు నాట్య మాడు నాడు_

_రాయప్రోలు

పశ్చిమ తీరంలో పవిత్ర మహాబలేశ్వరం క్షేత్రంలోని మహాదేవ ఆలయంలో గోముఖ శిలలోనుంచి ఉద్భవించి, తూర్పు తీరంలోగల హంసల దీవి క్షేత్రంలో సాగరస్వామిని ఆలింగనం చేసుకొని ఆనందంతో దివ్యమైపోయే కృష్ణా నదీమతల్లి మన తెలుగు తల్లికి ఒక వాడని మల్లెపూవుల దండ వంటిది.

ఆహా! ఏమి ఈ నదీమతల్లి సౌందర్యం! ఏమి ఈ దివ్యవాహిని దివ్య స్వరూపం! ఏమి ఈ పవిత్ర కష్ణవేణి ప్రావట వైభవోన్నత చరిత్ర.

## మహాదేవ ఆలయం ఆమె పుట్టిల్లు

కావేరి, గోదావరుల కంటే పవిత్రత నాపాదించుకొన్నదీ నది. ఈ నది పుట్టుకను గురించి డబ్లియూ. హెచ్. హంటర్ ఇలా వ్రాశాడు—"సముద్రమట్టానికి 4500 అడుగుల ఎత్తుగల పడమటి కనుమ చరియలోగల మహాదేవ్ ఆలయంలో జన్మించిందీ జలకన్య. ఆలయంలో చిన్న సరస్సుంది. గోముఖ చిత్రంవంటి ఒక సొరంగంలో నుంచి నీరు వచ్చి ఈ సరస్సులో పడుతూ వుంటుంది. ఇదే నదీమతల్లి జన్మస్థానం. ఈమెను స్త్రీమూర్తిగా భావించి "కృష్ణాబాయి" అని పిలుస్తారు భక్తితో. చిక్కటి పొదలలో, చెట్లలో దాగివుండే ఈ పవిత్ర స్థలానికి వేలాది భక్తులు వచ్చి దర్శించి పోతూవుంటారు."

ఈ నది పొడవు 800 మైళ్లు. డెల్టా విస్తీర్ణం 97,000 చదరపు మైళ్లు. తుంగభద్ర, భీమా నదులతో కలిసి, కృష్ణవేణి దక్షిణాపథంలో గల మూడు నదులలో ఎక్కువ నీటిని అందజేయ గల పుణ్యాత్మురాలుగా వెలిసింది.

పశ్చిమ కనుమలు దాటి కొరడ్ వద్దకు చేరిన తర్వాత కోయన, సాంగ్లి అన ఉపనదులు వచ్చి కృష్ణవేణిలో లీనమైనాయి. మరికొంత దూరం వెళ్ళిన తర్వాత పంచగంగ అనే ఉపనది ఉప్పొంగుతూ వచ్చి పవిత్ర కృష్ణవేణిలో కలిసిపోయింది. తర్వాత కృష్ణవేణి బెల్గాం, బీజాపూర్ జిల్లాలలో ప్రవహిస్తుంది. బీజాపూర్ వద్ద ఘటప్రభ, మాల్‌ప్రభ అనే ఉపనదులు ఉవ్విళ్లూరుతూ వచ్చి ఈ మహానదిలో కలసిపోతాయి గర్వంగా!

ఇలా మూడు వందల మైళ్లు ముచ్చటగా ప్రవహిస్తూ, పరిసర ప్రాంతాన్ని సస్య శ్యామలం చేస్తూ, అశేష ప్రజానీకానికి అన్నదానం చేస్తూ కృష్ణవేణి మెల్లగ దక్కన్‌లో చేరుతుంది. అలా వచ్చి పూర్వపు హైదరాబాదు సంస్థానంలోని ఇచ్ఛంపేట వద్ద ఇలవేల్పుగా ఆ సంస్థానంలో ప్రవేశిస్తుంది. ఆ తల్లి అడుగు పెట్టడం అశేష సంపదలకు దోహదం కల్పించడమే. ఆ ప్రాంతములోని ప్రజలను తన వెన్నెల హస్తాలు జాచి ఆశీర్వదించడమే...... కెరటాల గలగలతో ప్రజల వదనాలలో కలకలలు, పెదవులపై కిలకిలలు కల్పించడమే.

నేటి ఆంధ్రప్రదేశ్‌లోని మహబూబ్‌నగర్, నల్గొండ గుంటూరు, కృష్ణా జిల్లాలలో ప్రవహించి కృష్ణానది మచిలీపట్నానికి చేరువలో వున్న హంసల దీవివద్ద సాగరంలో ప్రవేశిస్తుంది. దక్కన్ ప్రాంతంలో ప్రవేశించిన తర్వాత రాయచూరు వద్ద భీమా, ఆలంపూర్ వద్ద తుంగభద్రలు వచ్చి ఈ మహా నదిలో దివ్యమవుతున్నాయి.

ఇన్ని ఉపనదుల అందాన్నీ, ఆనందాన్నీ_త్యాగాన్నీ-భోగాన్నీ కైవశం చేసుకొని గంభీర ముద్రతో ఆంధ్రదేశంలో అమరమూర్తిగా ప్రవహిస్తున్నదీ నదీమతల్లి. దక్కనులో ప్రవేశించక పూర్వం రాయచూరు వద్ద కృష్ణానది ఎందుకనో సన్నపడి ప్రవహిస్తుంది_ సుమారు మూడు మైళ్ళ పొడవున మాత్రం. ఆమె అభిప్రాయం తర్వాత నదీ గమనాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

## పసిడి గజ్జెల చప్పుళ్లు పైడి శంఖారవాలు

వరదలు వచ్చినప్పుడు ఈ సన్నపడిన ప్రాంతంలో కృష్ణవేణి పరవళ్లు త్రొక్కి, పసిడి గజ్జలు మ్రోగిస్తున్నట్లు, పైడి శంఖాలు పూరిస్తున్నట్లు కిన్నెర గానాలు వినిపిస్తున్నట్లు క్రిక్కిరిసి ప్రవహించి, ఒక్కసారిగా ముందుకు ప్రవహిస్తుంది...దక్కనుపై తనకు గల మక్కువ ప్రదర్శించడానికో, సాగరునివైపు తన నడక మళ్ళించుకొంటున్నాననే మహోత్సాహాన్ని ప్రదర్శించడానికో!

తుంగభద్రను కూడా తోడు చేసుకొన్న తర్వాత నల్లమలై కొండల మధ్యగా సొంపుగా వంపులు తిరుగుతూ లోతుగా మంగళజ్యోతిగా ప్రవహిస్తుందీ మహానది. నల్గొండ జిల్లాలోని వజీరాబాద్ వద్ద ముసి ముసి నవ్వులు నవ్వుతూ మూసీ వచ్చి కృష్ణలో కలసి కోటి జన్మల కోరిక ఫలించినట్లుగా, సాగర సంగమ తృష్ణ నెరవేరినట్లుగా ఉప్పొంగిపోయింది.

సుమారు ఏడు వందల మైళ్లు ప్రయాణం చేసిన తర్వాత కృష్ణ, గుంటూరు జిల్లాలో అడుగు పెట్టి కృష్ణా జిల్లాకు చేరుతుంది.

ఈ రెండు జిల్లాలలో వందమైళ్లు ప్రవహిస్తుంది నది. తర్వాత ఈ నది విజయవాడ వద్ద ఉండవల్లి—ఇంద్రకీలాద్రి కొండల నడుమగా అతి సుందరంగా ప్రవహించి, అద్భుతమైన దృశ్యాన్ని కల్పించి, పవిత్రతా ప్రాభవాలకు ఆటపట్టుగా విలుస్తుంది. కృష్ణానది వొడ్డున గల మొదటి పట్టణం—వామ్. చివరి పట్టణం విజయవాడ!

## విజయవాడలో నదిపైన వెన్నెల పందిరి

వామ్‌లో కృష్ణ ఒక మధురవీణ . . . విజయవాడలో కృష్ణ కల్యాణకింకిణి . . . నది సాగరుని చేరువను చేరిన తర్వాత ఉభయ హస్తాలతో ఆలింగనం చేసుకోవాలన్న ఆనందంతో కాబోలు రెండుగా చీలి ప్రవహించింది. ఈ రెండు హస్తాల మధ్య గల భూభాగం అతి సారవంతం. పుష్పఫల శోభితం. పుణ్యప్రదం అయింది. విజయవాడలో కనకదుర్గమ్మ తల్లి చల్లని దృక్కులు నదిపైన వెన్నెల పందిరులల్లినాయి.

విజయవాడకూ, విమలకృష్ణా తరంగిణికీ గల బాంధవ్యమును ఇక్కడ కొద్దిగా వర్ణించాలి. నదిపైన రైలు వంతెన నిర్మించబడిందేనాడో! . . . వందకు పైగా రైళ్లు ప్రతి నిత్యం ఈ వంతెనమీద నడిచి, ఎంతో పుణ్యం మూట కట్టుకొంటూ వుంటాయి. ఇక్కడ చాలా కాలం క్రింద ఒక ఆనకట్ట కట్టబడింది. అందువల్ల అనేక కాల్వలు ఇక్కడి నుంచి దిక్కు దిక్కులకు పరుగులు తీస్తూ పంటలకు దోహదం చేస్తూ, పడవ వ్యాపారం సాగిస్తూ వుంటాయి. ఇటీవలనే రోడ్డు వంతెన నిర్మాణంకూడా జరిగింది. దీనివల్ల ఏర్పడిన మేలు వర్ణించరానిది. ఇక్కడనుంచి మద్రాసు వరకు గల బక్కింగ్‌హామ్ కాల్వ దక్షిణ ప్రాంతంలోగల కాలువలలో అతి ప్రసిద్ధి చెందడమేకాకుండా వ్యాపారానికి ఎంతో ఉపకరిస్తుంది.

పూర్వం విజయవాడనుంచి కృష్ణానదికి అవతల ఒడ్డున వున్న సీతానగరంవరకూ ఒక్కటే టెలిగ్రాఫ్ తీగ వుండేదట. "5000 అడుగుల పొడవుగల ఆ తీగలాటిది ప్రపంచంలో మరొకటి లేదు" అని పేర్కొన్నారు. విజయవాడలో ఈ తీగను ఒక కొండ మీద కట్టడం జరిగింది. ఆ కొండను ఇప్పటికి టెలిగ్రాఫ్ కొండ అనడం కద్దు.

ఏడవ శతాబ్దంలో మన దేశానికి వచ్చిన చైనా యాత్రికుడు హ్యూన్‌సాంగ్ విజయవాడలోని ఒక బౌద్ధారామంలో నివసించేవాడని కొందరు చరిత్ర కారులు పేర్కొన్నారు. కొండమీద వున్న కొన్నిగుర్తులు ఆరామానికి ఆనవాళ్లు అనికూడా వారుపేర్కొన్నారు. కాని హ్యూన్‌సాంగ్ తన రచనలలో ఎక్కడా, కృష్ణా నదిని గురించిగాని, విజయవాడను గురించిగాని పేర్కొనక పోవడం వల్ల పైన చెప్పిన విషయాలు రుజువు కాలేదు.

## అక్కన్న మాదన్నల నివాస స్థలం

కృష్ణా నదికి దక్షిణపు ఒడ్డున వున్న ఉండవల్లి గుహలను గురించి గెజిటీర్‌లో ఇలా వ్రాయబడింది. పదవ శతాబ్దానికి చెందిన అబుల్‌హసన్ గోల్కొండ నవాబువద్ద మంత్రులుగావున్న అక్కన్న మాదన్నలు తమ నివాసం బెజవాడ ఏర్పరచుకొన్నారు. దీనికి కారణం సాధ్యమైనంతవరకు మొగల్ చక్రవర్తికి దూరంగా వుండాలనే భావం కావచ్చు. ఇక్కడగల టెలిగ్రాఫ్ కొండనుంచి హైదరాబాదువరకూ కొండలపైగా ఒక మార్గం ఉండేదనీ. దాని ద్వారా అమాత్యవరులు ప్రతి రోజూ గోల్కొండ దర్బారుకు వెళ్ళి తిరిగి వచ్చేవారనీ చరిత్ర వుంది.

కృష్ణ తరంగిణి ప్రవహించిన ఎనిమిది వందల మైళ్ళ పొడవునా. నదీతీరంలో ఎన్ని పుణ్య స్థలాలువున్నాయో చెప్పడం కష్టం. నదీమ తల్లి దర్శనమే పవిత్రమైనప్పుడు పుణ్య స్థలాలకు కొదువ వుంటుందా? భూమ్మీద అవతరించదలచిన దేవతలకు నదీతీరంకంటే అనువైన తావు వుంటుందా!

ఆంధ్రప్రదేశ్‌లోగల పవిత్ర స్థలాలను పేర్కొంటే పెద్ద చరిత్ర అవుతుంది. ఆదిలో శ్రీశైల మల్లికార్జున స్వామి పవిత్రాలయం. శిఖర దర్శనమే మోక్షప్రదంగా భావించబడే—ముక్కంటి ఆలయం నదీమ తల్లి వొడ్డునగల ఒక మహా పీఠం. అమరావతిలో తిరిగి ఆది శంకరుల ఆలయం. ఎంతో ఎత్తు పెరిగిన లింగం అందించే అపూర్వ దర్శనం ఆంధ్రులకు మహా వరం. శాతవాహనులు పాలించినప్పుడు రాజధానిగా వెలసిన ధాన్యకటక శిథిలాలిక్కడ గోచరిస్తాయి.

## ప్రాచీన శిల్ప కళా లక్ష్మికి నిత్య నీరాజనం

ఇక్కడనే పూర్వం మహాయాన బౌద్ధ మతం ప్రవర్ధిల్లింది. చైనా యాత్రికుడు హ్యూన్‌సాంగ్ యిక్కడ నివాస మేర్పరచుకున్నాడంటారు. ఇక్కడగల బౌద్ధారామం జగత్ప్రసిద్ధి చెందింది. రెండు వేల సంవత్సరాల క్రింద ఆంధ్ర శిల్పులు ప్రదర్శించిన శిల్ప నైపుణ్యం ఆరని జ్యోతిగ వెలుగుతున్నదింతవరకు

"చెక్కిరి మున్ను పేర్గాంచిన
శిల్ప కళా నిధులీ స్వరూపమున్
మ్రొక్కిరి సర్వ దేశికులు..."

అని కవి కంఠంలో మెదిలిన గానంలో ఈ సత్యం దోబూచులాడుతోంది. అమరావతి ఇప్పటికీ ప్రాచీన శిల్పకళా లక్ష్మికి నిత్య నీరాజనాలర్పిస్తూ. కర్పూరపు ఘుమ ఘుమలు వెదజల్లుతూనే వుంది. చరిత్రకారులకు ఒక స్వర్ణ అధ్యాయంగా, కవులకు ఉత్తమ కావ్య వస్తువుగా, శిల్పులకు సజీవ స్రవంతిగా వర్ధిల్లుతూనేవుంది.

ఈ నది వొడ్డునగల నాగార్జునకొండ చరిత్ర ప్రసిద్ధి చెందింది ఏనాడో! ఆచార్య నాగార్జున అకలంకోజ్జ్వల బోధన వెన్నెల వలయాలుగా ప్రసరించిందీ ప్రాంత మంతటా......ఇక్కడనుంచి ప్రపంచం నాలుగు చెరుగులకు పరుగులు తీసింది—ప్రాభవాన్నీ, పవిత్రనూ మూటకట్టుకొని. నాగార్జునస్వామి మహాయోగి.

## ఆంధ్రను నందనవనం చేసిన నాగార్జునసాగర్

ఆయన పాదాలు తాకిన చోట, ఆయన చూపులు ప్రసరించిన

తావు భూతల స్వర్గం కాకుండా వుంటుందా! ఆయన బోధనలకు పులకరించిన కృష్ణవేణి–నాగార్జునకొండవద్ద తన అనంత వైభవాన్ని అద్భుత రూపాన్ని ప్రదర్శింపదలచింది కాబోలు–ఈ నాడు అక్కడ "నాగార్జున సాగర్" వెలసింది. కృష్ణవేణి వెయ్యి హస్తాలు జాచి నట్లుగా విస్తరిల్లింది. ఆంధ్రప్రదేశ్‌ను నందనవనంగా మార్చింది. ఆకలిదప్పులను దూరంగా తరిమే అద్భుత రూపం దాల్చింది. ఎటు చూచినా వందలాది మైళ్ళు సస్య శ్యామలంగా మారుతున్నాయి. బీడు నేలలు మాగాణులుగా మారి మట్టిలోనుంచి మాణిక్యాలను బైటికి తీస్తున్నాయి. చిట్టడవులు ఆరామాలుగా మారుతున్నాయి ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణగా అవతరిస్తుంది. ప్రతి ఆంధ్రుడు ఈ నదీమతల్లికి జోహారులర్పిస్తున్నాడు. ఈ మహా సాగరాన్ని చూడవచ్చిన విదేశీయులు వెలలేని ఉడుగరలర్పిస్తున్నారు. నదీమతల్లీ! నీ అద్భుత దర్శనానికి నమోవాకాలు.

## కడలి కౌగిటిలో కృష్ణవేణి

విజయవాడ తర్వాత కృష్ణవేణి, వల్లూరు దాటి శ్రీ కాకుళాన్ని చేరుతుంది. ఆంధ్ర విష్ణువుకు సంబంధించిన గాథలతోనిండిన ఈ పుణ్య క్షేత్రం ఆంధ్ర చరిత్రలో అతి ముఖ్య స్థానం ఆక్రమించింది. అక్కడ నుంచి నదీమతల్లి పులిగడ్డ మోపిదేవి, కళ్లేపల్లి నానుకొని ప్రవహించి, హంసల దీవికి చేరుతుంది. "మనస్సుపొంగిన మధురమూర్తి" వలె.

అక్కడగల సోయగం వర్ణించరానిది. ప్రతి వత్సరం శివరాత్రికి అశేష జనం ఆ సంగమ స్థానంలో సుస్నాతులై ఆనందిస్తూ వుంటారు. నదీమతల్లీ సాగరుణ్ణీ కలిసి ప్రజానీకాన్ని ఆశీర్వదిస్తూ వుంటాయి. కృష్ణవేణి సాగరంతో కలసినతావులో వెలువడే గలగలలో నిగమరాగాలు వినిపిస్తాయి. కిన్నెర గానాలు వీనులకు విందు జేస్తాయి.

జయ జయ కృష్ణా!
సలిల తరంగా!
పావన చరణా!
జీవన తరణా!
జయ జయ కృష్ణా!
సలిల తరంగా



## పాఠకుని లేఖ

ఫిబ్రవరి 1970 ఆంధ్రప్రదేశ్ ముఖచిత్రం ముచ్చటగా వుంది. గఫార్‌ఖాన్ పర్యటన విశేషాలు ఆసక్తిదాయకంగా వున్నాయి. 'నిరీక్షణ' కవిత, 'జాహ్నవి' కవిత పత్రికకు విలువను పెంచాయి. కవితలు, కథలు కొద్ది ఎక్కువసంఖ్యలో ప్రచురించిన పత్రిక మరింత అందంగా తయారవుతుంది. వ్యాసాలు చక్కగా వున్నాయి. గుత్తికొండ సుబ్బారావుగారుచేసిన 'వీచికలు' గ్రంథ సమీక్ష చాల నిష్పక్షపాతంగా వుంది. యిది నేనిదివరలో చదివి వుండడంచేత సమీక్ష మరింత ఉత్కంఠ కలిగించింది. ఏమైనా పత్రిక మున్ముందు అభివృద్ధి చెందాలంటే ఇంకా తొందరగా కనీసం నెల మొదటివారాంతానికైనా వెలువడాలి. గత నాలుగయిదేండ్ల క్రితం సంచికలతో పోల్చిచూస్తే యిప్పుడు పత్రిక ధర రెట్టింపు పెరగడమేకాకుండా పేజీల సంఖ్య దాదాపు సగానికి తగ్గిపోయిందని కూడా చెప్పాల్సి వస్తోంది. ఏమైనా ప్రభుత్వం నిర్వహిస్తోన్న పత్రిక కాబట్టి యిదివరలో వలెనే ఎక్కువపేజీలతో తక్కువధరకు అందిస్తే ఎక్కువ ప్రజాదరణ పొందుతుందనుటలో సందేహం లేదనుకొంటా. తప్పకమున్ముందు పత్రికను అభివృద్ధి పరచెదరని విశ్వసిస్తూ— —రాధాయి.

(హైదరాబాదు)

# తెలంగాణాకు కొత్త అవకాశాలు

తెలంగాణా ప్రాంతీయ సంఘం అధికారాలు విస్తృతం చేయబడినాయి ప్రాంతీయసంఘం చర్చించదగిన అంశాలు కూడా హెచ్చించబడినాయి ఇవి బడ్జెటులో చేరివుంటాయి. తెలంగాణా అభివృద్ధికి దోహదం కలిగించే విధంగా భారత ప్రభుత్వం అనేక చర్యలు గైకొనింది.

గత ఫిబ్రవరి 27 వ తేదీన తెలంగాణాకు చెందిన లోకసభ సభ్యులు న్యూ ఢిల్లీలో భారత ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధిని కలుసుకొన్నప్పుడు తెలంగాణా అభివృద్ధికి భారత ప్రభుత్వం ప్రతిపాదించిన సూచనలు అమలు పరచడానికి అవకాశమివ్వవలసిందని ఆమె సలహా ఇచ్చారు. (ఫిబ్రవరి 28 న హిందూపత్రికలో ఈ వార్త పడింది).

ప్రత్యేక తెలంగాణా డిమాండును పరిశీలించడం జరగదని ప్రధానమంత్రి ఖచ్చితంగా చెప్పారు. రాష్ట్రం విభజనకాకుండా ఉండడం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి శ్రేయస్కరమని ఆమె చెప్పారు. పరిపాలనా ఖర్చులు విపరీతంగా ఉండడంవల్ల ఇంకా ఎక్కువ రాష్ట్రాలు ఏర్పాటుచేయడం సాధ్యంకాని పని. కేంద్ర సహాయం లేకుండా ఇవి మనలేవు.

తెలంగాణా ప్రాంతీయ సంఘానికి విశేష అధికారాలు సంక్రమింపచేస్తూ భారత ప్రభుత్వం చేసిన ప్రకటన, రాష్ట్ర ప్రభుత్వం అమలు జరుపుతున్న ప్రధానమంత్రి యొక్క చరిత్రాత్మకమైన అష్టసూత్ర ప్రణాళిక తెలంగాణా ప్రాంతం అభివృద్ధికి నూతన అవకాశం కల్పిస్తాయని భావించడం జరుగుతున్నది. అష్టసూత్ర ప్రణాళిక ద్వారా తొలిసారిగా భారత ప్రభుత్వం తెలంగాణా అభివృద్ధి విషయంలో ప్రత్యక్షంగా శ్రద్ధ వహిస్తున్నది. కేంద్ర ప్రభుత్వం ఆదేశాలను అనుసరించకపోవడంవల్ల ఉద్యోగులకు కలిగిన కష్టనిష్ఠూరాలను నివారించేందుకు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి అధ్యక్షతన ఏర్పడిన విచారణ సంఘం తెలంగాణా ఉద్యోగుల భయాందోళనలను తప్పకుండా నివారించగలదు. 1968 మార్చి 31 నాటికి తెలంగాణా మిగులునిధులు రూ 28.31 కోట్లు వున్నట్లు భార్గవా కమిటీ ప్రకటించింది. 1968 ఏప్రిల్ నుంచి నాల్గవ ప్రణాళిక అంతం వరకు మొత్తం రూ 44 కోట్లు ప్రత్యేకించవలసిందని భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇచ్చింది. తెలంగాణాలో మామూలుగా జరిగే అభివృద్ధి ఖర్చులు కాక ఈ డబ్బు అదనంగా ఖర్చు పెట్టడం జరుగుతుంది.

1958 వ సం॥ పు ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘం ఉత్తర్వును సవరించడం జరిగింది. తత్ఫలితంగా ఈ ప్రాంతీయ సంఘం సమర్థవంతంగా పని చేయగలందులకు వీలుగా దాని విధులు, అధికారాలు విస్తృతం చేయబడినాయి, తెలంగాణా అభివృద్ధికి ఇది దోహదం కల్గించే చర్య.

వాంఛూ కమిటీ చేసిన సిఫార్సులకు అనుగుణంగా రాష్ట్ర ప్రభుత్వం క్రింద తెలంగాణా ప్రాంతంలో సబార్డినేటు సర్వీసుల పదవులకు ఉద్యోగులను నియమించే పద్ధతులు అందుకు అనుసరించే సూత్రములను ప్రాంతీయ సంఘం యొక్క చర్చనీయాంశాలలో చేర్చడం జరిగింది దీనికి తోడు, తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వ శాఖలు క్వాసీ ప్రభుత్వ సంస్థలు స్టాచుటరీ, కార్పొరేటు సంస్థలలో తెలంగాణా ప్రజలకు ఉద్యోగావకాశాలు కల్పించేందుకు ప్రాంతీయ సంఘానికి అధికారాలు సంక్రమించాయి. ఈ చర్యలు వాస్తవంగా తెలంగాణా ప్రజలకు లాభదాయకంగా వున్నాయి.

తెలంగాణా ప్రాంతం విషయంలో వార్షిక బడ్జెటును చర్చిండానికి ప్రాంతీయ సంఘానికి అధికారం ఇవ్వబడింది. రాష్ట్ర శాసనసభ ముందు ఈ సంఘం ఆమోదించిన తీర్మానాలను, ఇతర నివేదికలపైన చేసిన తీర్మానాలను ఉంచడానికి నియమావళి రూపొందించబడింది. యూనివర్శిటీ విద్య, మధ్య తరహా, భారీ పరిశ్రమలు ప్రాంతీయసంఘం పరిశీలన క్రిందికి తీసుకొని రావడం జరిగింది. ప్రాంతీయ సంఘం పని విధానాన్ని గురించి ప్రతిఏడూ గవర్నరు రాష్ట్రపతికి నివేదిక పంపుతారు. లేదా రాష్ట్రపతి కోరినప్పుడుగవర్నరు నివేదిక పంపుతారు. ఈ చర్యలన్నీ తెలంగాణాప్రాంతీయ సంఘానికి చాలవరకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పిస్తాయి.

తెలంగాణా రక్షణలను గురించి భారత ప్రభుత్వం దిగువ విధంగా పత్రికా ప్రకటన జారీచేసింది.

1956 లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమయంలో తెలంగాణా ప్రజలకు ఇచ్చిన రక్షణలు అమలు పరచక పోవడం పట్ల కొన్నివర్గాల ప్రజలలో ఏర్పడిన అసంతృప్తిని దృష్టిలో వుంచుకొని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి 1969 జనవరి 19 న రాజకీయ పక్షాల నాయకులతో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. హామీలను అమలు పరచడంలో లోపాలు వున్నట్లు వారు గుర్తించారు. వీటిని నివారించడానికి నిర్ణయాలు తీసుకొన్నారు. ఆ తరువాత, తెలంగాణాలో ఉద్యోగ నియామకాల విషయంలో 1957 సం॥ పు ప్రభుత్వోద్యోగుల చట్టంయొక్క 3 వ సెక్షన్ క్రిందవున్న నియమావళి (నివాసానికి సంబంధించిన నియమావళి) రాజ్యాంగ విరుద్ధంగా వున్నాయని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. దీనితో తెలంగాణా ప్రజల మనస్సులో ఆందోళన మరీ ప్రబలింది.

2. తెలంగాణా ప్రజలలో ఆందోళనకుగల కారణాలను పరిశీలించేందుకు భారత ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకొనింది. రాష్ట్ర సమైక్యతను దృఢతరం చేయవలసిన అవసరం వుందనీ, తెలంగాణా ప్రజల శ్రేయస్సుకు తక్షణ చర్యలు, దీర్ఘకాలిక చర్యలు తీసుకోవడం అవసరమనీ భావించింది. తెలంగాణాలో సత్వరాభివృద్ధికీ, ఉద్యోగావకాశాల విస్తరణకూ అనేక చర్యలు తీసుకోవడం జరిగింది అంతేకాకుండా రాష్ట్ర ప్రభుత్వ సన్నిహిత సహకార సహాయాలతో రాష్ట్రంలో అన్ని ప్రాంతాలు సమానంగా అభివృది చెందడానికి పరిస్థితులు కల్పిస్తూ, భారత ప్రధానమంత్రి 1969 ఏప్రిల్ 11 న లోకసభలో కొన్ని ప్రకటనలు చేశారు.

3. ప్రభుత్వోద్యోగాల విషయంలో తెలంగాణా ప్రాంత ప్రజలకు అనుకూలంగా రాజ్యాంగరీత్యా తగిన రక్షణలు కల్పించే విషయమై న్యాయవేత్తలతో కూడిన సంఘం పరిశీలనలు జరిపి ప్రభుత్వానికి నివేదిక పంపింది. తెలంగాణా మిగులు నిధులు నిర్ణయించడానికి సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ వసిష్ఠభార్గవ అధ్యక్షతన నియమించబడిన సంఘం కూడా తన సిఫార్సులను ప్రభుత్వానికి అందజేసింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అధ్యక్షతన తెలంగాణా ప్రాంతపు క్యాబినెటు మంత్రులు ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు, ప్లానింగు కమిషను సభ్యునితో కూడిన ఉన్నతాధికార అభివృద్ధి సంఘం ఇదివరకే పనిచేయ నారంభించింది. ఈ సంఘానికి ప్లానింగు కమిషను సలహాదారుని ఆధ్వర్యంలో అధికారులతో కూడిన ప్రణాళిక ఆచరణ సంఘం సహాయకారిగా పనిచేస్తున్నది. ప్రభుత్వ సర్వీసుల విషయంలో కేంద్ర, రాష్ట్ర సలహా సంఘాలు వాటిముందు వచ్చిన పిటిషనులను పరిశీలించడం దాదాపు పూర్తి చేశాయి. ఈ కేసుల విషయంలో కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలను అమలు పరచేందుకు రాష్ట్ర ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొంటున్నది. దీనికి తోడుగా, కేంద్రప్రభుత్వ ఆదేశాలను అమలు పరచకపోవడంవల్ల తెలంగాణా ఉద్యోగులకు కలిగిన కష్ట నిష్ఠూరాలను ఇతర విషయాలను పరిష్కారం చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం హైకోర్టు మాజీప్రధాన న్యాయమూర్తి అధ్యక్షతన విచారణ సంఘాన్ని కూడా నియమించింది.

4. న్యాయవేత్తలు చేసిన సిఫార్సులను దృష్టిలో వుంచుకొని, తెలంగాణా ప్రాంతపు సత్వరాభివృద్ధికి తెలంగాణా ప్రతినిధుల సహకారాన్ని చూరగొనడానికీ, ఈ ప్రాంత ప్రజలకు ఎక్కువగా ఉద్యోగావకాశాలు కల్పించడానికి ప్రభుత్వం దిగువ పేర్కొన్న నిర్ణయాలను తీసుకొనింది

5. 1968 మార్చి 31 వరకు తెలంగాణా ప్రాంతంలో ఖర్చు కాకుండా వున్న మిగులు నిధులు రూ. 28.34 కోట్లు ఉనట్లు భార్గవా కమిటీ నిర్ణయించింది. ప్రభుత్వం ఈ నిర్ణయాన్ని అంగీకరించింది.

6. గత దశాబ్దం నుంచీ ఈనిధులు పెరుగుతూ వచ్చాయన్న విషయాన్ని కూడా ప్రభుత్వం గమనించింది. ఈ దీర్ఘకాలంలో మిగులు నిధులను వినియోగించక పోవడంవల్ల తెలంగాణా ప్రాంతం అభివృద్ధి కొంతవరకు వెనుకబడిపోయింది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని చతుర్థ ప్రణాళికకాలంలో, తెలంగాణా ప్రాంతపు సత్వరాభివృద్ధికి అదనపు నిధులు కేటాయించాలని ప్రభుత్వం భావించింది. తత్ఫలితంగా, 1969 ఏప్రిల్ 1 నుంచి నాల్గవ ప్రణాళిక అంతంవరకు తెలంగాణా అభివృద్ధికి అదనంగా రూ 45 కోట్లు కేటాయించవలసిందని కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇచ్చింది. రాష్ట్రంలో అభివృద్ధి ఖర్చుల విషయంలో తెలంగాణా వాటాకు నిర్ణయించిన మామూలు నిధులకు తోడుగా ఈ డబ్బు అదనంగా ఖర్చుపెట్టడం జరుగుతుంది.

7. నాల్గవ ప్రణాళిక కాలంలో సత్వరంగా అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచేందుకు వీలుగా కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి తగు విధంగా ఋణ సహాయం చేస్తుంది. 1969 మార్చి 31 నాటికి ఖర్చు కాకుండావున్న మిగులు నిధుల మేరకు ఇచ్చే రుణం ఆంధ్రప్రాంతం భరించవలసి వుంటుంది. 6 వ పేరాలో పేర్కొన్న అదనపు అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమైన ఋణ బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం భరించవలసి వుంటుంది.

8 1968 మార్చి 31 వరకు ఖర్చుకాకుండా వున్న మిగులు నిధులను లెక్క కట్టేందుకు అనుసరించిన పద్ధతినే ఇక ముందు సంవత్సరాలలో మిగులు నిధులను నిర్ణయించడానికి ప్రాతిపదికగా తీసుకోవాలనికూడా భార్గవా కమిటీ సిఫార్సుచేసింది. ఈ సిఫార్సును ఆమోదించవలసిందని కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇస్తున్నది. అంతే కాకుండా ఏ సంవత్సరంలో నయినా ఖర్చు కాకుండా వున్న మిగులు నిధులను ఆ మరుసటి సంవత్సరంలో తెలంగాణా ప్రాంతపు మామూలు అభివృద్ధి ఖర్చులకు తోడుగా వినియోగించాలనికూడా రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇవ్వడం జరిగింది.

9. భవిష్యత్తులో రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాల విషయంలో, తెలంగాణాలోని వెనుకబడిన ప్రాంతాలకు తగిన

ప్రాధాన్యత ఇవ్వాలని కేంద్రప్రభుత్వం భావిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వమూ, ఉన్నతాధికార తెలంగాణా అభివృద్ధి సంఘమూ ఈ విషయాన్ని పరిశీలిస్తాయనీ, రాష్ట్ర సాధారణ అభివృద్ధి ఖర్చు విషయంలో తెలంగాణా వాటాను నిర్ణయించగలవనీ కేంద్ర ప్రభుత్వం ఆశిస్తున్నది.

10. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధికారాలను యెక్కువచేస్తూ అది సమర్థవంతంగా తన విధులను నిర్వర్తించ డానికి వీలుగా 1958 సం॥ ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘం ఉత్తర్వును తదనుగుణంగా సవరించడం జరిగింది.

11. ప్రస్తుతం, ప్రాంతీయ సంఘం అధికారం శాసనాలు చేయడానికి, పనులు నిర్వహించడానికి రాష్ట్ర ప్రభుత్వానికి సిఫార్సులు చేసేంతవరకు మాత్రమే పరిమితమైవుంది. మామూలుగా వుండే ఖర్చులుతప్ప ఇతరత్రా ఆర్థికంగా ఖర్చులు జరగని విషయాలను గురించి మాత్రమే ఈ సంఘం సిఫార్సులు చేస్తూ వుండేది. అయితే వార్షిక బడ్జెటు లేక చతుర్థ పంచవర్ష ప్రణాళికలో పేర్కొన్న ఆర్థిక విషయాలకు సంబంధించి, తన అధికారంలోవున్న అంశాలను గురించి సిఫార్సులు చేయడానికి వీలుగా ఇప్పుడు ప్రాంతీయ సంఘం అధికారాలు విస్తృతం చేయడం జరిగింది. ఇప్పుడు సవరించబడిన ప్రాంతీయ సంఘం ఉత్తరువు ప్రకారం, ప్రాంతీయ సంఘం చేసిన సిఫార్సుల అమలు ప్రగతిని గురించి రాష్ట్రప్రభుత్వం అప్పుడప్పుడు ప్రాంతీయ సంఘానికి నివేదికలు పంపుతూ వుంటుంది. ఇదే విధంగా సర్వీసుల ఏకీకరణకు సంబంధించిన విషయాలలో అమలుజరిపిన నిర్ణయాలను గురించికూడా రాష్ట్రప్రభుత్వం అప్పుడప్పుడు నివేదికలు పంపుతూ వుంటుంది.

12. ప్రాంతీయ సంఘం అధికారావరణలోపలవున్న చర్చనీయాంశాల జాబితాలో యూనివర్శిటీ విద్య, మద్యరకం, భారీ పరిశ్రమల విషయాలు కూడా చేర్చడం జరుగుతున్నది. ప్రస్తుతం ప్రాథమిక, సెకండరీ విద్యను గురించీ, కుటీర, లఘుపరిశ్రమలను గురించి మాత్రమే ఈ సంఘం సిఫార్సులు చేయగలదు. అయితే "తెలంగాణా ప్రాంతంలో రాష్ట్రప్రభుత్వం క్రిందసబార్డినేటు సర్వీసులు, పదవులకు ఉద్యోగులను నియమించే పద్ధతులు అందుకు అనుసరించే సూత్రముల" ను గురించి న్యాయవేత్తల సంఘం చేసిన సిఫార్సులనుకూడా ప్రాంతీయ అంశాల జాబితాలో చేర్చడం జరుగుతున్నది. అంతేకాకుండా తెలంగాణా ప్రాంతంలో రాష్ట్రప్రభుత్వశాఖలు, క్వాసీ ప్రభుత్వ సంస్థలు, స్టాచూరీ, కార్పొరేటు సంఘాలలో తెలంగాణా ప్రజలకు ఉద్యోగావకాశాలు కల్పించేందుకు వీలుగా తగిన చర్యలు సూచించడానికి ఈ సంఘానికి అధికారం వుంటుంది.

13. తెలంగాణా ప్రాంతంలో ఆదాయవ్యయాల విషయాలకు సంబంధించినంతవరకు వార్షిక బడ్జెటుపైన ప్రత్యేక చర్చ జరపడానికి ప్రాంతీయసంఘం ఉత్తరువు ఈ సంఘానికి అధికారం సంక్రమింపజేసుంది. ఈ ఉత్తరువులో చేర్చబడిన మరొక ముఖ్య నిబంధన ఇది. దీనివల్ల ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల విషయంలో వార్షిక ఆర్థిక ప్రకటనలు వేరువేరుగా విపులంగా పేర్కొన బడుతాయి.

14. ప్రాంతీయ సంఘం ఉత్తరువులోచేయబడిన సవరణ ప్రకారం, ప్రాంతీయసంఘం ఆమోదించిన తీర్మానాలు, ఇతర నివేదికల ఆధారంగా ఆమోదించిన తీర్మానాలు శాసనసభ ముందు వుంచబడుతాయి ప్రభుత్వం అప్పుడప్పుడు తనకు పంపేప్రగతి నివేదికను ప్రాంతీయ సంఘం పరిశీలించి, వాటినిగూర్చి తన అభిప్రాయాలను శాసనసభ ముందు వుంచుతుంది.

15. ప్రస్తుతం అమల్లో వున్న పథకం ప్రకారం ప్రాంతీయ సంఘం చేసిన సిఫారసు రాష్ట్ర ప్రభుత్వానికి ఆమోదయోగ్యం కాని పక్షంలో దానిని ముఖ్యమంత్రి గవర్నరుకు నివేదిస్తారు. ఈ విషయంలో గవర్నరు నిర్ణయం అంతిమమైనది. అయితే ఇప్పుడు క్రొత్తగా ఏర్పాటు చేసిన పద్ధతి ప్రకారం, అట్టి సిఫారసును రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించలేని పక్షంలో ముఖ్య మంత్రి ప్రాంతీయ సంఘం అధ్యక్షునితో చర్చించి ఒక అంగీకారానికి వచ్చేందుకు ప్రయత్నం చేస్తారు. ఎట్టి అంగీకారము కుదరని పక్షంలో మాత్రమే ఈ విషయం గవర్నరుకు నివేదించబడుతుంది.

16. ప్రాంతీయ సంఘం పనిని గూర్చి కేంద్ర ప్రభుత్వానికి తెలియడానికి వీలుగా గవర్నరు రాష్ట్రపతి కోరినప్పుడు ఒక నివేదిక పంపుతారు.

17. పరిపాలనా రంగంలోను కార్పొరేటు ఇతర స్టాచూటరీ సంఘాలలోను తెలంగాణా సిబ్బందికి తగిన ఉద్యోగావకాశాలు లభించేందుకు వీలుగా రాష్ట్ర ప్రభుత్వం అసలు పరిస్థితి విషయమై లెక్కలు సేకరిస్తున్నది. ఇది పూర్తి అయిన తరువాత సముచితమైన చర్య తీసుకోవడం జరుగుతుంది.

18 తెలంగాణా ప్రాంతానికి కేటాయించిన నిధులు ఈ ప్రాంతానికే వినియోగించడానికి రాష్ట్ర ప్రభుత్వం చర్యలు తీసుకొంటుంది. ఈ నిధులను ఇతర ప్రయోజనాలకు వినియోగించడం జరగదు. రాష్ట్ర ప్రభుత్వం ప్రాంతీయ సంఘం సెక్రెటేరియట్‌కు తగిన ఉద్యోగ సిబ్బందిని నియమిస్తుంది. ఇదివరకే అదనపు ప్రధాన కార్యదర్శిని నియమించడం జరిగింది తెలంగాణా రక్షణలను అమలు పరచడం, ప్రాంతీయ సంఘం సిఫారసులను సత్వరంగాసముచితంగా అమలు పరచడం, సర్వీసులను ఏకీకరణ చేయడం, 1956 సం॥ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం సందర్భంగా ఉత్పన్నమైన సమస్యలను పరిష్కరించడం— ఈ విషయాలను అదనపు ప్రధాన కార్యదర్శి చూస్తారు.

19. తెలంగాణా ప్రాంతపు అవసరాలను, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని కేంద్ర ప్రభుత్వం తీసుకొన్న ఈ నిర్ణయాలు యావదాంధ్రప్రజలకు అంగీకారయోగ్యంగా వుంటాయనీ, రాష్ట్రంలో అన్ని ప్రాంతాలు సముచితంగా అభివృద్ధి చెందడానికి రాష్ట్ర ప్రజల సహకార సహాయాలు లభించగలవనీ కేంద్ర ప్రభుత్వం ఆశిస్తున్నది.

## ప్రవేశిక

" వాణియ తీరవాటిక
భవానియె రాయలసీమ
శ్రీ తెలంగాణము
పూర్ణ రాజ్యరమగా ముగురమ్మల మూర్తిదాల్చి . . . "

ఈ ముగురమ్మల మూలపుటమ్మ మన తెలుగుతల్లి. దక్షారామం, శ్రీశైలం, కాళేశ్వరం—త్రిలింగభూమిగా పేరందిన తెనుగునేల, నేటి ఆంధ్రప్రదేశ్‌గా రూపొందింది. సర్కారాంధ్రము, తెలంగాణము, రాయలసీమ అనే మూడు ప్రధాన భాగాలుగా ఆంధ్రప్రదేశ్ గత దశాబ్దకాలంలో ప్రగతి పథంలో పురోగమిస్తున్నది.




ఒకే సరస్సులో విరిసిన వేయి పద్మాల వెల్లువగా, ఒకే సంస్కృతి సూర్యుడు సాచిన కోటి కిరణాల క్రొత్త కాంతిగా తెలుగు జీవితం ఐక్యత పునాదిగా ఆనందం సౌధంగా అలరారుతున్నది.

చారిత్రిక కారణాలవల్ల విడిపోయి వేరుగా వుంటున్న తెలుగు ప్రజలందరినీ ఒకే పరిపాలనా వ్యవస్థ క్రిందికి తీసుకు రావడానికి జరిగిన కృషి, చేసిన త్యాగాలు ఏనాటికీ విస్మరించరానివి. తెలుగు వారికి ప్రత్యేకరాష్ట్రం కావాలనే ఉద్యమం జాతియోద్యమంలో ప్రధాన భాగంగానే కొనసాగింది. పరిపాలనలో ప్రజలు భాగస్వాములు కావాలంటే ప్రభుత్వభాష ప్రజల భాష అయి వుండాలనే ఆశయంతో, అటు సర్కారు, రాయలసీమ జిల్లాలలోనూ, యిటు తెలంగాణములోనూ ప్రజోద్యమాలు ప్రారంభమై ఫలవంతమైనవి. 1956 నవంబరు 1 వతేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణ సమగ్రాంధ్ర సంస్కృతి వికాసానికి మొదటి మెట్టు.

1961 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనాభా 359.83 లక్షలు. మన రాష్ట్రవిస్తీర్ణం 1,06,286 చ. మైళ్లు. భారతదేశంలో జనాభా దృష్ట్యా మన రాష్ట్రానిది నాలుగవ స్థానం. విస్తీర్ణంలో ఐదవ స్థానం. దేశంలో హిందీ మాట్లాడే వారి తర్వాత తెలుగుభాష మాట్లాడే ప్రజలే అధిక సంఖ్యాకులు.

## మనది మహోజ్జ్వల చరిత్ర

మన తెలుగుభాష తియ్యని భాష, ప్రాచ్య దేశాలలో ఇటాలియన్ భాషవంటిదని ప్రస్తుతి గన్న భాష.

" తెనుగదేలయన్న దేశంబు తెనుగేను

తెనుగు వల్లభుండ . ......"నని ఆంధ్రభోజుడుగా వాసికెక్కిన శ్రీకృష్ణదేవరాయలు చాటుకున్నాడు.

" కోమల గోస్తనీ రుచులకున్ కదళీ ఫలపాక సిద్ధికిన్

లేములు గూర్చు మా తెనుగు లేత ముదుల్ల వెలార్చు "

వేడ్కతో ఆధునిక కవితాచార్యులు రాయప్రోలు సుబ్బారావుగారు " అభినవ స్వరకల్పనకు " ఉద్యమించారు. తెలుగు జాతీయ భాషగా వుండదగినదని అనేక సుప్రసిద్ధ భాషా శాస్త్రవేత్తలు అభిప్రాయం వెలుబుచ్చారు.



లేపాక్షి బసవయ్య



నాగార్జునకొండ శిల్పం

మన యిరుగు పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాల సరిహద్దు ప్రాంతాల్లోనూ దేశంలోని యితర రాష్ట్రాలలోనూ, లక్షలాది తెలుగు ప్రజలు నివసిస్తున్నారు. వారందరూ ఆయా రాష్ట్ర ప్రజలతో కలిసిమెలిసి స్నేహ వాతావరణంలో వుంటున్నారు. ఆ ప్రాంతాల ప్రభుత్వాలు ప్రజలు కూడా తెలుగుభాషా సంస్కృతి ప్రచారానికి కొంతవరకు దోహదం చేస్తున్నారు.

విదేశాలలో సైతం ఆంధ్రులు అసంఖ్యాకంగా నివసిస్తున్నారు. దక్షిణాఫ్రికా, మారిషస్, సిలోన్, బర్మా, మలేషియా, సింగపూరు, ఇండోనేషియా మొదలైన దేశాలలో తెలుగువారు చాలామంది వున్నారు. మన రాష్ట్రం వెలుపల సుమారు ఒకకోటి మంది తెలుగు ప్రజలున్నారు.

విదేశాలలో వున్నా యితర రాష్ట్రాలలో ఉన్నా తెలుగు ప్రజలందరూ భావైక్యత దృష్ట్యా ఒకటే. ఒకే సంస్కృతి, ఒకే భాష. ఒకే మాట, ఒకే పాట.

తెలుగుజాతి అనాది నుండి కళలకు కాణాచి: శిల్పం, చిత్రం, సాహిత్యం, సంగీతం, అన్ని కళల్లో అభివృద్ధి చెందిన జాతి, తెనుగుజాతి.

మహోజ్వల చరిత్ర కలిగిన జాతి మనజాతి.

## చరిత్ర-సంస్కృతి

ఇమ్ముగ గాకుళమ్ము మొదలీ వరకుం గల
యాంధ్ర పూర్వ రాజ్యమ్ముల పేరు చెప్పిన
హృదంతరమేలా చలించిపోవు,
నార్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములు గాగ నీ తనువునన్
ప్రవహించునో యాంధ్రరక్తముల్ !



నాగార్జునకొండ శిలాఫలకం

చరిత్రకు తెలిసినంతవరకు యిది రెండువేల సంవత్సరాల నాటి నిరంతర ప్రవాహం. అంతకు పూర్వం నుండి గూడా ఆంధ్రుల సంస్కృతి జీవనదిగా ప్రవహిస్తూనే ఉంది. అడ్డంకిగా నిల్చున్న అనేకమైన కొండలను, కోనలను, అడవులను, అగాధాలను అధిగమించి రెండువేల సంవత్సరాలుగా ప్రవహిస్తున్న యీ నది ఎన్ని పాయలుగనో చీలినా అన్నీ మళ్లీ ఏకమై అద్వైత స్వరూపంతో, ఐక్యతా వార్ధిలో సంగమిస్తున్నవి. అనాది నుండి నేటివరకు ఆంధ్ర చరిత్రకు పర్యాయపదం ఐక్యత.

## తొలి వెలుగులు

ఐతరేయ బ్రాహ్మణంలోని అంధ్రుల ప్రసక్తి మొదలయిన పురాతన గాథల్ని అలా ఉంచితే, శాలివాహనులు లేక శాతవాహనులతో మనకొక చారిత్రిక స్వరూపం యేర్పడింది. సకలాంధ్ర దేశాన్ని పరిపాలించిన మొట్టమొదటి రాజులు శాలివాహనులు. ఈ వంశీయులు మొత్తం నాలుగు వందల యాభై సంవత్సరాలు రాజ్యం చేశారు. వీరి మూలపురుషుడు శ్రీముఖుడు. క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దంలో ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించి, మగధ సామ్రాజ్యాన్ని గూడా ఆక్రమించుకొని ఉత్తర హిందూదేశానికి గూడా ఆంధ్ర యశస్సును విస్తరింపజేసిన పరాక్రమవంతుడు శ్రీముఖుడు. ఆంధ్ర రాజ్యానికి మొట్టమొదట కృష్ణానదీ తీరంలోని శ్రీకాకుళం రాజధానిగా ఉండేది. తరువాత రాజధాని ధాన్యకటకానికి మారింది. గుంటూరు జిల్లాలో కృష్ణానది తీరాన అమరావతికి దగ్గరగా ఉన్న ధరణికోటకే ధాన్యకటకం అనిపేరు. ఆ కాలంలో ఆంధ్ర సామ్రాజ్యం తూర్పున బంగాళాఖాతం మొదలుకొని పడమట అరేబియా సముద్రం వరకు వ్యాపించింది.

శాలివాహన చక్రవర్తుల్లో హాలుడు అద్వితీయుడు. ఈయన ప్రాకృత భాషలో గొప్ప కవీశ్వరుడు, కవిపోషకుడు. శాతవాహనులు ఆంధ్ర వంశపు రాజులైనా ప్రాకృత భాషను ఆదరించారు. ఆనాటి రాజభాష గూడ ప్రాకృతమే. బహుశ తెలుగు వారిలో మొట్టమొదటి గ్రంథకర్త హాలుడేనేమో! మనకు లభ్యమైన మన ప్రాచీన సాహిత్య సంపదలో హాలుని "గాథాసప్తశతి"



అమరావతి శిల్ప ప్రాభవం

దాక్షిణాత్యుల సంస్కృతికి నాందీ ప్రస్తావన జరిపినవారు మన ఆంధ్ర శాలివాహనులే.

శాలివాహనుల తరువాత తెలుగు దేశంలో చెప్పుకోదగిన రాజులు ఇక్ష్వాకు వంశంవారు. ఇక్ష్వాకు రాజ్యాన్ని మన తెలుగు దేశంలో స్థాపించిన మొదటి రాజు వాసిష్ఠీపుత్ర శాంతిమూలుడు. ఆయన కాలంలో తెలుగుదేశం సుభిక్షంగా ఉన్నట్లూ, వ్యవసాయం పాడి బాగా అభివృద్ధి చెందినట్లూ చెపారు ఇప్పటి నాగార్జునకొండ ప్రాంతంలోనే ఆనాడు వైభవశ్రీతో వెలుగొందే విజయపురి ఉండేది ఇక్ష్వాకుల చరిత్రతో పెనువేసుకొని ఉన్న తెలుగువారి ఉత్కృష్ట సంస్కృతికి చిహ్నం నాగార్జునకొండ. ఆ నాడు అది శ్రీపర్వతం. శ్రీపర్వతం ఒక గొప్ప బౌద్ధ సంఘారామం. ఆ కాలంలో యీ బౌద్ధ సంఘారామాన్ని సందర్శించడానికి కాశ్మీర గాంధార, చీన, చిలాత, అపరాంత, వంగ, వనవాసి, యవన, ద్రమిళాది దేశాలనుంచి, సింహళాది ద్వీపాలనుంచి, బౌద్ధులు

ముఖ్యమైనది. హాలుని మంత్రి గుణాఢ్యుడు ప్రాకృత భాషలో బృహత్కథ పేరుతో గొప్ప కథల పుస్తకాన్ని రచించాడు. కథానికా రచనాచాతుర్యం ఆంధ్రులకు ఆనాడే అబ్బింది. హాలుని తరువాత వచ్చిన వారిలో గౌతమీ పుత్రశ్రీ శాతకర్ణి, గౌతమీ పుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి ముఖ్యులు.

శాలివాహనుల కాలాన్ని ఆంధ్రుల చరిత్రలో బంగారుకాలం అనవచ్చు. ఆ కాలంలో ప్రజలు అన్ని విధాలా అభివృద్ధి పొందారు. అప్పుడు ప్రబలంగా వ్యాపించిన మతం బౌద్ధం. అప్పటి బౌద్ధస్తూపాలు, బౌద్ధ విహారాలు ప్రఖ్యాతమైనవి. ధాన్యకటకం భట్టిప్రోలు, గుంటుపల్లి, ఘంటసాల, చినగంజాం, మొదలైన చోట్ల బౌద్ధ స్తూపాలు వెలసినవి. ఈ స్తూపాలను కట్టడంలో ఆ నాటి మనవాళ్ళు చూపిన శిల్పకళా ప్రావీణ్యం నేటికీ మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. అప్పటి బౌద్ధ సంఘారామాలు గొప్ప విద్యా పీఠాలు, మన దేశంలోని ఆ నాటి బౌద్ధవిద్యా పీఠాలతో ధాన్యకటకపు విద్యాపీఠం చాలా గొప్పది. శాలివాహనుల కాలంలో రోము వంటి పశ్చిమ నగరాలతోనూ, తూర్పు దేశాలతోనూ వర్తక వాణిజ్యాలు బాగా జరుగుతుండేవి. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి ఓడల వర్తకానికి, సముద్రయానానికీ ఎంతో ప్రాముఖ్యం ఇచ్చాడు. ఆ మహారాజు నాణాలమీద లంగరు ఓడ ముద్రలున్నవి. ఓడల వర్తకంతోపాటు మన మతం, మన సంస్కృతి, మన కళలు గూడ తూర్పు దేశాలకు ఎగుమతి అయినవి. బౌద్ధమతం ప్రజల్లో బలంగా ఉన్నా, శాలివాహన రాజులు మాత్రం వేదమతావలంబకులే. అయినా ఆ రాజులు బౌద్ధ మతాన్ని ఆదరించారు. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన మన నాగార్జునుడు ఆ కాలపు వాడే. ఇప్పటి అమరావతీ స్తూపం—అప్పటి ధాన్యకటక స్తూపం—ఆనాటివే.



యాత్రార్థం వచ్చేవారు. ఆ నాడు బౌద్ధులందరికీ నాగార్జునుని కొండ గొప్ప పుణ్యస్థలం. నాగార్జునాచార్యుని దివ్యతేజముతో ఆ ప్రాంతం ఖండాంతర యశస్సును సంపాదించింది. నాగార్జునుని కొండలోని ప్రధాన స్తూపానికి మహా చైత్యమని పేరు. ఈ మహా చైత్యంలో బుద్ధభగవానుని పవిత్ర ధాతువును పదిలం చేశారు.

నాగార్జున కొండ స్తూపశిల్పం ప్రశస్తమైనది. ఆ నాటి తెనుగు బౌద్ధ శిల్పకళ హిందుదేశం అంతటిలోను అత్యుత్తమమైందిగా ప్రశస్తి పొందింది. నాటి శిల్పాలలోని కథావస్తువు బుద్ధచరిత్రం అయితే ఆ శిల్పాలలో ఆంధ్ర శిల్పులు ఆ నాటి మన జీవన సంపదనే ప్రతిబింబింప జేశారు. ఆ నాటి మన చరిత్ర, సంస్కృతి, సభ్యత యీ శిల్పాలలో సాక్షాత్కరిస్తున్నది. ఇక్ష్వాకుల తరువాత ఆంధ్ర దేశంలో ప్రత్యేకంగా చెప్పవలసినవారు బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, కందార వంశీయులు, విష్ణుకుండిన వంశపురాజులు క్రీస్తుశకం అయిదవ శతాబ్ది చివరి భాగంనుంచి ఏడవ శతాబ్ది మొదటి భాగం వరకు దాదాపు నూరు, నూట యాభై సంవత్సరాలు విష్ణుకుండినులు పరిపాలన సాగించినట్లు మనకు తెలుస్తున్నది. ఇక్ష్వాకు వంశం వారికి, విష్ణుకుండినులకు మధ్యకాలంలో మన ఆంధ్రదేశంలో కొన్ని ముఖ్యమైన మార్పులు జరిగినవి. ఉత్తర దేశం నుండి వచ్చిన వారిలో వేరు వేరు తెగలవారు ఇక్కడ స్థిరపడి పోయారు. వీరికీ, యిక్కడ అనాదిగా ఉంటున్నవారికీ మధ్య ఏర్పడ్డ సంబంధాలవల్ల విడి విడి తెగలు తొలగిపోయి ఒక సమైక్యమైన తెనుగు సమాజం ఏర్పడింది, ఇదొక గణనీయమైన పరివర్తన ఇదే కాలంలో మతంలో గూడా మార్పు వచ్చింది. ఇన్నాళ్ళుగా ప్రబలమైవున్న బౌద్ధం శిథిలమైపోయి వేద మతం ప్రజల్లో బాగా విస్తరించసాగింది. ప్రాకృత భాషకు. ప్రాకృత కవులకు ఆదరం తగ్గిపోయి సంస్కృత భాషకు, సంస్కృత కవులకు, వేద విద్యలకు ఆదరాభిమానాలు అధికం కాసాగినవి. అప్పుడే మన తియ్యని తెలుగు భాష ఆకృతి బయలు పడడం ప్రారంభమైంది. అందమైన మన తెలుగు భాషకు అది బాల్యావస్థ ; ఆనాడే తెనుగు తల్లి తొలిపలుకు పలికింది.

( సశేషం )



—×—

# రేపు ఉగాది

-లక్ష్మీనాథ్

రేపు ఉగాది
భవిష్యత్తుకు స్వాగతం పలుకుతూ
గత జీవితానికి స్వస్తి చెబుతూ
వర్తమానంలో ఒంటరిగా నిలబడి
ఊహల ఊయలకు రూపకల్పన చేసుకుంటూ
ఆశగా ఆనందించే ఉగాది రేపు.

నిన్నటి బాధల్ని నిముషంలో మరచిపోయి
నేటి రౌరవ నరకాన్ని లిప్తలో దాటి
రేపటి స్వర్గధామాన్ని చేరుకోవడానికై
ఆయాసం మరచి ఆలోచించాలి రేపు.

ఎప్పుడూ ఉండే ఈ బాధలు
ఎప్పటిలా ఎదురు తిరుగుతుంటే
ఎదిరించే శక్తి ఒక్క క్షణం తెచ్చుకొని
గాలిమేడలో ఆ బాధల్ని బంధించాలి రేపు.

ఆశలు ఆకాశంవైపు ఆశగా చూస్తున్నా
అవకాశాలు అగాధంలోకి కసిగా త్రోస్తున్నా
విషాదంలో వినోదం వెతుక్కుంటూ
పదిమందీ చేసే పరిహాసాలను
దరహాసంతో ఎదురించాలి రేపు.

పావలా సొమ్ము పది రూపాయలు కమ్ముతూ
పదిలంగా పొట్ట పెంచుతున్న కిరాణా షాపు
క్రిష్ణయ్యను
కలియుగ దాతగా మరొక్కసారి పొగిడి
వెచ్చాలు అరువు తెచ్చుకోవాలి రేపు.

# ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ ప్రగతి

— పసల సూర్యచంద్రరావు

ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం మన రాష్ట్ర ప్రభుత్వము 1957వ సంవత్సరం నవంబరు 18వ తేదీన ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని నెలకొల్పింది.

కార్యకర్తలు, సర్వసభ్యుల ఉత్సాహ ప్రోత్సాహాలతో దిన దిన వికాసాన్ని పొందుతూ గత పన్నెండు సంవత్సరాలుగా రాష్ట్రమున సంగీత, నృత్య, నాటక రంగముల అభివృద్ధికి అకాడమీ అవిరళ కృషి జరుపుతున్నది.

రాష్ట్రములో వివిధ సంస్థలు, వ్యక్తులు కళా రంగంలో చేసిన సేవను తెలిసికొనుటకుగాను ప్రారంభముననే అకాడమీ సర్వే కార్యక్రమమును తలపెట్టింది. మూడు ప్రాంతములందు ఇందుకు అకాడమీ నియమించిన నలుగురు పరిశీలకులు (సర్వేయర్లు) ఈ కళల అభివృద్ధికి కృషి చేస్తున్న సంస్థలు, కళాకారులు, బృందాలు ఎక్కడెక్కడ ఉన్నవి, ఎన్నెన్ని ఉన్నవి మొదలగు సమాచారమును సేకరించారు. ఇరువది జిల్లాలలో సేకరించిన ఈ సమాచారమును 'ఆంధ్ర ప్రదేశములో సంగీత నృత్య నాటక కళలు' అను పేరుతో అకాడమీ ఒక గ్రంథమును ప్రచురించింది.

## కూచిపూడి నాట్య సదస్సు

1958లో భారతీయ నాట్య కళను గురించి ఢిల్లీలో ఒక గోష్ఠి జరిగింది. ఆ సదస్సు శాస్త్రీయ నృత్యములను గుర్తించడంలో కూచిపూడి నాట్యమును విస్మరించుటచే ఆంధ్ర నృత్య రంగంలో తీవ్రమైన అసంతృప్తి కలిగింది. కూచిపూడి నృత్యము కూడ శాస్త్రీయమైనదని నిరూపించుటకు 1959 ఫిబ్రవరి 28, మార్చి 1వ తేదీలలో హైదరాబాదులో అకాడమీ కూచిపూడి నాట్య సదస్సును నిర్వహించింది. ఆచార్య విస్సా అప్పారావు, శ్రీ పుచ్చా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, డాక్టర్ మారేమండ రామారావు, శ్రీ సి. వి. ఆర్ ప్రసాద్, శ్రీ అయ్యంకి తాండవ కృష్ణ, శ్రీ బందా కనక లింగేశ్వరరావు, శ్రీ లంక సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ నటరాజ రామకృష్ణ మున్నగు శాస్త్రజ్ఞులు, కళానిధులు, వ్యాసములు చదివి కూచిపూడి నాట్యము అన్ని విధముల భరతముని నాట్య శాస్త్రమును అనుసరించిందని అందువలన మొత్తం భారతీయ నృత్య కళల వలెనే సంపూర్ణంగా సశాస్త్రీయమైనదని నిర్ణయించారు. ఈ విధంగా నాట్య సదస్సు తీర్మానం కూడా చేసి ప్రచురించినది.

సదస్సున వ్యక్తపరచిన అభిప్రాయాలకు అనుగుణంగా కూచిపూడి నాట్య శిక్షణకు కూచిపూడి గ్రామములో ఒక కేంద్రం స్థాపించడానికి పథకమును రూపొందించి, కేంద్ర సంగీత నాటక అకాడమీ సహాయంతో దానిని అమలు పరచడం జరిగింది. దాని ఫలితమే ఇప్పుడు కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళా క్షేత్రం నిర్వహిస్తున్న సిద్ధేంద్ర నాట్య కళాశాల. దీనిని 1960 డిసెంబరులో అకాడమీ ప్రారంభించింది.

సదస్సులో చదివిన వ్యాసములు కూచిపూడి నాట్య సదస్సు ప్రత్యేక సంచిక పేరుతో ప్రచురించబడినవి.

## జానపదగేయములు

రాష్ట్రంలో వివిధ ప్రాంతములలోని జానపద గేయములను ముందు తరముల వారి ప్రయోజనార్థం భద్రపరచాలని అకాడమీ సంకల్పించి, వాటిని సేకరించి ఒక గ్రంథం ప్రచురించినది.

## నిస్సహాయస్థితిలో నున్న కళాకారులకు ఆర్థిక సహాయము

నృత్య, నాటక, సంగీత కళారంగములకు సేవచేసి వృద్ధాప్యమున ఆర్థికముగా నిస్సహాయ స్థితిలో నున్న కళాకారులకు సహాయము కల్పించవలెనని అకాడమీ 1959లో తలపెట్టింది. ప్రస్తుతము 25 మంది కళాకారులకు అకాడమీ నెలసరి 40 రూపాయలు ఆర్థిక సహాయమును అందిస్తున్నది.

ఇంకా ఎందరో కళాకారులు నిస్సహాయస్థితిలో నున్నారు. వారికి తప్పక సహాయము అందజేయాలని అకాడమీ 1967లో

నిస్సహాయ కళాకారుల సహాయ నిధిని ప్రారంభించింది. రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ రాఫిల్ టికెట్ల అమ్మకములో పాల్గొనడం ద్వారా 5,500 రూపాయలను సేకరించింది. కొన్ని లక్షల నిధి ఏర్పరచి, వచ్చు ఆదాయాన్ని నిస్సహాయ కళాకారులకు నెలసరి భత్యం రూపంగా సహాయము చేయవలెనన్నది అకాడమీ ధ్యేయం.

## గురుకులములు

కర్ణాటక సంగీతం, శాస్త్రీయ నృత్యం ఉన్నత ప్రమాణాలను పరిరక్షించడానికి గాను సంప్రదాయసిద్ధమైన గురుకుల పద్ధతిలో సంగీత శిక్షణకు అవకాశములు కల్పించడం అవసరమని అకాడమీ భావించింది. 1959 అక్టోబర్‌లో ఈ పద్ధతిని గుంటూరులో ఒకటి, విజయవాడలో ఒకటి_రెండు గురుకులములను అకాడమీ ప్రారంభించింది. ప్రస్తుతం అకాడమీ నెల్లూరులో ఒక గాత్ర సంగీత గురుకులం, చిలకలూరిపేటలో నాదస్వర గురుకులం, తాడేపల్లిగూడెంలో డోలు గురుకులం, విశాఖపట్టణంలో వీణ గురుకులం, విజయనగరంలో భాగవత నాట్య సంప్రదాయ కళలో శిక్షణ నివ్వడానికి భాగవత గురుకులం, హైద్రాబాదులో కూచిపూడి గురుకులం ఏర్పరచింది.

## కర్ణాటక సంగీత సదస్సు

1960 ఫిబ్రవరి 25 నుండి 28 వరకు నాలుగురోజులపాటు అకాడమీ, కర్ణాటక సంగీత సదస్సును హైదాబాదులో నిర్వహించింది. ఈ సందర్భమున సంగీత కచేరీలు కూడా ఏర్పాటు చేయడం జరిగింది. సదస్సు విశేషములతోను, అచట చదివిన వ్యాసములతోను కర్ణాటక సంగీత సదస్సు సంచికను అకాడమీ ప్రచురించినది.

## విశిష్ట సభ్యత్వము

నృత్య, సంగీత, నాటక, చలన చిత్ర రంగములలో గణనీయమైన కృషిచేసిన వారిని అకాడమీ విశిష్ట సభ్యత్వముతో సన్మానించుచున్నది.

## నాటక సదస్సు

1960 డిసెంబరు 12 నుండి 15 వరకు అకాడమీ నాటక సదస్సును నిర్వహించినది. నాటక కళను గురించి మొత్తం 19 వ్యాసములు చదువబడినవి. ఈ వ్యాసములతోను, సదస్సు సిఫార్సులతోను నాటక సదస్సు సంచిక ఒక దానిని అకాడమీ ప్రచురించినది. సదస్సు నాటకరంగాభివృద్ధికి చేసిన సూచనలను, ఆర్థిక పరిధులకు లోబడి అమలుపరచుచున్నది.

## హిందుస్థానీ సంగీత ఉత్సవ సదస్సు

1962 ఫిబ్రవరి 4, 5, 6 తేదీలలో అకాడమీ హిందూస్తానీ శాస్త్రీయ సంగీత సదస్సును ఏర్పాటు చేసింది.

సదస్సులో చదువబడిన వ్యాసములను "హిందూస్తానీ ఉత్సవ సదస్సు" సంచిక అను పేరుతో ప్రచురించటం జరిగింది.

## నాటక విద్యాలయములు

నాటక కళలో శిక్షణ నిచ్చే విద్యాలయములను ప్రోత్సహించాలన్నది అకాడమీ లక్ష్యాలలో ఒకటి. ఈ లక్ష్యముతోనే హైదాబాదు నందలి నాట్య విద్యాలయమునకు తోడ్పడుచున్నది. కోస్తాజిల్లాలకు, రాయలసీమకు విజయవాడలోను, అనంతపురంలోను నాటక విద్యాలయములను స్థాపించి, నిర్వహించడానికి అకాడమీ ఆర్థిక సహాయం చేసింది.

## నాట్యకళ

సంగీత, నాటక, నృత్య కళా విజ్ఞానమును ప్రచారము చేయడానికిగాను అకాడమీ 1963 లో 'నాట్యకళ' అనే పత్రికను ప్రారంభించినది. ద్వైమాస పత్రికగా ఆరంభించబడిన ఈ పత్రిక 1965 నుండి మాస పత్రికగా ప్రచురితమగుచున్నది. ఆయా కళలపై ప్రామాణిక వ్యాసములను ప్రకటించడమే కాక అకాడమీ ప్రచురించ తలపెట్టిన గ్రంథములను 'నాట్యకళ' ధారావాహికంగా వెలువరిస్తున్నది. అనేక ప్రత్యేక సంచికలు వెలువరించినది.

## మహారాజా స్వాతి తిరునాళ్ 150వ జయంత్యుత్సవము

1963 మే 8 నుండి 10 వరకు ప్రసిద్ధ సంగీత కృతికర్త మహారాజా స్వాతి తిరునాళ్ 150 వ జయంత్యుత్సవమును అకాడమీ నిర్వహించినది.

## క్షేత్రయ్య ఉత్సవములు

1963 ఆగస్టు 16, 17 తేదీలలో సుప్రసిద్ధ వాగ్గేయకారుడు శ్రీ క్షేత్రయ్య 300 వ జయంత్యుత్సవమును అకాడమీ నిర్వహించింది. అంతేకాక అట్టి ఉత్సవమును జరపడానికిగాను అకాడమీ ఐదు సంస్థలకు ఆర్థిక సహాయం చేసింది.

## కాళిదాస నాట్య సమారోహ్

మధ్యప్రదేశ్ కళా పరిషత్తు ప్రతి సంవత్సరం మహాకవి కాళిదాసు సంస్కృత రూపకముల ప్రదర్శనములలో పోటీలు, అఖిల భారత స్థాయిలో జరుపు తున్నది. 1961లో విజయనగరానికి చెందిన సంపత్ కుమార్ బృందమును 'అభిజ్ఞాన శాకుంతలం' ప్రదర్శన ఇవ్వడానికి అకాడమీ పంపింది. ఈ బృందము, మద్రాసు బృందము ప్రథమ బహుమతిని పంచుకొన్నవి.

1963లో నటరాజ రామకృష్ణ బృందమును అకాడమీ తరఫున పోటీలలో పాల్గొనుటకు పంపుట జరిగినది. ఈ బృందము ప్రదర్శించిన 'కుమారసంభవము' నృత్య నాటికకు ప్రథమ బహుమతి లభించినది.

## కర్ణాటక సంగీతోత్సవ సదస్సు

1964 ఫిబ్రవరి 21 నుండి 24 వరకు నాలుగు రోజులు అకాడమీ ఆంధ్రప్రదేశ్ సంగీత సభల సమాఖ్య సహకారముతో కర్ణాటక సంగీతోత్సవ సదస్సును విజయవాడలో నిర్వహించినది.

## వరంగల్‌లో సంగీతోత్సవం

1966 మార్చి 17 నుండి 20 వరకు వరంగల్లులో జరిగింది. అకాడమీ ఆధ్వర్యమున స్థానిక సంస్థ అయిన నటరాజ కళా సమితి సహకారముతో ఉత్సవమును ఆంధ్రప్రదేశ్ సంగీత సభల సమాఖ్య నిర్వహించినది.

## అఖిల భారత నృత్య సదస్సు ఉత్సవం

1964 మార్చి 14 నుండి 17 వరకు అకాడమీ, రవీంద్ర భారతితో కలిసి అఖిలభారత నృత్యోత్సవ సదస్సును హైద్రాబాదులో నిర్వహించినది. దేశం నలుమూలల నుండి నాట్యకళా కోవిదులు, పండితులు వచ్చి సదస్సులో పాల్గొని వివిధ భారతీయ నృత్యరీతుల గురించి వ్యాసములను చదివారు. కూచిపూడి, ఒడిస్సి, మణిపూరి, కథక్, భరతనాట్యం, కథాకళి నృత్యములను ఆయా ప్రాంతముల నుండి వచ్చిన బృందములు ప్రదర్శించినవి.

## హరికథా సప్తాహము

1964 డిశంబర్ 27 నుండి 1965 జనవరి రెండవ తేదీ వరకు తాడేపల్లిగూడెములో స్థానిక సంస్కృతీ కళాక్షేత్రము సహకారముతో అకాడమీ కథాసప్తాహమును సదస్సును నిర్వహించినది.

సప్తాహకాలమున సుప్రసిద్ధ హరి దాసులనేకులు కథాగానములు చేసిరి. 1965 జనవరి రెండవ తేదీన హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాస వర్ధంత్యుత్సవములు నిర్వహింపబడినవి. శ్రీ నారాయణదాసుగారి శిలా విగ్రహము అచ్చట ప్రతిష్ఠించబడినది.

## నాటక రచన పోటీ

1965—66లో అకాడమీ చారిత్రక, పౌరాణిక నాటక రచనల పోటీని నిర్వహించినది. రాష్ట్రం నలుమూలల నుండి మొత్తం 86 రచనలు పోటీకి వచ్చినవి. పోటీలో మొదటి బహుమతి పొందిన 'లేపాక్షి' నాటక ప్రదర్శనమున కూడా అకాడమీ పోటీని నిర్వహించినది. ఆంధ్ర నాటక కళా పరిషత్తు, అకాడమీ తరఫున పోటీని 1967 నవంబరులో ఏలూరులో జరిపింది. దీనిలో కొల్లూరుకు చెందిన శ్రీ వేంకటేశ్వర నాటక కళా పరిషత్తుకు ప్రథమ బహుమతి లభించింది.

## బళ్లారి రాఘవ సంస్మరణోత్సవం

బళ్లారి రాఘవ సంస్మరణోత్సవములను పెద్ద ఎత్తున 1964 జూన్ నెలలో హైద్రాబాదులోని రవీంద్రభారతిలో అకాడమీ నిర్వహించింది. ఈ సందర్భమున బళ్లారి రాఘవ చిత్రపటము ఆవిష్కరించబడినది.

## పంచముఖితాళ ప్రదర్శనము

పంచముఖితాళ ప్రదర్శన అను అనన్య సామాన్యమైన కళ ఒకటి ఉన్నదని 1960లో అకాడమీ కనుగొన్నది. ఈ కళను ప్రదర్శించగల ఏకైక కళాకారుడు శ్రీ ముట్నూరి సూర్యనారాయణ శాస్త్రిని అకాడమీ విశిష్ట సభ్యునిగా ఎన్నికచేసి గౌరవించినది. పంచముఖి తాళ ప్రదర్శనమును అకాడమీ రాష్ట్రములో పలు ప్రదేశములలోనే కాక మద్రాసు వంటి ప్రదేశములలో కూడా ఏర్పాటు చేసి, దానిని ప్రచారము చేస్తున్నది. ఈ కళా ప్రదర్శనమును కేంద్ర సంగీత నాటక అకాడమీ సహాయముతో చలన చిత్రముగా నిర్మించుటకు అకాడమీ కృషి చేస్తున్నది.

## వార్షికోత్సవములు

1965 వరకు అకాడమీ సంవత్సరమునకు ఒక సంగీతోత్సవమో, ఒక నృత్యోత్సవమో లేక ఒక నాటకోత్సవమో నిర్వహిస్తూ వచ్చింది. మూడు కళలకు దగిన ప్రోత్సాహము లభించిన గాని వాటి వికాసము జరుగదని, అందుకు ప్రతి సంవత్సరము నృత్య, సంగీత, నాటక రంగములు మూడింటిలో ఉత్సవములు నిర్వహించాలని నేను చేసిన ప్రతిపాదనను జనరల్‌కౌన్సిల్ 1965లో అంగీకరించినది. అప్పటినుంచి ప్రతి సంవత్సరము మూడు రంగములలో ఉత్సవములు నిర్వహింపబడుచున్నవి. రాష్ట్రములో వివిధ ప్రదేశములలో ఉత్సవముల నిర్వహించడానికి ఈ పథకం అవకాశం కల్పించింది. ఉత్సవముల నిర్వహణకై ఒక్కొక్క కళారంగమునకు ఒక్కొక్క సంస్థను రాష్ట్ర స్థాయిగల సంస్థగా అకాడమీ గుర్తించింది. నాటక రంగంలో ఆంధ్ర నాటక కళా పరిషత్తును, సంగీత రంగంలో ఆంధ్రప్రదేశ్ సంగీత సభల సమాఖ్యను, హైదాబాదులో వార్షికోత్సవం నిర్వహించడానికి ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘాన్ని అకాడమీ గుర్తించింది.

## ప్రచురణలు

సంగీత, నృత్య, నాటక కళల గురించి సదస్సులు జరిగినప్పుడు ప్రత్యేక సంచికలు ప్రచురించడమేగాక, ఆయాకళలపై ప్రాచీన అముద్రిత ప్రమాణిక గ్రంథములను వెలుగులోనికి తీసుకొని రావడానికి, సంస్కృతం మొదలైన భాషలలోగల ఉత్తమ గ్రంథములను తెలుగు కళాకారులకు అందుబాటులోనికి తీసుకొని రావడానికి అకాడమీ సంకల్పించింది. 'సంగీత రత్నాకరము' మొదటి భాగమును అనువదింపజేసి సంస్కృతముతో సహా ప్రచురించినది. మిగిలిన భాగములను కూడా వరుసగా ప్రచురించనున్నది.

నృత్యము గురించి జాయాపసేనాని రచించిన 'నృత్తరత్నావళి' గ్రంథమును తెనుగులో మూలముతో సహా త్వరలో ప్రచురించనున్నది. సిద్ధేంద్రయోగి విరచితమైన 'భామాకలాపము' ప్రామాణిక ప్రతి లేనందున, అనేక ప్రతులను పోల్చిచూచి

రూపొందించిన గ్రంథమును 1967 లో వెలువరించినది. కర్ణాటక సంగీతమునకు విజ్ఞాన సర్వస్వముగా పేరుగాంచిన శ్రీ సుబ్బరామ దీక్షితులకృతి 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'ని పరిష్కరించి పునర్ముద్రించనున్నది. కూచిపూడి నృత్యసాహిత్యానికి చెందిన గొల్లకలాపము మున్నగు రచనలను, త్యాగరాజకృతులను ప్రచురించవలెనని అకాడమీ సంకల్పించినది.

## సంస్థలకు ఆర్థిక సహాయము

మూడు కళా రంగములలో ఆయాకళల అభివృద్ధికై కృషి చేయుచున్న సంస్థలకు అకాడమీ ప్రతి సంవత్సరము ఆర్థిక సహాయమును అందజేయుచున్నది.

## సంచార రంగస్థలము

రంగస్థల సౌకర్యములు లేని ప్రదేశములలో వినియోగపడు విధముగా అకాడమీ 33 వేల రూపాయల వ్యయముతో ఒక సంచార రంగస్థలమును నిర్మించినది.

## నాట్యకళ ముద్రణాలయము

సంగీత, నాట్య, నాటక, సాంకేతిక గ్రంథములను, 'నాట్యకళ' పత్రికను ముద్రించుటకు గాను అకాడమీ ఒక ముద్రణాలయము సాపించినది.

## శ్రీ త్యాగరాజ ద్విశత జయంత్యుత్సవములు

సుప్రసిద్ధ వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజ ద్విశత జయంత్యుత్సవములు దేశ వ్యాప్తముగా జరుపవలెనని కేంద్ర సంగీత నాటక అకాడమీ ప్రారంభించిన కార్యక్రమము ననుసరించి ఈ అకాడమీ 1967 ఆగష్టు 27 నుండి 29 వరకు శ్రీ త్యాగరాజ ఉత్సవములను హైదరాబాదులో నిర్వహించినది. ఈ సందర్భమున త్యాగరాజు జీవిత విశేషములను తెలుపు ఫోటో ప్రదర్శనము ఏర్పాటు చేయడము జరిగింది. వారిని గురించి ఒక ప్రత్యేక సంచికను అకాడమీ వెలువరించింది.

## స్కాలర్ షిప్స్

నృత్య, నాటక, సంగీతములలో శిక్షణ పొందుచున్న అర్హులైన విద్యార్థులకు అకాడమీ నెలసరి ఉచిత వేతనములను ఇచ్చుచున్నది.

## గ్రంథాలయము

నృత్య, నాటక, సంగీత కళలను గురించిన గ్రంథములతో ఒక గ్రంథాలయమును ఏర్పరచుచున్నది. ఇప్పటి వరకు ఏడువేల రూపాయల విలువగల గ్రంథములు గ్రంథాలయములో ఉన్నవి.

## సంగీతం టేప్ రికార్డుచేసే పథకము

సుప్రసిద్ధ కళాకారుల గాత్రములను, వాద్యకచేరీలను టేప్‌రికార్డు చేసి భద్రపరచవలెనని అకాడమీ తలపెట్టినది. ఇంతవరకు శ్రీ మరువాడ రామమూర్తి భాగవతార్ చెప్పిన 'రామసుగ్రీవ మైత్రి', 'ఈశ్వర తపోభంగము', శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి చెప్పిన 'త్యాగరాజు' అను హరికథను, శ్రీమతి ఎం. ఎల్. వసంతకుమారి, శ్రీ నేదునూరి కృష్ణమూర్తి, శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు, శ్రీ వాసా కృష్ణమూర్తి, శ్రీ ఎం.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ, శ్రీ నూకల చినసత్యనారాయణ త్యాగరాజు ఉత్సవముల సందర్భమున పాడిన త్యాగరాజ కృతులను టేప్‌రికార్డు చేయడం జరిగింది.

అంతేగాక ప్రసిద్ధ సంగీత విద్వాంసులైన శ్రీయుతులు ఈమని శంకరశాస్త్రి, ఎం. బాలమురళీకృష్ణ, ఎం. ఎస్. బాల సుబ్రహ్మణ్యశర్మ, షేక్‌చిన మౌలానా, నేదునూరి కృష్ణమూర్తి, మారెళ్ల కేశవరావు, శ్రీమతి టి. సీతగార్ల సంగీత గానం రికార్డు చేయడం జరిగింది.

## మ్యూజియం

చారిత్రక ప్రాధాన్యంగల వాద్యాలను సేకరించి ఒకమ్యూజియమును రూపొందించడానికి అకాడమీ కృషి ప్రారంభించింది. సుప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ వీణా వెంకటరమణదాసు గారు వినియోగించిన వీణలను అకాడమీ సేకరించి భద్రపరచింది. నాటకరంగస్థలముపై ప్రసిద్ధులైన నటకుల ఛాయాచిత్రములనేకము సేకరించి భద్రపరచినాము.

## జానపద కళోత్సవం

ఆంధ్రప్రదేశ్ నలుమూలలా వర్ధిల్లుతున్న వివిధ జానపద కళారూపాలను ఆంధ్రప్రజానీకానికి కన్నుల పండువుగా దృశ్యమానం చేసే మహదుద్దేశంతో కేంద్ర సంగీత నాటక అకాడమీ సహాయంతో, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1970 మార్చి 21 నుంచి వరుసగా నాలుగు రోజులు ప్రప్రథమంగా జానపదకళోత్సవాలు నిర్వహించినది. ఈ కళోత్సవాలకు అనుబంధంగా నాట్యకళ పత్రిక జానపద కళోత్సవ ప్రత్యేక సంచికను వెలువరించినది. ఈ సంచిక ఆయా కళారూపాల మీద ఉదాహరణ పూర్వకముగా ప్రముఖ రచయితల వ్యాసాలతో విలసిల్లుతున్నది.



# మహాభారతము

తిరుపతి వేంకట లక్ష్మణశాస్త్రి

"రాజా! జనకువి తీర్థమునందు గ్రుంకులిడినవారు విష్ణులోకమునకు పోవుదురు. తరువాత 'వినాశన_గండకీ_విశల్యా' తీర్థములందు స్నానము చేసిన సర్వపాప ప్రశమనమగును. వంగదేశమునందలి తపోవనములో ప్రవేశించినవారు పుణ్యమును పొందుదురు. 'కంపనా_మాహేశ్వరీధారా_దేవపుష్కరిణీ_సోమపద_మాహేశ్వరపద' తీర్థములలో స్నానము చేసిన వారికి అశ్వమేధాది పుణ్యములు గలిగి వారు సద్గతికి పోయెదరు. అచటనున్న కోటి తీర్థములను ఒక రాక్షసుడు అపహరించుకొని పోవుచుండగా విష్ణువు కూర్మ రూపమును ధరించి వానిని తిరిగి హరించి స్థాపించెను. అట్టి 'తీర్థకోటి' యందు స్నానముచేసినవారు పుండరీక యాగఫలమును పొంది విష్ణులోకమునకు పోయెదరు.

"రాజేంద్రా! పిదప 'నారాయణస్థాన'మునకు పోవలెను. ఆ క్షేత్రమునందు సర్వదా విష్ణువు సన్నిహితుడై యుండును. సమస్త దేవతలు ఆ దేవుని ఉపాసించుచుందురు. ఆ తీర్థమునందు విష్ణువు 'శాలగ్రామ' నామముతో ప్రసిద్ధుడై యుండును. ఆ దేవుని ఉపాసించినవారు అశ్వమేధఫలమును పొందెదరు. అచటనే ఒక కూపము ఉన్నది. ఆనూతిలో అన్ని సముద్రముల జలము ఉండును. దానిలో స్నానముచేసి అచటవెలసియున్న మహేశ్వరుని పూజించిన వారు మేఘనిర్ముక్తమగు చంద్రమండలమువలె స్వచ్ఛముగా ప్రకాశించెదరు. అందున్న 'జాతిస్మర' తీర్థములో స్నానమాచరించవలెను, దానిచేత పూర్వజన్మ స్మృతి లభించును. అటనుండి 'మాహేశ్వరపుర' మునకు, 'వామన' తీర్థమునకు పోయి సేవించినచో సర్వపాపములు నశించును. పిదప 'కుశికాశ్రమము'నకు పోవలెను. అచటి 'కౌశికీ' నదిలో స్నానము చేయవలెను. దానివలన రాజసూయయాగ ఫలములభించును. తదనంతరము 'చంపకారణ్య' యాత్ర చేయవలెను. దానిని సేవించుటచేత గోసహస్ర దానఫలము కలుగును. 'జ్యేష్ఠిల' తీర్థమును సేవించి యచటి మహేశ్వరుని పూజించినచో మిత్రావరుణ లోకమునకు పోవుదురు. 'కన్యాసంవేద్య' తీర్థమును నియతుడై సేవించినచో మనుప్రజాపతి లోకమునకు పోవును. అచటచేసిన అల్పదానమైనను అక్షయ ఫలమునిచ్చును.

"రాజా! 'నిశ్చీరా' తీర్థములో స్నానదానములు చేసిన వారికి అనంత పుణ్యము కలుగును. అచటి వసిష్ఠాశ్రమములో స్నానము చేయుట ఆవశ్యకము. అచటినుండి పోయి 'దేవకూట' తీర్థమును సేవించవలెను. విశ్వామిత్ర మహాముని సిద్ధిని పొందిన 'కౌశిక' తీర్థమును సేవించి అందు ఒక నెల నివసించినచో అశ్వమేధ ఫలముకలుగును. తీర్థరాజమగు 'మహాహ్రద'మునందు స్నానము చేసినవారు దుర్గతిని పొందరు_ వీరాశ్రమమునందలి కుమారస్వామిని సేవించవలెను. 'అగ్నిధారా' తీర్థములో స్నానముచేసినచో అగ్నిష్టోమ ఫలముకలుగును. హిమాలయ సమీపమునందున్న 'పితామహ సరోవరమును' సేవించవలెను. ఆ సరస్సు నుండి లోకపావనియగు 'కుమారధార' ప్రవహించును. దానిలో స్నానముచేసిన బ్రహ్మహత్యా పాపమునుండి విముక్తుడగును. అచటి నుండి 'గౌరీశిఖరము'నకు పోయి యచట 'స్తనకుండ' తీర్థములో స్నానముచేసినచో వాజపేయ యాగఫలము కలుగును. అచటినుండి 'తామ్రారుణ_నందినీ' తీర్థములను సేవించినవారు అశ్వమేధ_నరమేధ యాగపుణ్యమును పొందెదరు. కాలికా సంగమ, కౌశికీ_అరుణా సంగమము'లలో స్నానముచేసి మూడు నాళ్లు ఉపవాసము చేసినవారికి సర్వపాపములు పోవును. 'ఉర్వశీ తీర్థ_ సోమాశ్రమ_కుంభకర్ణాశ్రమ_కోకాముఖ_ప్రాఙ్నదీ_ఋషభద్వీప_ క్రౌంచనిషూదన_సరస్వతీ - ఔద్దాలక - ధర్మతీర్థ'ములను ఉపాసించినవారు పూర్వజన్మ స్మరణము, స్వర్గలోకము, విమానయానము, వాజపేయయాగ ఫలములను పొంది సర్వపాప విముక్తులై పుణ్యలోకములకు పోయెదరు." అని పులస్త్యుడు భీష్మునకు చెప్పి ఆ తరువాతి తీర్థములను గూర్చి యిట్లు చెప్ప దొడగెనని నారదుడు ధర్మజునకు చెప్పుచున్నాడు:_

"రాజా! ప్రాతఃకాలమునందు 'సంవేద్య' తీర్థస్నానము చేసిన వారికి ఉత్తమ విద్యాప్రాప్తి కలుగును. శ్రీరాముని

ప్రభావముచేత నిర్మితమైన 'తాహిత్య' తీర్థమునందు స్నానము చేయుటచేత బహుసువర్ణము లభించును. 'కరతోయా' తీర్థమునకు పోయి త్రిరాత్రోపవాసము చేసి దానిని సేవించినవారికి అశ్వమేధ ఫలము లభించునని బ్రహ్మదేవుడు శాసించెను. 'గంగా—సాగర సంగమ' తీర్థమునందు స్నానముచేసి గంగయావలి ఒడ్డును చేరి త్రిరాత్రోపవాసము చేసినవారికి అశ్వమేధ ఫలము లభించి సర్వ పాపవిముక్తి కలుగును. సర్వదోష శమనియగు 'వైతరణీ' నదిని సేవించి యచటి 'విరజ' తీర్థమునందు స్నానము చేసినవారు చంద్రుని వలె ప్రకాశించుచుందురు. 'శోణ—జ్యోతిరథ్యాసంగమ' తీర్థమునందు మునిగి పితృదేవతలను అర్చించవలెను. 'శోణ—నర్మదా' నదుల ఉత్పత్తి స్థానమగు 'వంశగుల్మ' తీర్థమునందు గ్రుంకులిడినవారు అశ్వమేధ ఫలమును పొందుదురు. 'కోసల' యందలి 'ఋషభ' తీర్థమునందు స్నానముచేసి గోసహస్ర దానఫలమును పొందగలరు. అచటనేయున్న 'కాల'తీర్థమును, 'పుష్పవతీ' తీర్థమును సేవించి అనేక పుణ్యఫలములను పొందుదురు 'బదరికా' తీర్థస్నానము చేత దీర్ఘాయువు కలుగును. 'చంపా' సమీపమునందలి 'భాగీరథీ—దండ' తీర్థములను సేవించవలెను. 'లపేటికా' తీర్థస్నానముచేత పూజ్యుడగును.

"మహారాజా ! ఆ తరువాత పరశురామునకు ఆశ్రయమైన 'మహేంద్ర' పర్వతమునకుపోయి 'రామ' తీర్థమునందు స్నానము చేసినవారు అశ్వమేధ ఫలమును పొందెదరు. అచటనే ఉన్న మతంగుని 'కేదార' తీర్థమునుగూడ సేవించవలెను. శ్రీ పర్వతమును చేరి అచటి నదీ తీరమున స్నాతుడై పరమశివుని పూజించిన వారు సమస్తయజ్ఞ ఫలమును పొందెదరు. అచటనే ఉన్న 'దేవహ్రద' తీర్థమును సేవించి 'పాండ్య' దేశమునందలి 'ఋషభ' పర్వతమునకు పోయి దానిని సేవించవలెను. 'కావేరీ' నదికి పోయి స్నానముచేసినచో అనంత పుణ్యముకలుగును. తరువాత సముద్రతీరము నందలి 'కన్యా' తీర్థము (కన్యాకుమారి) నందు స్నానముచేయవలెను. తరువాత 'గోకర్ణ' క్షేత్రమును దర్శించవలెను అది సముద్రమధ్యమున నున్నది. ఆ క్షేత్రమున సమస్తదేవతలు, మునులు, పన్నగులు, నదులు, సముద్రములు, పర్వతములు సర్వదా ఉపాసించుచుందురు. అచట వెలసిన ఈశాన దేవుని పూజించినవారికి అశ్వమేధఫలము, గాణాపత్య పదము లభించును. అచటనే గాయత్రీస్థానము కలదు. దానిని సేవించి గాయత్రీ మంత్రజపము చేసినవారు వర్ణసంకరులైనను పవిత్రులగుదురు. అచటనే 'సంవర' మహర్షి నిర్మించిన బావి ఉన్నది. అందులో స్నానము చేసినవారు రూపసౌందర్య శోభితులగుదురు. తరువాత 'వేణీ' నదిని సేవించిన వారికి నెమళ్లు, హంసలు గల విమానము లభించును.

"రాజా : పిదప 'గోదావరీ' నదిని సేవించి 'వేణిసంగమ' స్నానముచేయవలెను. 'వరదా సంగమ—బ్రహ్మస్థాన—కుశప్లవన—దేవహ్రద' తీర్థములను సేవించవలెను. కృష్ణవేణీ జలమునుండి పుట్టిన దేవహ్రదమునందు స్నానముచేయుటచేత పూర్వజన్మ స్మరణము కలుగును గనుక దానికి 'జాతిహ్రద తీర్థ'మని పేరు కూడ ఉన్నది. తరువాత 'సర్వదేవహ్రద' తీర్థమును సేవించవలెను. తరువాత పుణ్యమైన 'వాపి'లోను, 'పయోష్ణ' నదిలోను స్నానముచేసి పితృతర్పణము చేసినవారు, 'దండకారణ్యమును' సేవించినవారును సహస్రగోదాన ఫలమును పొందెదరు. 'శరభంగ—శుక' మహర్షుల ఆశ్రమములను సేవించినవారు దుర్గతిని పొందరు. పరశురాముడు సేవించిన 'శూర్పారక' తీర్థమును దర్శించి యచటి 'రామ' తీర్థమునందు స్నానము చేసినవారికి అధిక సువర్ణము లభించును. 'సప్తగోదావర' తీర్థమునందు స్నానముచేసినవారికి గొప్పపుణ్యము లభించును. తరువాత 'దేవపథ—తుంగకారణ్య' తీర్థములను సేవించవలెను. తుంగ కారణ్యమునందు పూర్వము 'సారస్వత' ముని ఋషులకు వేదములు నేర్పెను. ఒకప్పుడు ఆ ఋషులు వేదములను మరచి పోయిరి. అప్పుడు బ్రహ్మర్షియగు అంగిరసుని పుత్రుడు ఆఋషుల ఉత్తరీయ వస్త్రములందు దాగియుండి ఓంకారమును ఉచ్చరించుచుండెను దాని ప్రభావముచేత ఆ మునీశ్వరులకు సర్వవేదములు జ్ఞప్తికి వచ్చెను. అచట అనేక ఋషులు, దేవతలు నివసించుచుండిరి. బ్రహ్మదేవుడు భృగుమహర్షిని యజ్ఞము చేయించు ఆచార్యునిగా నియోగించెను భృగువు అచట అగ్నిని స్థాపించి వారిచేత శాస్త్రోక్తముగా హోమాది కర్మలు చేయించెను. అట్టి పవిత్రమైన తుంగకారణ్యమును ప్రవేశించగనే స్త్రీలుగాని పురుషులు గాని సర్వపాపములనుండి విముక్తిని చెందుదురు.

"రాజా ! తరువాత 'మేథావిక' తీర్థమును సేవించినవారికి స్మృతి, బుద్ధి ప్రాప్తించును. అచటనే ఉన్న 'కాలంజర' పర్వతము వద్ద 'దేవహ్రద' తీర్థము కలదు, దానిలో స్నానము చేసినవారికి గోసహస్రదాన ఫలము లభించును. పిదప 'చిత్రకూట' పర్వతమునందలి గంగానదిలో స్నానముచేసి ఉత్తమలోకములను పొందగలరు. పిదప 'కోటితీర్థమును' జ్యేష్ఠస్థానమును సేవించవలెను. అచటి కూపమునందు స్నానము చేయవలెను. దానిలో నాలు సముద్రములు నివసించియున్నవి కనుక దానిని సేవించిన యాత్రికులు ఉత్తమగతికి పోయెదరు. పూర్వము శ్రీరామచంద్రుడు గంగనుదాటిన 'శృంగబేరపురము'నకు పోవలెను. అచటి గంగలో స్నానముచేసి 'ముంజవట' తీర్థమునకుపోవలెను. అది మహాదేవుని పుణ్యస్థలము. అందు గంగలో స్నానముచేసి సర్వపాపములనుండి విముక్తుడు కావలెను.

"తరువాత 'ప్రయాగ' తీర్థమునకు పోవలెను. ఆ క్షేత్రములో సర్వదేవముని సంఘములు నివసించియుందురు. అచట మూడు అగ్ని కుండములు గలవు. వాని మధ్యనుండి అతి వేగముగా గంగ ప్రవహించుచుండును. సూర్యపుత్రియగు యమున అచట గంగలో కలియును. గంగా యమునల మధ్య భాగము భూదేవికి జఘన స్థలమని ప్రసిద్ధి. ప్రయాగక్షేత్రము జఘన స్థానమునందలి ఉపస్థయని ఋషులు చెప్పుదురు. 'ప్రయాగము, ప్రతిష్ఠానము, కంబలము, అశ్వతరము, భోగవతి' యివి బ్రహ్మదేవునకు వేదీస్థానములు. ఆవేదియందు వేదములు, యజ్ఞములు శరీరధారులై బ్రహ్మదేవుని ఉపాసించుచుండును. ఋషులు, దేవతలు అచట యజ్ఞములు చేయుచుందురు. రాజా !

ఆ కారణముచేత ప్రయాగ క్షేత్రము మూడు లోకములలోను అత్యంత పుణ్యకరమైనది. ఆ క్షేత్రమునకు పోయినను, చివరకు దాని నామస్మరణము చేసినను మృత్యుభయమునుండి విముక్తులగుదురు. అచట గంగా యమునా సంగమములో స్నానముచేసి పితరులను అర్చించి కొంచెము దానముచేసినను అనంత ఫలము కలుగును. ప్రయాగ మరణము అతి పుణ్య ప్రదము. అరువది కోట్ల పదివేల తీర్థరాజములు ఈ ప్రయాగ క్షేత్రములో నున్నవి. నాలుగు విద్యలు నేర్చుకొనుట వలన, సత్యము పలుకుటవలన ఎట్టి పుణ్యము లభించునో అది కేవలము ప్రయాగలో గంగా యమునా సంగమము నందు స్నానము చేయుటవలన కలుగును. అచటనే ఉన్న వాసుకి యొక్క 'భోగవతి' తీర్థము నందు స్నానము చేయవలెను. అచట గంగలోని 'హంస ప్రపతన-దశాశ్వమేధిక' తీర్థములందు స్నానము చేయవలెను. గంగానదిలో ఎక్కడ స్నానము చేసినను కురుక్షేత్ర గమనముతో సమానమగును. అందులోను, ప్రయాగలోను, హరిద్వారమునందలి 'కనఖల' తీర్థములోను స్నానము చేయుట అన్నిటికన్న విశేషము.

"రాజా ! చెడు కృత్యములు ఎన్నిచేసినను వానిని గంగా స్నానము, అగ్ని యింధనమును దహించినట్లు దహించి వేయును. కృతయుగములో అన్ని తీర్థములు పుణ్యదాయకములే యగును త్రేతాయుగములో పుష్కర తీర్థమునకు ఎక్కువ పుణ్యముగలదు. ద్వాపర యుగములో కురుక్షేత్రము. కలియుగములో గంగానది అత్యంత పుణ్యదాయకమని చెప్పబడినది. పుష్కరమునందు తపస్సు, మహాలయమునందు దానము, మలయ పర్వతమునందు హోమము, భృగుతుంగమునందు ఉపవాసము చేయవలెనని శాస్త్రము చెప్పుచున్నది. పుష్కర-కురుక్షేత్ర-గంగా తీర్థముల మధ్య స్నానము చేసినవారు తమకు పూర్వము-తమకు తరువాత ఏడు తరములవారిని ఉద్ధరించగలరు. గంగా నామస్మరణముచేత పాపములు నశించును. గంగా దర్శనము చేత శుభములు కలుగును. గంగా స్నానము చేతను పానము చేతను ఏడుతరముల వరకు వంశము ఉద్ధరింపబడును. ఎవని యెముక గంగాజలమును ఎంతకాలము స్పృశించుచుండునో అంతకాలమువరకును అతడు స్వర్గలోకములో సుఖముగా నివసించియుండును. రాజా ! 'అన్ని పుణ్యతీర్థములను, అన్ని దేవమందిరములను సేవించుట వలన పుణ్యము కలుగును. కాని, గంగతో సమానమగు తీర్థము మరియొకటిలేదు. విష్ణువుకన్న శ్రేష్ఠుడగు దేవుడును లేడు బ్రాహ్మణులకన్న ఉత్తమవర్ణము వారున్ను లేరు,' అని బ్రహ్మదేవుడు చెప్పెను. గంగ ప్రవహించుచోటే ఉత్తమము. అదియే తపోవనము. గంగాతీర ప్రదేశము 'సిద్ధిక్షేత్రము' అని తెలిసికొనవలెను. ఈ సత్యమును బ్రాహ్మణులయొక్క, సాధు పురుషుల యొక్క, కొడుకుల యొక్క మిత్రుల యొక్క, తనను అనుసరించు శిష్యుల యొక్కయు చెవిలో జపించుచుండ వలెను. ఈ గంగా మహాత్మ్యము ధన్యము, పవిత్రము, పుణ్యము, స్వర్గప్రదము, అత్యుత్తమము, రమ్యము, పావనము, ధర్మప్రవర్ధకము నగును. ఇది మహర్షుల రహస్యస్థలము, సర్వపాప విమోచకము నగును. కనుక దీనిని చదివినవారు నిర్మలాంతఃకరణులై స్వర్గసుఖము ననుభవించెదరు.

"రాజా ! ఈ తీర్థములను కీర్తించుట ఉత్తమము సంపత్తి దాయకము, స్వర్గప్రదము, పుణ్యకరము శత్రునాశకరము, శుభము బుద్ధిశక్తిని పెంచునదియు నగును. ఈ తీర్థముల మహిమను పఠించినవారు వినినవారు, అపుత్రకులు పుత్రులను, అధనులు ధనమును పొందెదరు. దీనిని విన్నరాజు భూమిని గెలుచుకొనును. వైశ్యుడు ధనమును సంపాదించుకొనును, శూద్రుడు కోర్కెలను నెరవేర్చుకొనును. బ్రాహ్మణుడు సర్వశాస్త్ర పారంగతుడు నగును. వారు అనేక పూర్వజన్మల స్మరణము కలవారగుదురు స్వర్గసుఖమనుభవింతురు. రాజా ! నేనిపుడు, పోవుటకు శక్యములు-అశక్యములునైన తీర్థములను వర్ణించితిని. పోవశక్యము-గాని తీర్థములను మనసా స్మరించినను పోయినదానితో సమాన ఫలమును పొందును. అన్ని తీర్థములను ఋషులు, దేవతలు, యోగులు మాత్రమే సేవించగలుగుదురు.

"రాజా ! అట్లగుటచేత నీవు గూడ ఈ తీర్థయాత్రలు చేసి ఆ పుణ్యముచేత నీ పుణ్యమును పెంపొందించుకొనుము. ఇంద్రియ నిగ్రహము, ఆస్తికబుద్ధి, వేదశాస్త్రాధ్యయనము గల సత్పురుషులు మాత్రమే ఆ తీర్థములన్నిటిని సేవించజాలుదురు. కురునందనా ! బ్రహ్మచర్యాది వ్రతములు చేయనివారు, మనో నిగ్రహము లేనివారు, అపవిత్రులు, దొంగలు, వక్రబుద్ధిగలవారు ఈ తీర్థయాత్రలు చేయజాలరు. కౌరవ్యవంశోత్తమా ! నీవైతేనో, ధర్మార్థములను బాగుగా తెలిసికొని సదాసత్యవ్రతుడవై యుండువాడవు. స్వధర్మ పాలనముచేత నీవు తండ్రిని, తాతను, ముత్తాతను, బ్రహ్మాది దేవతలను, మహర్షులను సంతృప్తిపరచిన వాడవు. కనుక భీష్మా ! నీవు వసులోకమునకు పోవుదువు నీకు ఈ జగత్తులో అక్షయము, విశాలమునగు కీర్తి కలుగగలదు."

"అని పులస్త్య మహాముని భీష్మునకు తీర్థముల మహిమను ఉపదేశించి అచటనే అంతర్ధానము చెందెను. భీష్ముడును సమస్త భూమండలమును సంచరించి తీర్థయాత్రలు చేసెను" అని నారదుడు యుధిష్ఠిరునకు చెప్పి యిట్లనెను :-

"మహాభాగా ! సర్వ పాపములను దూరముచేయు తీర్థయాత్రలు ప్రయాగ క్షేత్రములో ప్రతిష్ఠితములై యున్నవి ఈ విధముగా భూమండలములో తీర్థయాత్రలను చేయువారు నూరు అశ్వమేధ యాగములు చేసిన ఫలమును పొందెదరు. ధర్మరాజా ! భీష్ముడు తీర్థయాత్రల వలన సంపాదించిన ఫలముకన్నను ఎనిమిది రెట్లు అధిక ఫలమును నీవు సంపాదించగలవు ఎందుకనగా, నీవు నీతోనున్న యీ ఋషులనందరిని నీవెంట తీర్థయాత్రలకు తోడ్కొని పోయెదవు తీర్థములన్నింటిలోను విఘ్నకారులైన రాక్షసులు ఉందురు. కనుక నీవు తప్ప ఇతరులా యాత్ర చేయజాలరు.

"దేవర్షియగు పులస్త్యునిచేత వర్ణింపబడిన తీర్థ మహిమలను ప్రాతఃకాలమునందు పఠించినవారు సర్వపాప విముక్తిని పొందెదరు. రాజా ! వాల్మీకి కశ్యపాదులగు దేవర్షి-బ్రహ్మర్షి గణములు నీకై వేచియున్నారు. వారితోగలిసి నీవుగూడ అన్ని తీర్థయాత్రలు చేయుము. మహారాజా ! ఇప్పుడే నీకడకు మహర్షి

యగు 'లోమశుడు' రాగలడు. అతనినిగూడ తీర్థయాత్రలకు తోడ్కొనిపొమ్ము. నేనుగూడ నీవెంట వచ్చెదను. మీ మూల పురుషుడగు 'మహాభిషుని' వలె నీవు గూడ తీర్థభ్రమణముచేసి మహా యశస్సును పొందుము యయాతివలె, పురూరవసునివలె నీవు గూడ స్వీయ ధర్మము చేతనే శోభిల్లు చున్నావు. భగీరథుని వలె, శ్రీరామునివలె నీవు గూడ రాజులందరికన్న అధికుడవై సూర్యునివలె విరాజిల్లు చున్నావు. మను-ఇక్ష్వాకు-పూరు-పృథు చక్రవర్తులవలె నీవుగూడ గొప్ప ఖ్యాతిని ఆర్జించితివి. ఇంద్రుడు శత్రు సంహారముచేసి త్రైలోక్య రాజ్యము నేలినట్లు నీవుగూడ శత్రువులను సంహరించి రాజ్యము నేలెదవు. స్వీయ ధర్మము చేతనే భూమిని గెలుచుకొని కార్తవీర్యార్జునునివలె ఖ్యాతిని సంపాదించెదవు" అని నారద మహాముని ధర్మరాజును ఓదార్చి అతనిచేత వీడ్కోలుగొని అక్కడనే అంతర్ధానము చెందెను. ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడు గూడ నారదుని వాక్యములనే స్మరించుచు అచట నున్న ఋషులకు తీర్థయాత్రలకు సంబంధించిన పుణ్యము విషయమై నివేదించెను.

ఆ తరువాత యుధిష్ఠిర మహారాజు తమ్ములతో సంప్రదించి నారదుడు చెప్పిన ప్రకారము తీర్థయాత్రలు సలుప దలచి తన పితామహునితో సమానుడగు ధౌమ్యాచార్యునితో నిట్లనెను :—

"మహాత్మా! శస్త్రాస్త్రములను సంపాదింపదలచి పరాక్రమవంతుడగు నా తమ్ముని అర్జునుని ప్రవాసమునకు పంపితిని. ఆ వీరుడు శ్రీకృష్ణునితో సమానుడు. వారిరువురులేక నేను శత్రుసంహారము చేయజాలను. వ్యాసభగవానుని యభిప్రాయము గూడ నదియే. కృష్ణార్జునులు నర-నారాయణ రూపములలో మూడు యుగముల నుండి సహవాసులుగా నున్నారు నారదుడు గూడ వారిని ప్రశంసించెను. అర్జునుడు సమర్థుడను భావముచేతనే నేను అతనిని అస్త్రసంపాదనార్థమై పంపితిని అతడు ఇంద్రునకు ఎందులోను తీసిపోవడు. అందుకే యింద్రునికడకు అతనిని అస్త్రములకై పంపితిని. దుర్యోధనుడు అతిరథులైన భీష్మ-ద్రోణ-కృపాశ్వత్థామలను యుద్ధములో సహాయము చేయుటకు ప్రార్థించగా వారు అంగీకరించినారు. వారు అందరును వేదశాస్త్రకోవిదులు, శూరులు, సర్వాస్త్రవిశారదులు, విశేషించి పార్థునితో యుద్ధము చేయుటకు ఇష్టపడుచున్నారు. కర్ణుడుగూడ దివ్యాస్త్ర విశారదుడు. అతడు అగ్నియే యనవచ్చును. అగ్నికి వాయువు బలమైనట్లు కర్ణునకు అస్త్రవేగమను వాయుబలము గలదు. అతని శరములే జ్వాలలుగా, ధనుస్సు ధ్వనియే అగ్ని ధ్వనిగా, ధూళియే ధూమముగా, శస్త్రాస్త్రవర్షణమే అగ్ని వర్షముగా, దుర్యోధనుడనెడు వాయుప్రేరణగలవాడై కర్ణుడు అను అగ్ని ప్రళయకాలమునందు యమునిచేత విడువబడిన ప్రళయాగ్నివలె నా సైన్యమనెడు గడ్డిని దహించగలడు. అందులో సంశయములేదు. అట్టి కర్ణాగ్నిని, అట్టి వాడేయగు అర్జునుడొక్కడే ఆపగలడు. అర్జునుడు కాలమేఘమేయగును. ఆద కృష్ణుడనెడు వాయువు ప్రేరణ చేయుచుండగా, అతని దివ్యాస్త్రములే మెఱపులుగా, శ్వేతాశ్వములే కొంగలుగా, గాండీవము ఇంద్రధనుస్సుగా, బాణవర్షధారలచేత ప్రజ్వరిల్లుచున్న కర్ణాగ్నిని ఆర్పగలడు అర్జునుడు తప్పక యింద్రుని నుండి దివ్యాస్త్రములను సంపాదించుకొని రాగలడు. భీష్మాదులను జయించుటకు అర్జునుడొక్కడే సమర్థుడు. అతడు లేకున్నచో వారందరు సంతసించెదరు. మేమందరము అతనికై వేచియున్నాము. అర్జునుడు ఈ కార్యభారమును తలపై మోసికొనినాడు కనుక దీనిని పూర్తి చేయక ఉండడని నా విశ్వాసము. అతడు లేకుండ మేమీ కామ్యక వనమందు శాంతితో నుండజాలము. కనుక మహాత్మా! మీరు దయచేసి మా నివాసమునకై, విశేషముగా ఆహార పానీయములు లభించు పవిత్రమగు మరియొక వనమును నిర్దేశించి చూపుడు. మేమక్కడ మరికొంతకాలము వానకై కర్షకులు ఎదురుచూసినట్లు, అర్జునుని కొరకు నిరీక్షించుచుండెదము. మహాత్మా! అర్జునుడు వినామాకు ఈ కామ్యక వనములో నుండుటకు రుచించకున్నది. కనుక వివిధములైన పుణ్యతీర్థములను గూర్చి, పుణ్యాశ్రమములను గూర్చి, నదులను, రమణీయ పర్వతములను గూర్చియు మాకు తెలుపుడు" అని యుధిష్ఠిరుడు అడుగగా, ధౌమ్యాచార్యులు దీనులైయున్న పాండవులనుచూచి వివిధ దిశలు, అందుగల పుణ్యక్షేత్రములను గూర్చి యిట్లు చెప్పదొడగెను :—

## ధౌమ్యుడు చతుర్దిశలనున్న తీర్థములను వర్ణించుట

"మహారాజా! నేను చెప్పబోవు పుణ్యక్షేత్రములను నీవు దర్శించకపోయినను వాని శ్రవణముచేతనే నీకు అనేక పుణ్యములు కలుగును వినుము. తొలుత తూర్పు దిక్కునందలి నైమిశ తీర్థమును గూర్చి వినుము. అచ్చట గోమతీనది ప్రవహించుచుండును. అచ్చట దేవతల యజ్ఞభూమి, సూర్యుని యజ్ఞపాత్రయు కలవు. ఆ దిక్కునందే రాజర్షియగు గయునిచేత ఆదరించబడిన 'గయ' పర్వతము కలదు. అచట 'బ్రహ్మసరస్సు' గూడ నున్నది. దానిని దేవతలు, మునులు సేవించుచుందురు ఆ 'గయా' క్షేత్ర మహిమ చాలా గొప్పది, దానిని గూర్చి పూర్వము మహాత్ములిట్లు కీర్తించినారు :—

(సశేషం)

—:O:—

కుటుంబనియంత్రణ

# పాటించవలసిన ఆవశ్యకత

-బులుసు రాధాకృష్ణమూర్తి

నేడు మనదేశము ఎదుర్కొనుచున్న సమస్యలలో జనాభా పెరుగుదల అతిముఖ్యమైనది. నిజానికి ఈ సమస్య ఒక భారత దేశమునకే పరిమితమైనది కాదు. యావత్ప్రపంచము ఈ సమస్యతో బాధపడుచున్నది. ఒకటవ శతాబ్దములో ప్రపంచ జనాభా 250 మిలియన్లు. ఈ జనాభా రెట్టింపగుటకు 1600 సంవత్సరములు పట్టినది. కాని ఇప్పటి ప్రపంచ జనాభా 3 బిలియన్లు (ఒక బిలియనుకు ఒక లక్ష కోట్లు), రెట్టింపగుటకు 35 సంవత్సరములు మాత్రమే పడుతుంది. ఈ జనాభా సమస్యకు ముఖ్యమైన పరిష్కారమార్గములు రెండు కలవు. మొదటిది మరణముల సంఖ్యను పెంచుట. రెండవది జననముల సంఖ్యను తగ్గించుట. మొదటి మార్గము అమానుషమైనది, ఆచరించుట కలవికానిది. దీనికి విరుద్ధముగ అనేక వైద్యశాస్త్ర పరిశోధనల ఫలితముగా మరణముల సంఖ్య చాలవరకు తగ్గిపోయినది. ప్రస్తుతము మనదేశములో ప్రతి సంవత్సరము 8 మిలియన్ల మంది మరణిస్తున్నారు. 21 మిలియన్ల మంది జన్మిస్తున్నారు. అంటే, యేడాదికి, జనసంఖ్య పెరుగుదల 13 మిలియన్లన్నమాట.

ఇక, రెండవ పరిష్కారమార్గము అన్ని విధముల ఆచరించ యోగ్యమైనది, మనకు సాధ్యమైనది. కుటుంబనియంత్రణ ఆచరించక వేరొక మార్గము లేదు. ఇపుడేమాత్రముపేక్షించినను, తరువాత ఏర్పడు విపత్కర పరిస్థితులకు మనమే బాధ్యులగుదుము. ఈ కుటుంబనియంత్రణ ఆచరింపనిచో కలుగు ప్రమాదము ఊహింపరానిది. అందువలన, అప్పుడేర్పడు క్షామపరిస్థితుల నిపుడే తెలుసుకుని మన బాధ్యతను గుర్తింపవలయును. ముఖ్యముగా ఈ జనాభా పెరుగుదల సమస్య అభివృద్ధి చెందిన దేశములకంటె, అభివృద్ధి చెందుతున్న దేశములకు ఎక్కువ వ్యాకులమును కలుగజేయుచున్నది. ఈ దేశములు, వివిధ రంగములలో సాధించిన అభివృద్ధిమూలక పొదుపు మొత్తములను, ప్రజల కనీసపు జీవనాధారమునకై వెచ్చింపవలసి వస్తున్నది. తద్వారా, అనేక నూతన అభివృద్ధి పథకములను ఆపివేయవలసి వస్తున్నది. దీనివలన, దేశపురోభివృద్ధికి నిరోధము కలిగి అనేక క్రొత్త సమస్యలు తలయెత్తుచున్నవి. నిరుద్యోగ సమస్య, ఆహారసమస్య మున్నగు పెక్కు సమస్యలన్నియు ఈ జనాభా సమస్యవలన ఉత్పన్నమయినవే. గడచిన మూడు పంచవర్ష ప్రణాళికలలోను, 31 మిలియన్ల క్రొత్త ఉద్యోగములను సృష్టించి నప్పటికిని, నిరుద్యోగుల సంఖ్య పదిమిలియన్లకు పైగా పెరిగినది. ఈ విధముగనే ఆహారసమస్య తీవ్రరూపము దాల్చగలదు. వ్యవసాయరంగములో ఎంత విప్లవము వచ్చినను, జనవాలరేటుకన్న ఎక్కువ రేటున ఆహారమును పండించ వలసివుంటుంది. ఆహార సమస్య ఎంతముఖ్యమైనదో, వసతి సౌకర్యం కూడ అంత ముఖ్యమైనదే. ఉదాహరణకు, ఎంతో ధనవంతులైన అమెరికనులు కూడా ఈ సమస్యతో సతమతమగుచున్నారు. అమెరికా జనాభా 100 మిలియన్లగుటకు మూడు శతాబ్దములు పట్టినవి. తరువాతి 100 మిలియన్లు, 50 సంవత్సరములకే పెరిగినది. అంటే, 1967 వ సంవత్సరమునకు అమెరికా జనాభా 200 మిలియన్లు. మూడవ 100 మిలియన్ల జనాభా పెరుగుటకు కేవలము 30 సంవత్సరములు మాత్రమే పట్టగలదు. ఈ అదనపు 100 మిలియన్ల జనాభాకు వసతి కల్పించడానికి, క్రొత్తగా ప్రతిమాసము రెండు లక్షల, ఏభైవేల మందికి సరిపడు పట్టణములను 2000 వ సంవత్సరము వరకు నిర్మింపవలసి వుంటుంది.

సుప్రసిద్ధ ఆంగ్ల శాస్త్రవేత్త, నవలా రచయిత, శ్రీ సి. పి. స్నో రాబోవు విపత్కర పరిస్థితుల గురించి తమ ఆందోళనను ఈ విధంగా వ్యక్తం చేశారు. "అనేక మిలియన్ల మంది ప్రజలు మనకళ్ళ ఎదుటనే ఆహారము లేక చనిపోవుదురు. ఆ విధముగా వారు మరణించుట మనము మన టెలివిజనుసెట్లపై చూచెదము. ప్రారంభదశలో, జనాభాకు, ఆహారానికి మధ్య పోరాటం జరిగి, స్థానికంగా కరువు కాటకం ఏర్పడతాయి. ఈ కరువుల వలన, ఆకలితో అలమటించు ప్రజావాహిని, సాగరపుటలలవలె ప్రవహించును. ఈ స్థానిక కరువుకాటకాదులు 1975–80 వ సంవత్సర మధ్యకాలంలో ఆరంభమవగలవు."

అయితే, ఈ రాబోవు కరువు నరికట్టలేమా ?

అరికట్టవచ్చు. కాని కొంతకాలము మాత్రమే. అభివృద్ధి పొందుతున్న దేశాలు వ్యవసాయరంగంలో విప్లవం తీసుకురావాలి. దీనికి తగినంత ధనం కావాలి. అధునాతన యంత్రాంగాన్ని ఉపయోగించుటకు, ఎక్కువ దిగుబడినిచ్చే మేలురకపు విత్తనముల నుపయోగించుటకు, రైతులకు ఋణములిచ్చుటకు ఇంకా ఇలాగ ఎన్నో అవసరాలకు ధనం కావలసి వుంటుంది. అందువలన, ఈ దేశాలు ఆర్థికసహాయానికై విదేశీయులపై ఆధారపడవలసి యున్నది. కావున, ఈ అభివృద్ధి చెందుతున్న దేశాలకు, అభివృద్ధి చెందిన దేశములు, తగినంత ఆర్థిక, సాంకేతిక సహాయము అందజేయవలసి వుంటుంది. ఈ విధముగా వ్యవసాయ రంగములో చాలినంత అభివృద్ధి సాధించుటకు, అవిరళమైన కృషి, అద్వితీయ మైన కార్యదీక్ష అవసరము. ఈ కృషి ఫలించినచో, ఈ రాబోవుక్షామ పరిస్థితులను రెండు దశాబ్దముల కాలముపాటు త్రోసి పెట్టవచ్చును.

ఈ రెండు దశాబ్దముల కాలమును మనము చక్కగా సద్వినియోగ పరచుకొనవచ్చును. ఇప్పుడు మనము చేయవలసిన కర్తవ్యము. కుటుంబనియంత్రణ కార్యక్రమము సమలు జరుపుట. ఈ కార్యక్రమ నిర్వహణకు, అభివృద్ధి పొందిన దేశములు, అభివృద్ధి పొందుతున్న దేశములకు చేయగలిగినంత సహాయము చేయాలి. ముఖ్యముగా, ప్రపంచ సంస్థలైన ఐక్యరాజ్య సమితి మున్నగునవి ఈ సహాయ కార్యక్రమములను ఎక్కువగా చేపట్టాలి. 1967వ సంవత్సరములో, ఐక్యరాజ్య సమితి, జనాభా నిరోధక సహాయ కార్యక్రమములకై ఒక ప్రత్యేక నిధిని ఏర్పరచినది. ఫోర్డ్‌సంస్థ, రాక్‌ఫెల్లర్ సంస్థ మున్నగు కొన్ని ప్రయివేటు సంస్థలు కూడా ఈ రంగములో కృషి చేయుచున్నవి.

మన దేశములో, ఈ కుటుంబనియంత్రణ కార్యక్రమము లను ప్రభుత్వము 1951వ సంవత్సరము నుండి అమలు జరుపు చున్నది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో కుటుంబనియంత్రణ కార్యక్రమములకై 27 కోట్ల రూపాయలు కేటాయించినది. చతుర్థ పంచవర్ష ప్రణాళికలో ఈ సంఖ్య 315 కోట్ల రూపాయలకు పెంచబడినది. ప్రస్తుతము మన దేశములో మొత్తము 26,000 కుటుంబనియంత్రణ కేంద్రములు గలవు. పెద్ద పెద్ద నగరము లలో ఈ కార్యక్రమము కొంతవరకు విజయవంతమైనది. గ్రామ ములలో ఫలితము చాల తక్కువగానున్నది. మన దేశములో నేడు పిల్లలనుకనే వయసులోనున్న దంపతులు 100 మిలియన్లమంది వున్నారు. వీరిలో ఎక్కువగా గ్రామములలో నివసించువారు. వీరందరికీ కుటుంబనియంత్రణ సందేశమును అందజేయాలి. కుటుంబ నియంత్రణ పాటించవలసిన ఆవశ్యకత, ఆచరింపనిచో కలుగు ప్రమాదము, పరిమిత కుటుంబమువలన కలుగు శ్రేయస్సు వీరికి నచ్చ చెప్పాలి.

మన దేశములో ఈ కుటుంబనియంత్రణ కార్యక్రమమును పెద్ద ఎత్తున చేపట్టుటకు తగినన్ని వైద్య సౌకర్యములులేవు. ప్రస్తుతము మన జనాభారేటు వెయ్యి టికి నలభై చొప్పున పెరుగు చున్నది. 1974వ సంవత్సరమునకు ఈ రేటును వెయ్యింటికి 32 చొప్పున చేసి, చివరగా వెయ్యింటికి 25 వరకు తగ్గించవలయు నని ఆశయము. ఇది సఫలమగుటకు, 42,142 వైద్య కేంద్ర ములు అవసరము. కాని, మనకు, 24,489 వైద్య కేంద్రములు మాత్రమే కలవు. ఈ రంగములో శిక్షణ పొందిన వైద్యులు, నర్సులు మున్నగువారు తగినంత మంది లేకపోవుట ఒక పెద్ద లోపము. చాలినంత నిధులు లేకపోవుటయే దీనికి కారణము. మన దేశములో సాధారణముగా బీదలకు ఎక్కువ సంతానము కలుగును. వీరిలో చాలా మంది నిరక్షరాస్యులు. వీరికి, కుటుంబనియంత్రణ సందేశమును సినిమాల ద్వారాను, రేడియోల ద్వారాను అందజేయవలసి వుంటుంది. గ్రామములలో నివసించు వీరికి, ఈ సమాచారమందజేయుటకు సదుపాయములులేవు. సిని మాలు, రేడియోలు వీరికతీతమైనవి. వీరికి ట్రాన్సిస్టరు రేడి యోలు తక్కువ ధరకందజేసినచో కొంత లాభము కనిపించ వచ్చును.

మన దేశములో చాల మంది, లోకమెంత మారుతున్నను, మూఢ నమ్మకములతో, లేనిపోని అనుమానములతో, ఈ కుటుంబ నియంత్రణ పథకమునకు విముఖతను ప్రదర్శించుచున్నారు. వీరు తమ మనోవైఖరిని తక్షణమే మార్చుకొనవలెనుచో తర్వాత బాధపడవలసివస్తుంది. అప్పుడు విచారించి ప్రయోజనముండదు. పెద్ద ఎత్తున ఈ కుటుంబనియంత్రణ కార్యక్రమములు అమలు జరుపుటకు అనుభవజ్ఞులైన వైద్యులు, అన్ని సదుపాయములు కలిగిన ఆస్పత్రులు అవసరము.

కుటుంబనియంత్రణ పాటించుటకు, సులభమైన పద్ధతులు చాలా కలవు. ఏ పద్ధతి కెవరికిష్టమైనదో ఆ పద్ధతి ననుసరి ప వచ్చును. మొత్తముమీద ఏదో ఒక పద్ధతి ననుసరించి తప్పని సరిగా ఈ కుటుంబనియంత్రణ అమలు జరపక గత్యంతరము కనపడదు. రక్షించుటకు శక్తి లేనిచో సృష్టించుట మహాపాతకము కదా.

---

## రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు కోరబడుచున్నవి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చును. ప్రకటించిన రచనలకూ, ఫోటోలకూ పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు
"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధ యాత్రిక శాఖ, హైదరాబాదు.

---

# సౌందర్య

—మధురాంతకం దొరస్వామి

కమనీయ మగువ్రక్కు కాంచగల్గిన చాలు
కరుణా స్రవంతులే గ్రాలుచుండు
నీ దరహాసంబు నింపుమై దిలకింప
విజ్ఞాన జ్యోతులే వెల్గుచుండు
నీ కాలియందెల నింపైన ఝణంఝణల్
గానామృతంబయి గ్రాలుచుండు
నీ నాట్య భంగిమ నిరుపమానంబుగా
వన మయూరికలను వసుధ మించె

రమ్ము...!రాగమ్ము...!తాళమ్ము.. రంజిలంగ
వీణియను మీటి తనువులు వివశమంద
మంద మలయానిలంబుతో మగువ పాట
పోల్కి సాధారణా నీవు పుడమికి దిగి

విశ్వము వశ్యమొందగ వీనులగాన
సుధా తరంగముల్
విశ్వపతి భజింపుటకు వేడుక గుల్కగ
నీవునత్తరిన్
సశ్వర న భోగముల నౌదల దాల్పక
శాంత్య హింసలన్

విశ్వము బోవగా దిగితి వెన్నెల రేని
పసందు జూపుచున్

కమ్మని తెమ్మెరల్ విసరె కాంతలు కాం
తులు కాంతి పుంజముల్
నిమ్మళ మొందగా ధరను నిక్కము
గోవులు గోపబాలురున్
సమ్మతి హాయిగా మనిరి సౌరెదు బాలురు
బాలికావళుల్
కొమ్మలు కూర్మలన్ గనిరి కోకిల లంతట
కోరి పాడగన్

కోకిల పాటలో సొబగు గుల్కెడి మాధురు
లుంచినావులే
మ్రాకుల జోకలో చివురు మంజుల
వృత్తిని నిలపినావులే
పోకలమాటుగో నిబ్బజ పోడిమి వాడిమి
జూపినావులే
మాకు ప్రమోద వైఖరులు మానస
వృత్తుల నింప రమ్మికన్



# ప్రముఖ పత్రికారచయిత

# శ్రీ ఖాసా సుబ్బారావు

—పంత్రంగి రాజేశ్వరరావు

కొందరు వ్యక్తులు స్వర్గస్థులైనా వారి స్మృతి శాశ్వతంగా వుంటుంది. అందుకు కారణం, వారు ధీరోదాత్తులు కావటమే. ఉపనిషద్వాఙ్మయంలో మచ్చుకైనా 'మోక్షం' అనే పదం కనిపించదు. వేదాంత గోష్ఠి పూర్తిఅయ్యాక యాజ్ఞవల్క్య ఋషి జనక చక్రవర్తిని నిర్భయత్వం పొందినందుకు అభినందించాడు. ఇది బ్రహ్మజిజ్ఞాసువులకు ప్రధాన లక్షణం. శ్రీ సుబ్బారావుగారిలో నిర్భయత్వం మూర్తీభవించిందనటంలో అతిశయోక్తి లేదు.

వీరి పేరు లోగడ శ్రీ సి. యస్. రంగస్వామి ముఖతః కలకత్తాలో విన్నా (వుభయులు కొంతకాలం బీహారులో దర్భాంగా మహరాజాలకు ఆంతరంగిక కార్యదర్శులుగా పనిచేశారు.) వీరితో వ్యక్తిగత పరిచయం వీరు "స్వతంత్ర" అనే ఇంగ్లీషు వారపత్రిక పెట్టి నన్ను వ్యాసాలు వ్రాయమని ఆహ్వానించిన పిదపనే కలిగింది. నేను ఉత్తర హిందూస్థానంలో పదేళ్ళపాటు వుండటం, ప్రముఖ ఇంగ్లీషు పత్రికలు నా వ్యాసాలు ప్రచురించటం పసిగట్టి వుంటారు. డాక్టర్ సచ్చిదానందసింహా శిష్యత్వంవల్ల అప్పటికే నిష్పక్షశ్రేణిలో జమ అయ్యాను. అపుడు డా॥ పట్టాభి, రాజాజీల మేధా సంపదను మెచ్చుకుంటున్నా నా సానుభూతి మాత్రం ప్రకాశం గారివైపు మొగ్గేది. ఇందుకు కారణం వారి అపూర్వ త్యాగమే. అందుకనే కాబోలు భర్తృహరి సైతం అన్ని గుణాలలోను మెప్పు పొందేది, పొందదగినది త్యాగమే అన్నారు. యావద్భారతంలోను ప్రకాశంగారితో సరితూగునది ఒక్క దేశబంధు చిత్తరంజనదాసు మాత్రమే.

శ్రీ ఖాసా ప్రకాశంగారి శిష్యులైనా తొలుత "స్వతంత్ర"లో రాజాజీని సమర్థించేవారు. నేను పట్టలేక మీ పత్రిక రాజాజీ బాకా అనే అభిప్రాయం ప్రబలుతోంది అన్నాను. నవ్వి, కొంత కాలానికి అవసరమైనపుడు రాజాజీని దుయ్యపట్టడం జరుగుతుందన్నారు. రాజాజీని అందరూ అపార్థం చేసుకుంటారుగాని ప్రకాశంగారు ముఖ్యమంత్రి కావడానికి ఆయన ఎట్లా కారణభూతులయింది వివరించారు. శ్రీ కామరాజు, రాజాజీకి వ్యవాసన చెప్పడానికి ప్రకాశంగారితో చేరినా నాయకుని ఎన్నిక సమయం రాగానే శ్రీ సి. యస్. ముత్తురంగ మొదలియారును ముస్తాబుచేసి పోటీ పెట్టారు. రాజాజీవర్గం తటస్థంగా వుండబట్టి ఆంధ్రకేసరి నాయకుడుగా ఎన్నికైనారు. లౌక్యంలేక ఏడాదిలోగా పదవిని పోగొట్టుకోవడం వేరే కథ. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటంతోనే ఆంధ్రకేసరి ముఖ్యమంత్రి కావాలని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూకు నచ్చచెప్పిన వారిలో రాజాజీ ముఖ్యులు.

నేను మదరాసు వెళ్ళినప్పుడు తప్పక శ్రీ సుబ్బారావుగారిని చూచేవాడిని. నేను మదరాసు బారు కౌన్సిలు ఆధ్వర్యాన ఫెడరల్ మాజీ న్యాయమూర్తి సర్ యస్. వరదాచారి అధ్యక్షతన "రాజ్యతంత్ర పరిణామము, తారతమ్య దృక్పథము, ఉపయోగము" అనే విషయాన్ని గురించి "నార్టను స్మారక ఉపన్యాసము" యిచ్చినపుడు పనికట్టుకువచ్చి విన్నారు. వారింటికి వెళ్ళినప్పుడు నన్ను తిరిగి అమంజికరైలో వున్న మా అన్నగారి యింటిదగ్గర తమ కారులో దింపివెళ్ళేవారు. త్రోవలో ఎంతో లోకాభిరామాయణం నడిచేది.

శ్రీ సుబ్బారావు 'తెలుగు పత్రిక'కు సంపాదకులైతే ఎంత బాగుంటుంది అనుకునేవాడిని. కాని మన దురదృష్టం ఏమిటంటే ఇంగ్లీషులో వ్రాస్తేగాని దొరలు (నల్లదొరలు కూడా) చదవరు. దొరలు ఒప్పుకుంటేకాని మామూలు జనం ఖాతరు చెయ్యరు. అస్మదాదులం సహితం మొదట తెలుగులో వ్రాసినా పేరుప్రతిష్ఠల కోసం ఇంగ్లీషులోనికిదిగి వులాటం తీరాక తెలుగులోనికి వచ్చాము. ఇంగ్లీషులో మహాపండితుడైన శ్రీనివాసశాస్త్రిగారు సహితం నాలు సంవత్సరాలకు పోతారనగా ఇంగ్లీషులో వ్రాయటం మాని తమిళంలో వ్రాయటం ప్రారంభించారు. ఇంగ్లీషుకంటె తమిళమే రాజాజీని ఆకట్టింది. నోబెలు బహుమతి పొందిన టాగూరు 'గీతాంజలి'ని బెంగాలీలోనే వ్రాశారు. శ్రీ సుబ్బారావు, శ్రీ గోరా శాస్త్రి సంపాదకత్వముక్రింద తెలుగు స్వతంత్రను స్థాపించటం గమనార్హం.

ఆంధ్రులను ఆదుకొని పేరు ప్రతిష్ఠలు చిరస్థాయి చేసింది అరవలే. తమిళనాయకులకు త్యాగరాజుయెడగల భక్తి శ్రద్ధలలో లవలేశం కూడా మనకు లేదు. అట్లాగే రాజాజీ, సదాశివం, శ్రీ సుబ్బారావును చరమదశలో ఆదుకుని "స్వరాజ్య" వారపత్రికను వారి స్మారక చిహ్నంగా నడుపుతున్నారు. అస్మదాదులం శ్రీ సుబ్బారావు పవిత్ర స్మృతికి అర్పించగలిగినది బాష్పాంజలి మాత్రమే.

# "ఏమి మగవాళ్లు!"

— ఆర్వియస్. సుందరం

ఈకాలమున రచనా ప్రక్రియలలో బహుళ ప్రచారములో నున్నది నాటిక. తెనుగున నాటకములిటీవలనే వెలువడినవి. నాటికలు మరియు నర్వాచీనములు. ఆధునికుల మన స్తత్వమునకు సరిపోవునట్లు క్లుప్తముగ రచియింపబడు రూపక ప్రక్రియలు నాటికలు

రాజమన్నారుగారొకచో నాధునిక నాటికల గూర్చి చర్చించుచు "అవి ఆంగ్లమువంటి ఇతర భాషలలోని ఏకాంక నాటకములతో సరి పోల్చి చూచినప్పటికీ తీసిపోవు' అని వచించి యున్నారు. ఇది వారి నాటికలకు గూడ వర్తించుమాట. రాజమన్నారుగారు రచించిన నాటకము లనేక విధములు. పాశ్చాత్య పద్ధతి ననుసరించి రచించినవి కలవు. మన ప్రాచీనాలంకారికుల లక్షణములను కొంత అనుసరించి రూపొందించిన నాటికలును గలవు.

ప్రస్తుతము రాజమన్నారుగారి 'ఏమి మగవాళ్లు!' అను నాటిక ననుసరించి వారి రూపక రచనా సామర్థ్యము నరయుతము. దీనిలో నాయిక కనకాంగి. ఈమె సంగీత వ్యాపారమున నున్నది. సోమసుందరం సుందరమ్మను రెండవ పెండ్లి చేసికొనినవాడు. తమ్ముని కొడుకు వేణు కనకాంగిని పెండ్లిచేసికొనెనని వినగనే ఈసడించుకొనినాడు. 'సాని దానికి బొట్టుపెడితే సతి అవుతుందా' అని తనకు సానివారిమీద ఏహ్యభావ మున్నట్లు వ్యక్తపరచినాడు. వేణు కనకాంగితో బాటు తనను చూడవచ్చుచున్నాడని తంతివచ్చినది. సోమసుందరం "ఈ ఇంట్లో మాత్రం కాపరం చెయ్యనివ్వను. వాడి వాటా వాడి మొఖాన కొట్టడానికి సిద్ధంగా ఉన్నాను" అనెను. అంతవరకు కనకాంగి పాడిన పాటలను ఆయన, భార్య సుందరమ్మ, ఆమె మరది కృష్ణమూర్తి వినుచుండుట గమనింపదగినది. అపుడు వేణు కనకాంగివచ్చిరి. సోమ సుందరం వేణును మందలించి కృష్ణమూర్తితో మాటలాడుచుండుమని చెప్పి వెడలిపోవును. ఈ ఘట్టమును చదివినచో సోమసుందరమునకు వేణు కనకాంగిని పెండ్లియాడుటయందేమాత్రము విషమము లేదని, సానివారి యందాతనికి మితిలేని యేహ్యభావమనిపించును.

నిజమునకు అసలు కథ ఇప్పుడే మొదలు. కృష్ణమూర్తి కనకాంగి పాటను విని మురిసిపోయి, అవశుడై ఆమె చేయి పట్టుకొనును. అంతవరకు పనిమీద బయటకు వెడలి వచ్చిన వేణునకు కనకాంగి గృహమునందలి పరిస్థితులు వివరించును. సుందరమ్మ కృష్ణమూర్తిని కన్నులలో త్రాగుట, కృష్ణమూర్తి కనులు తనమీద నుండుట, తామిద్దరు మాటలాడుచుండ సుందరమ సహింపలేకపోవుట వేణునకు చెప్పును.

సోమసుందరం పెద్ద భార్య కూతురైన నిర్మల అడుగగా కనకాంగి 'చక్కని రాజమార్గ' మను కీర్తన పాడును. సోమసుందరం వచ్చి హిందూస్థానీ మట్లువద్దని, జావళీ పాడుమని, వినుచు తన్మయత్వమున కనకాంగి తొడపై తాళము వేయును. కనులెఱ్ఱజేసినది కనకాంగి. శంకరశాస్త్రి కనకాంగిని చిన్నతనము నుండి ఎరిగినవాడు. అతనికి కనకాంగి వీరి ప్రవర్తనను గూర్చి చెప్పి నవ్వెను. వేణు చూచి అనుమానపడి ఈ రాత్రికే ప్రయాణము కావలయుననును. కనకాంగి ఇంటిలోనివారి వెకిలి ప్రవర్తనలనేకరువు పెట్టును. వీని కన్నిటికి కనకాంగి ప్రోత్సాహమున్నదని వేణు అనుమానించును. కనకాంగి విసిగిపోయి, మంగళ సూత్రము త్రెంపి 'ఛీ: ఏమి మగవాళ్ళని' వెడలును.

ఇది ప్రాచీన లక్షణములను కొంతవరకు అనుసరించి వ్రాసిన ఆధునిక నాటిక. నాటిక యందు వృత్తము కల్పితమని, రాణికి జెందినదిగాని, సంగీత వ్యాపారముననున్నది గాని, నృపదులమునిగాని నవానురాగ కన్య నాయికయని చెప్పిన సాహిత్య దర్పణ లక్షణముతో నిది చాల వరకు సరిపోవుచున్నది.

ఈ నాటికలో రాజమన్నారుగారు చేసిన పాత్ర చిత్రణ మనోహరముగనున్నది. సోమసుందరం భార్యకు వశవర్తి. నిర్మల విషయములోని యతని పరాధీనత దీనిని సూచించు చున్నది. కనకాంగిని సానిదని విమర్శించునుగాని, సమయము వచ్చినపుడు తన రసికత్వమును బయలుపరచును. కనకాంగితో ముద్దు ముచ్చటలకు అటు సోమసుందరమునకు, ఇటు కృష్ణమూర్తికిని సుందరమ్మ అడ్డము. పురుషులలోని చాంచల్య స్వభావమును, సుందరమ్మవంటివారి మానసిక వ్యభిచారమును, కనకాంగి భర్త వేణు వంటివారి యసహన ప్రవృత్తిని సూటిగా రచయిత మనసులకు హత్తుకొనునట్లు రచించినారు.

రాజమన్నారుగారొక వ్యాసమున ఏకాంకికలను వాస్తవికములవి, విమర్శకములని రెండు విధములుగ విభజించిరి. వాస్తవికములలో సామాన్య జనులుకూడ నుందురని చెప్పిరి. సంఘములోని వివిధ ప్రకృతులుగల మనుష్యులను నాటికలో వర్ణించిన

వా సవికములగును. ఇట్టి లక్షణము రాజమన్నారుగారి నాటికల లోను కన్పించును. ఇక విమర్శకముల లక్షణముకూడ వారి రచనలలో కన్పించును. "ప్రతి నాటకంలోనూ భాషమీదనో భావం మీదనో సంఘం మీదనో తీవ్రమైన విమర్శ ఉండనే ఉంది" అని విమర్శకముల లక్షణము చెప్పినారు. వ్యంగ్యముగా సంఘములో నుండు లోపములను ప్రస్ఫుట మొనర్చుట వారి నాటికలలో నున్నది.

వారి నాటికలలో ముఖ్యముగ గమనింపదగినది పటుత్వము. పటిష్టమైన బంధముతో వ్యర్థమైన వాక్యములు లేకుండ రచియించు టలో వారు మేటి. మానవస్వభావములను అద్దము నందువలె చూపు టయందు రాజమన్నారుగారు సిద్ధహస్తులు. నాటికలమీద ఏకాంకి కలమీద వారు అచ్చట టచ్చట వెలిబుచ్చిన అభిప్రాయములు వారి నాటికలకు సరిపోవును. "కవి విశ్వజనీనమైన మానవ స్వభావ ప్రవృత్తి ప్రదర్శిస్తేనేగాని కావ్యంగాని, నాటకముగాని యథార్థంగా గొప్పదౌతుంది." "ఏకాంకికలో అల్లికకు పటుత్వం ఉండాలి. భాష ఔచిత్యానికి భంగం కల్గించకూడదు. పొల్లు పదం ఒక్కటి ఉన్నా తప్పే"- ఈ వచనములు వారి నాటికలకు వర్తించుననుట అతిశ యోక్తి కాదు.

—౦౦—

# వద్దు!

**—దేవిప్రియ**

వద్దు బాబూ వద్దు
అశాంతి వలయాలను మళ్ళీ సృష్టించ వద్దు
మంచినీ మానవతనూ కట్టకట్టి
మళ్ళీ హుసేన్ సాగర్ లో పడవెయ్యొద్దు!
వద్దు బాబూ వద్దు!
నలుగురిలో నగుబాట్లు తెచ్చే
ఈ చీలికలు మనకొద్దు!
తరతరాల తెలుగుపంటి
ప్రగతి ప్రభల వెలుగు నిండి
మున్ముందుకు సాగుతున్న
అభ్యుదయాన్నాప వద్దు
ఒకే ఒడిలో లాలిస్తూ
ఒకే చంటి పాలిస్తూ
పెంచి పెద్దచేసిన అమ్మను
కావేషాల కత్తితో
రెండు ముక్కలుగా నరకొద్దు
మన మానం మన ప్రాణం
మన ధనం మన జనం
ఎవర్ని భాయ్ నువ్వుదోచేది?
ఎవర్ని నువ్వు విడదీసేది?
వద్దు బాబూ వద్దు
స్వార్థపరుల మాయ వలల్లో పడవద్దు
అశాంతి వలయాలను మళ్ళీ సృష్టించవద్దు.








లో మరొక 8100 హెక్టార్ల (20,000 ఎకరాలు) బీడుభూములు 7,8 9 ˈగం సేద్యం కిందికివచ్చేయి ఈ విధంగా 1968 నవంబరు నాటికి ],000 ఎకరాలకు కృష్ణానది జలాలు పారుదల అయ్యాయి నీటి పారుదల ముంగా జరిగింది గడిచిన ఖరీఫ్ పంట కాలంలో సుమారు 55 వేల ) అభివృద్ధి పరిచారు

## జనవరి 16 వ తేదీన

హుజూర్‌నగర్ తాలూకాలో 9 గ్రామాలకు కృష్ణాజిల్లా నందిగామ )మాలకు చెందిన మరో 54 వేల హెక్టార్లభూమికి సేద్యపు నీరు

నే నాగార్జునసాగర్ పాజెకు తన జలాలతో బీడుభూములను సైతం



దగ్గరకు పోవలసి వస్తుంది. ఆయన అంతటి మహాప్రతిభా వంతుడు కనుకనే తెనుగుజాతి మొత్తాన్ని తన కలంచేత సమ్మోహితులను చేయగలిగాడు. శ్రీ శ్రీ కాలపు పరిస్థితుల దృష్ట్యా చూచినట్లయితే ప్రపంచంలో యే మహా కవికీ తీసిపోని ఆయన ప్రతిభకు మహాకవితా లక్షణానికీ జోహారు లర్పించకుండా వుండలేము. ప్రపంచ మహాకవుల సరసన నిల్వగల కవి తనజాతిలో వున్నాడని చెప్పుకోవలసివస్తే తెనుగువాడు ఒక్క శ్రీశ్రీని మాత్రమేచూపించ గలడు. నేటి ఆధునిక సమాజ పరిస్థితులను వాటిని ప్రతిబింబిస్తున్న కవిత్వపు రీతులను దృష్టిలో ఉంచుకున్నట్లయితే ప్రపంచ స్థాయిలో శ్రీ శ్రీ ఒక్కడే తెలుగు ప్రజలయేకైక ప్రతినిధి.

—o×o—

# జయధ్వని

—ముదిగొండ వీరభద్రమూర్తి

గీ॥ ఓయి! నవనవ కల్యాణదాయి! పేద
సాదలకు భాయి! సర్వభాస సముదాయి
'హాయి హాయి' యనుచు వీకు జే యిడంగ
జేయు మా జనంబును నూత్నహాయనంబ!

గీ॥ ద్వాదశార చక్రము జేసి దానవారి
నేడు నిన్ను ప్రసాదించినాడు మాకు
కాలనేమి పరంపరాగతి వెసంగు
లేమి యను రాక్షసిని సంహరించు కొఱకు

ఆ॥వె॥ పైరు పండి యొరగవలె క్షేత్రముల నేత్ర
ముల ముదశ్రు పూరములను నద్ద
రాజ! నీ హయాములో జయధ్వజ ఘంట
మ్రోగినటుల నెపుడు మ్రోగగవలయు!



# పండుగలూ పర్వదినాలూ

## ఉగాది

——కమలా త్రివేణి

ఉగాది అంటే సంవత్సరాది. దేనిలో ఋతువులు సంవత్ అంటే చక్కగా వసిస్తున్నాయో అది సంవత్సరం అని వ్యుత్పత్తి. ఇక ఋతువు అంటే ఏమిటి? ఇయర్తి రీతి ఋతుః. నిరంతర గమనం గలది ఋతువు. ఋతువులే కాలగతి. ఋతువులను అనుసరించే వస్తుపరిణామం జరుగుతూ ఉంటుంది. ఋతువులు ఆరు—వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిరాలు. ఈ ఆరు ఋతువులూ ఒకసారి గడిచిపోయి ఆ చక్రం మళ్లీ ప్రారంభం అయ్యేనాటికి ఒక సంవత్సరకాలం గడిచినట్లవుతుంది. చక్రం అన్నామే. చక్రంవర్తులాకారంలో ఉంటుంది. చక్రానికి ఏది మొదలు? ఏది తుది? ఏ బిందువునుంచి ఐనా మొదలు కావచ్చును. చక్రగతి గల సంవత్సరానికి ప్రారంభం నిర్ణయించడం ఎలాగ?

అసలు కాలభావం సృష్టినుంచి ప్రారంభం అయింది. ఈ సృష్టి చైత్ర శుద్ధ పాడ్యమినాడు జరిగిందట. ఆ నాడు బ్రహ్మ సృష్టి చేసి దేవతలకు గ్రహ ఋతు మాస పక్షాదులను ప్రసాదించాడట. ఉగాదినాడు బ్రహ్మదేవునేకాక కాలావయవ రూపులైన దేవతలను కూడా పూజించాలని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. నిమేషం, త్రుటి, లవం, క్షణం, కాష్ఠ, కల, సుషుమ్న, నాడి, ముహూర్తం, నిశ, దివసం, పక్షాలు, మాసాలు, షడృతువులు, అయనాలు, సంవత్సరం—ఈ రీతిగా కాలవిభాగాలు చెప్పబడ్డాయి.

ఇంతకీ ఈ సంవత్సరం అన్నది ఏ బిందువు నుంచి ప్రారంభించాలి? చైత్ర వైశాఖ మాసాలకు మధు మాధవ మాసాలని నామాంతరాలు ఉన్నాయి. మధువు ఒక రస విశేషం. ఈ రస ప్రభావం వృక్షలతాదులనే కాక సమస్త ప్రాణ కోటినీ చైతన్యవంతం చేస్తుంది. ఈ రసం ఉత్పత్తి ఐ వృద్ధి పొందే ఋతువుకు వసంతం అని పేరు. ఎండిపోయిన వృక్షాదులు వర్షం పడకుండానే ఈ ఋతువులో మధు రసమాహాత్మ్యంవల్ల చిగిర్చి పుష్పిస్తాయి. మానవుల హృదయాలు కూడా ఆనందంతో చిగిర్చి పుష్పిస్తాయి. ఒక కొత్తదనం గోచరిస్తుంది. ఈ ఋతువు చైత్ర శుద్ధ పాడ్యమినాడు ప్రారంభ మవుతుంది. ఆనందదాయకమైన నూతనత్వం ప్రారంభమయ్యే చైత్ర పాడ్యమి నూతన సంవత్సరానికి ప్రారంభదినం అనుకోవడం సముచితమే.

ఉగాది నాడు ఆరోగ్య వ్రతం చెప్పబడింది. ఆ నాడు ఉదయం అభ్యంగం విధింపబడింది. బాహ్య శుద్ధికీ ఆరోగ్యానికి స్నాన ప్రాముఖ్యం వేరే చెప్పనక్కరలేదు. ఆ నాడు తినే వేప పూవు పచ్చడి కూడా ఆరోగ్య విషయికంగా విశేషమైనదే. వేపాకు చేదుగా ఉంటుంది. అది చర్మరోగాలను నివారిస్తుంది. ఐతే చేదుకు వాతాన్ని వృద్ధి చేసే లక్షణం కూడా ఉంది. ఆ వాత గుణాన్ని పరిహరించడానికి కలకండ చేర్చడం ఉంది. దాని మధుర రసం వాతానికి విరుగుడుగా పనిచేస్తుంది. ఐతే మధుర రసం వల్ల కఫం ప్రకోపిస్తుంది. దాన్ని శాంతింప జేయడానికి మిరియాలు చేర్చడం జరుగుతుంది. ఈ మిశ్రమం త్రిదోషహరంగా పని చేస్తుంది. ఇది కూడా ఆరోగ్య చర్యయే. అంతేకాక జీవితం కేవలం తీపికాదు, కేవలం చేదకాదు. సుఖ దుఃఖ మిశ్రమం అని మనం గ్రహించడానికి కూడా ఈ వేప పచ్చడి రుచి ఉపకరిస్తుంది జీవితంలో మనలను ఎదుర్కొనే సౌఖ్యాన్నీ, దుఃఖాన్నీ సమ భావంతో స్వీకరించాలనే నీతి బోధిస్తుంది.

## శ్రీరామ నవమి

చైత్ర శుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రంలో కర్కాట లగ్నంలో కౌసల్యాదేవికి దివ్యలక్షణయుతుడూ, సర్వలోక వందితుడూ, జగదీశ్వరుడూ ఐన రాముడు జన్మించాడు. ఆ సమయములో సూర్య అంగారక శని గురు శుక్ర గ్రహాలు ఐదూ ఉచ్ఛ స్థాయిలో ఉన్నాయి. లగ్నంలో చంద్రునితోపాటు బృహస్పతి కూడా ఉన్నాడు. చైత్ర శుద్ధ నవమి శ్రీరామ నవమి

చైత్రే మాసి నవమ్యాం తు శుక్లపక్షే
రఘూత్తమః
ప్రాదు రాసీ త్పురా బ్రహ్మన్ పరబ్రహ్మైవ
కేవలమ్
తస్మిన్ దినే తు కర్తవ్య ముపవాసవ్రతం సదా
తత్ర జాగరణం కుర్యా ద్రఘునాథపరో భువి
ఉపోషణం జాగరణం పితౄ నుద్దిశ్య
తర్పణమ్
తస్మిన్ దినే తు కర్తవ్యం బ్రహ్మ ప్రాప్తి
మభీప్సుభిః

ఆనాడు భగవానుని భజన, స్మరణ, స్తోత్రపాఠం, పితృ తర్పణం చేసి రాత్రి గాన వాద్యాలతో జాగరణం చేసి మరునాడు (దశమినాడు) పారణంచేసి వ్రత విసర్జనం చేయాలని చెప్పబడింది.

శ్రీరాముడు దశరథనందనునిగా అవతరించిన పరబ్రహ్మ. ఆయన అయోధ్యాపతియే కాదు అఖిల జగత్పతి.

రా శబ్దో విశ్వవచనః మశ్చాపీశ్వర
వాచకః
విశ్వానా మీశ్వరో యో హి తేన రామః

'రా' అంటే విశ్వం. 'మ' అంటే ఈశ్వరుడు. రాముడంటే విశ్వేశ్వరుడు.

రాముడు శతాబ్దుల క్రిందట భారత భూమిలో నరరూపంలో సంచరించిన నారాయణుడేకాదు మహీతలంమీద మసలిన మాధవుడే కాదు. ఆయన సర్వదా సర్వాంతర్యామిగా ఉన్నవాడు. ఆయన అవనీతలంమీద అవతరించినది మానవులకు మార్గదర్శనం చేయించడానికే. రాముడు మర్యాదా పురుషోత్తముడు. ఆయన ధర్మమూర్తి, ధర్మం సత్య త్యాగాత్మకమైనది. సత్యం కోసం త్యాగం చేసి అఖిల మానవకోటికే ఆదర్శంగా నిలిచినవాడు రాముడు.

రాముని కంటె రామనామం వేరుకాదని చెప్పబడింది. రామనామం జపించి తరించినవారు ఎందరో మహానుభావులున్నారు. భద్రాచల రామదాసు, మహారాష్ట్రానికి చెందిన సమర్థ రామదాసు, వాగ్గేయకారుడు త్యాగరాజస్వామి, ఇటీవలి కాలంలో గాంధీజీ దుర్బలులకు బలం రామనామం. సర్వరోగ సంజీవిని రామనామం. సర్వానర్థ నివారకం రామనామం అని విశ్వసించారు గాంధీజీ.

పరమేశ్వరుని అనంత నామాలలో రామనామం ఒకటి. పరమేశ్వరుని అనంత రూపాలలో రామరూపం ఒకటి ఐనా రామనామంలో ఒక విశేషం ఉంది. రామరూపంలో ఒక విశిష్టత ఉంది.

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం పుంసాం మహాపాతక నాశనమ్

రఘునాథుని చరిత్ర శతకోటి విస్తృతమైనది. అందలి ఒక్కొక్క అక్షరమూ మానవుల మహాపాపాలను నాశం చేయగల సమర్థత కలది.

—o+o—

## భారతీయ ఫోటోగ్రాఫర్‌కు అంతర్జాతీయ బహుమతి

ఫోటోగ్రఫీ రంగంలో నాణ్యత, నైపుణ్యం సాధించిన ఆంధ్రప్రదేశ్ రెవిన్యూ బోర్డు సభ్యుడు శ్రీ యన్. భగవాన్‌దాస్, ఐ. ఎ. యస్.కు ఫోటోగ్రఫీలో అంతర్జాతీయంగా ప్రథమ స్థానం వహించిన ఆనరేర్ ఎక్స్‌లెన్స్‌ఫియఫ్ అను బహుమతి లభించింది. అంతర్జాతీయ ఫోటో గ్రాఫర్ల సంఘం అయిన ఫెడరేషన్ ఇంటర్నేషనల్ డి లార్డ్ ఫోటోగ్రాఫిక్ సంస్థ ఈ బహుమతి ప్రదానం చేసినద్ది. ప్రపంచంలో బహుకొద్దిమందికి మాత్రమే ఇట్టి గౌరవం లభిస్తుంద్ది. బహుమతి ఇవ్వాలంటే అంతర్జాతీయ సంఘ సభ్యులు ఏకగ్రీవంగా ఓటు చేయాలి.

యఫ్. ఐ. ఎ. పి. వారు బెంగుళూరులో ఫిబ్రవరి ౨౭ వ తేదీన ఏర్పాటుచేసిన విందు సందర్భంలో ఈ బహుమానం ఇవ్వడం జరిగింది. యఫ్.ఐ.ఎ.పి. యొక్క ఆగ్నేయ ఆసియా ప్రతినిధి అయిన డా. సి. థోమస్ దీన్ని బహూకరించారు.

శ్రీ యన్. భగవాన్‌దాస్ ఆంధ్రప్రదేశ్ ఫోటోగ్రాఫర్ల ఫెడరేషన్‌ను స్థాపించారు. ఫోటోగ్రఫీలో ఆయన నైపుణ్యానికి కొన్నేండ్ల క్రిందట ఆయనకు యఫ్. ఐ. ఎ. పి. కళాకారుడుగా గౌరవస్థానం లభించింద్ది. దీని తరువాత ఆయనకు ఇ. యస్. యఫ్. ఐ. ఎ. పి. బహుమతి కూడా వచ్చింది. శ్రీ భగవాన్ దాస్ ఇప్పుడు అత్యుత్తమ బహుమతి పొందిన ప్రథమ భారతీయుడు. గత సంవత్సరం యఫ్. ఐ. పి. అధ్యక్షులు డా. వాన్ దివైర్ స్వయంగా శ్రీ భగవాన్‌దాస్‌కు యఫ్. ఐ. ఎ. పి. బంగారు పతకం బహూకరించారు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ పరిశ్రమల సంస్థ

— దేవికారాణి సత్యనారాయణ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ పరిశ్రమల సంస్థ, శాంతి, అభ్యుదయం చేకూర్చగల వ్యవసాయ విప్లవాన్ని సాధించడానికి కృషి చేస్తున్నది. నీరు, మేలుజాతి విత్తనాలు, ఎరువులు, ఆధునిక వ్యవసాయ యంత్రాలు, సహకారం, నిర్వహణ సామర్థ్యం — యివి బీడు భూములను సైతం సారవంతమైన పంట పొలాల క్రింద మార్చగలుగుతాయి. వ్యవసాయాన్ని లాభసాటియైన వృత్తిగా రూపొందించడంకొరకు వ్యవసాయ పరిశ్రమల సంస్థ రైతులకు అనేక సౌకర్యాలు కలుగజేస్తున్నది.

## ముఖ్య కార్యకలాపాలు

బావులు త్రవ్వడం, భూమినిఅభివృద్ధిపరచడం, సేవా కేంద్రాలను నెలకొల్పడం — యివీ ఈ సంస్థ నిర్వహించే ముఖ్య కార్యకలాపాలు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ పరిశ్రమల సంస్థ 1968వ సంవత్సరంలో రిజిస్టరు చేయబడింది. భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు దీనికి వాటా ధనాన్ని సమకూర్చాయి. అవసరమైన యంత్రాలను, విడిభాగాలను కొనుగోలుచేసే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఋణాలు ఇచ్చింది. విదేశాలనుంచి యంత్రాలను దిగుమతి చేసుకోవడానికి అనేక బ్యాంకులు ఋణ సౌకర్యాలు కల్పించాయి.

## డ్రిల్లింగ్ పనులు

ఈ సంస్థ భారీ ఎత్తున డ్రిల్లింగ్ పనులు నిర్వహిస్తూ వందలాది గ్రామాలకు మంచి నీటి సౌకర్యాలను, సేద్యపు నీటి సదుపాయాలను కలుగజేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లాలలో 400 గ్రామాలకుపైగా గొట్టపు బావులను, బోరింగ్‌లను కలిగివున్నాయి.

## బోరింగ్ బావులు

వేసవికాలంలో నీటికొరత ఏర్పడే అనేక పట్టణ ప్రాంతాలలో యిప్పుడు బోరింగ్ బావులు త్రవ్వబడినాయి. మంచినీటి సరఫరాకు అవే ప్రధానమైన వనరులుగా ఉపయోగించబడుతునాయి. బావుల త్రవ్వకానికి వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషన్‌కు అనేక విజ్ఞప్తులు అందుతున్నాయి. వివిధ రకాలకు చెందిన 46 డ్రిల్లింగ్ యంత్రాలు యీ సంస్థనిర్వాహణలో ఉన్నాయి. ప్రస్తుతం ఉన్న బావులనుండి నీరు ఎక్కువ తీయడాన్ని కూడా యీ సంస్థ చేపట్టుతున్నది. ఇందుకై 56 బావుల మరమ్మతు యూనిట్లను సేకరించారు.

విడిభాగాల కొరత కారణంగా పని కొంత మందగొండిగా జరుగుతున్నప్పటికీ 1969 ఫిబ్రవరి—జూన్ నెలలలో 2500 బావులను మరమ్మతు చేయడం జరిగింది. ఇటువంటి పనులకు తక్కువ అద్దెరేట్లపై యంత్రాలను లభింపజేయడం ద్వారా యీ పనులను చేపట్టడానికి సహకార సంస్థలు, వ్యక్తులను ప్రోత్సహించడం జరుగుతున్నది.

## భూమి అభివృద్ధి

వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషన్ చేపట్టిన కార్యక్రమాలలో భూమి అభివృద్ధిచేసే కార్యక్రమం ముఖ్యమైనది. వ్యవసాయశాఖవద్ద ఉన్న 105 మట్టి త్రవ్వకం యంత్రాలను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కార్పొరేషన్‌పరం చేసింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు, తుంగభద్ర ఎగువ కాలువ, కడెం ప్రాజెక్టు, యితర ప్రాంతాలలో భూమి సమంచేసే కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. రుమేనియా, బల్గేరియా, జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్, రష్యా, అమెరికాలకు చెందిన యంత్రాలను యీ పనిలో ఉపయోగిస్తున్నారు.

## అద్దెపై యంత్రాల సరఫరా

వినియోగదారులు సరసమైన అద్దెపై యంత్రాలను పొందడానికి వీలుగా ఐదు కేంద్రాలను నెలకొల్పాలని యీ కార్పొరేషన్ ప్రతిపాదించింది. ప్రస్తుతం నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడివైపు ప్రాంతంలో అనేక ఉపకేంద్రాలతో కూడిన ఒక కేంద్రం పనిచేస్తున్నది. ప్రతి ఉపకేంద్రంలో 15 క్రాలర్ ట్రాక్టర్లు, 10 చక్రాలట్రాక్టర్లు ఉన్నాయి ఈ కేంద్రాలు ఎంతో ప్రాచుర్యం సంపాదించాయి. వాటికి డిమాండు కూడ అధికంగా ఉంది. అద్దె గంటకు రు 20 నుండి రు. 30 వరకు ఉంటుంది. ట్రాక్టర్ల ధరలు, నిర్వహణ ఖర్చులు అధికంగా ఉన్న కారణంగా వాటిని కొనుగోలు చేయలేని రైతులకు యీ కేంద్రాలు వరప్రసాదం వంటివి.

వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషన్ యిప్పుడు లభింపజేస్తున్న సౌకర్యాలవల్ల రైతుల జీవితం సుకరమైంది. కనీసపు ఖర్చులతో రైతు తన భూములను సమంచేసుకోవచ్చు గొట్టపు బావిని త్రవ్వుకోవచ్చు. సేద్యానికి అద్దెపై యంత్రాలను పొందవచ్చు. వ్యవసాయ విప్లవానికి దీనిని ప్రతీకగా భావించవచ్చు ★

( శ్రీధర్స్ ఏ. పి. ప్రెస్ ఫోటో సర్వీసు )













## నవోదయానికి నాందిపలికిన "ఆగ్రో"

(పైన) ఒక గ్రామానికి అరుదెంచిన "ఆగ్రో" యంత్రం —కొత్త జీవితానికి ప్రాతిపదిక.

(పైన-ఎడమవైపున) బీడు భూములను, పంట పొలాలుగా మారుస్తున్న జలాలు.

(పైన-కుడివైపున) డ్రిల్లింగ్ యంత్రాన్ని అమర్చుతున్న దృశ్యం.

మధ్యలో) గొట్టపుబావి—రైతుకు పెన్నిధి.

ఎడమవైపున) భూమిని చదును చేస్తున్న బుల్డోజరు.

(కుడివైపున) పాత వ్యవసాయ పద్ధతులకు స్వస్తి.

# గుజ్జాల గోపిరెడ్డి

—ఓగేటి అచ్యుతరామశాస్త్రి

వీరగడ్డయగు పల్నాటి సీమ జానపద సాహిత్యంలో గుజ్జాల గోపిరెడ్డి సాహసకార్యాలు శాశ్వతంగా నిలిచిపోయాయి. ఈ సాహిత్యం నుండి గోపిరెడ్డిని గూర్చి వెలువడిన పాటల్ని మధురంగా పాడుకుంటూ ఆదోరకమైన కిన్నెరవంటి వాయిద్యాన్ని మీటుతూ జట్లు జట్లుగా ఊరూరా తిరుగుతూ బిచ్చమెత్తుకొనే పాటక జనం ఈనాటికీ ఆయా ప్రాంతాల్లో మనకు కనపడుతూనే ఉంటారు. వాటిల్లోకెల్లా గోపిరెడ్డియొక్క అందచందాల్ని, రాజఠీవిని వర్ణిస్తూ చివరికి అతని విషాద మరణాన్ని తెల్పే ఈ క్రింది పాట హృదయాల్ని కదిలిస్తుంది.

ఓ గుర్రాల గోపిరెడ్డీ
దాచేపల్లికే దానమైతీవా...

శేరు శేరు ఎండి కడియాల్
సేతులాకూ పెట్టుకొనీ,
కట్టమీదా వస్తావుంటే
కలకచేరు వనుకొంటిర కొడకా...

బంగారు కొడుకా, ఒయ్యారి కొడుకా
దాచేపల్లికే దానమైతీవా...

ఎక్కేదీ ఎర్ర గుర్రం
కట్టేదీ కాయి పంచె,
చుక్కలాటి నీ చక్కదనము
చూడకళ్ళే సాలవు కొడకా
ఒయ్యారి కొడకా, బంగారు కొడకా
దాచేపల్లికే దానమైతీవా

ఆ పక్కా ఒక సేను
ఈ పక్కా ఒక సేను
నడుమలోనా నాప సేను
సందున నిను నలుగురు పట్టి
నరికిరి కొడకా, ఒయ్యారి కొడకా!
దాచేపల్లికే దానమైతీవా—

పల్నాటిసీమలో ముఖ్యంగా పిల్లుట్ల, పిడుగురాళ్ళ, దాచేపల్లి, కేతవరం, రుక్మిణీపురం, రెంటాల, మన్నెసుల్తాన్‌పాలెం, జూలపాడు, గణపవరం, రెంటచింతల మొదలగు గ్రామాల్లో ఆబాలగోపాలం ప్రసిద్ధికెక్కిన ఈ పాట పశువుల కాపర్ల నోళ్ళలో కూలీ నాలీ చేసుకొనే పాటకజనం నోళ్ళలో ఎప్పుడూ ఆడుతూనే ఉంటుంది. ఒక్కమాటలో అక్కడి కొండగుహల్లోను, నాగులేటి ప్రవాహపు గల గల ధ్వనుల్లోను మార్మోగుతూనే ఉంటుంది.

## గుజ్జాలవారి వంశం

1850_1900 సం॥ మధ్య కాలంలో సుమారు నలభై సంవత్సరాల స్వల్ప కాలం మాత్రమే జీవించిన గోపిరెడ్డి పిల్లుట్ల గ్రామ మునసబు శ్రీ గుజ్జాల చినకృష్ణారెడ్డి కొడుకు. 'గుజ్జాల' వారి పూర్వీకులు పల్నాటి ప్రభువుల్లో ప్రముఖుడైన మలిదేవరాజు కొలువులో అశ్వదళాధిపతులుగా ఉండేవారని ప్రతీతి. తమ ఏలిక పలుమార్లు చిక్కుపరిస్థితిలో పడినప్పుడు వీరు ప్రభువుకు విశ్వాసపాత్రులై తమ గుజ్జుపు దళాల్ని సమర్థవంతంగా నడిపించి విజయం చేకూర్చిపెట్టినట్లు ప్రచారంలో ఉన్నది. వీరి రాజభక్తిని సేవాభావాన్ని గుర్తించిన ప్రజలు తమ అభిమాన సూచకంగా వీరికి గుజ్జాలవారిని పేరు పెట్టారు. దీనికితోడు గోపిరెడ్డి ఎప్పుడూ గుజ్జుపుస్వారిచేస్తూ తిరుగుతూ ఉండటంవల్ల ఆ పేరు అక్షరాలా సార్థకమైంది. గుజ్జాలవారి వంశం ఔన్నత్యానికీ, ఔదార్యానికీ దయాదాక్షిణ్యాలకీ, భోగభాగ్యాలకీ, దానధర్మాలకీ పెట్టింది పేరు. వంశపారంపర్యంగా వచ్చిన ఈ సుగుణాలన్నింటిని పుణికి పుచ్చుకొని తోటివాళ్ళలో దొర బిడ్డగా వెలుగొందాడు గోపిరెడ్డి.

## ఆడితప్పని గోపిరెడ్డి

బాల్యం నుంచీ ఆడినమాట తప్పనివాడుగానూ కార్యశూరుడుగానూ పేరుపొందాడు గోపిరెడ్డి. చక్కని సంఘటనా కౌశల్యం అతని సొమ్ము. తన చుట్టూ పదిమంది యువకుల్ని కూడగట్టుకొని వాళ్ళను వీర పురుషులుగా తీర్చి దిద్దటంతో ప్రాచీనకాలపు ఆంగ్ల వీరుడు రాబిన్‌హుడ్‌వంటివాడు గోపిరెడ్డి. పల్నాటివీరులు బ్రహ్మనాయుడన్నా, బాలచంద్రుడన్నా ఇతనికి ప్రగాఢమైన అభిమానం. బ్రహ్మన్న యొక్క అసాధారణ ప్రజ్ఞ, రాజనీతి కౌశల్యం, బాలచంద్రుని అకుంఠిత పరాక్రమం ఇతణ్ణి ఉత్తేజితుణ్ణి చేసినవి.

గోపిరెడ్డి ప్రతి సంవత్సరం తన సహచర బృందంతో కలిసి బ్రహ్మనాయుడు నెలకొల్పిన చెన్నకేశవస్వామి దర్శనార్థం మాచెర్లకు పోతుండేవాడు అక్కడ స్వామికి కైంకర్యం చేయించి

నైవేద్యం పెట్టించి ఆ అవాహనలో భక్త్యావేశంలో తన్మయుడై పోయేవాడు. ఇట్లా చేయటంలో తనవారిలో వైష్ణవభక్తిని నింపి దేశభక్తిని రేకెత్తించి త్యాగసేవా భావాలను నెలకొల్పి వాళ్ళను ఉత్కృష్ట మానవులుగా రూపొందించడమే అతని లక్ష్యం

పల్నాటి వీరులగు బ్రహ్మన్న బాలచంద్రుల భాస్వంతమగు చరిత్రను ప్రజలలో వ్యాప్తిచేసే ఉద్దేశ్యంతో సుశిక్షితులైన బుర్ర కథకుల్ని తయారు చేయించి ఊరూరా వాడవాడలా త్రిప్పి ప్రజలో వీర రసాన్ని పారించి పౌరుష తరంగాల్ని రేకెత్తించేవాడు గోపిరెడ్డి.

ప్రతి సంవత్సరం సంక్రాంతికి కోడి పందాలు, పొట్టేళ్ళ పందాలు జరిపించటం, సంవత్సరం పొడుగునా చెడుగుడు పోటీలు ఏర్పాటు చేయటం మొదలైన కార్యక్రమాల్ని ఎన్నో తలపెట్టే వాడు. ఈ పోటీలలో చుట్టుపట్ల గ్రామాలనుండి అనేకమంది యువకులు జట్లు జట్లుగా పాల్గొని కార్యక్రమాల్ని సఫలం చేసే వాళ్ళు. ఇట్లా చేయటంలో తన అనుచరులకు జోదులకుండాల్సిన లక్షణాలు నేర్పటం ప్రజల్లో క్రీడాసక్తిని పెంపొందించటం మొదలైనవి అతని లక్ష్యాలు. ఈ కార్యక్రమాల్ని ఏర్పాటుచేయటంలో గాని, వాటిని విజయవంతంగా నెరవేర్చటంలోగాని ఇతడికి అండదండలుగా నిలిచినవారిలో సవతి తమ్ముడు కోటిరెడ్డి, మేనమామ ఎల్లమందారెడ్డి ముఖ్యులు.

## బెబ్బులితో పోరాటం

గోపిరెడ్డి తన ప్రాణాల్ని పందెంలోపెట్టి సాధించిన ఘన కార్యాల్లో ముఖ్యమైనవి రెండున్నాయి. ఒకటి బెబ్బులిని చీల్చటం. రెండవది బందిపోటు దొంగల ముఠాని అణచివేయటం

ఒకసారి పెద్దపులి ఒకటివచ్చి పిల్లుట్ల గ్రామం పొలిమేరల్లో తిరుగుతున్నట్లు వార్త పొక్కింది అది పశువుల్ని మనుషుల్ని పొట్టన పెట్టుకుంటున్నదని రోజు రోజుకు వార్తలు రావటం మొదలు పెట్టినవి. గ్రామవాసులు తమ పశువుల్ని బీళ్ళలో ఉంచటానికిగానీ తాము స్వయంగా గడపదాటి బైటకు రావటానికిగానీ హడిలి పోతున్నారు. ఏక్షణాని కాక్షణం అదెక్కడ మీదపడుతుందోనని ప్రాణాలు గుప్పిట్లో ఉంచుకుంటున్నారు యువ నాయకుడైన గోపిరెడ్డి ప్రజలకి ధైర్యం చెప్పి తన బృందంతో కలిసి దానిపని పట్టడానికి నిశ్చయించుకొన్నాడు. ఆ మూడు నాలుగు రోజులు గోపిరెడ్డి బృందానికి నిద్రాహారాలులేవు. వారి హృదయాల్లో ఆదుర్దా ఉత్సాహం ఒకదానితో ఒకటి పోటీలుపడుతున్నాయి, ఆ క్రూర మృగం నుండి ప్రజా జీవితాన్ని విముక్తం చేయటమనే ఏకైక లక్ష్యం తప్ప రెండో ధ్యాసేలేదు వాళ్ళకి. ప్రయత్నాలు ప్రారంభించిన మూడు నాలుగురోజుల్లోనే పట్టపగలు ఒక జొన్న చేనులో తారట్లాడుతున్న ఆ నరహంతకిని పట్టేశారు వాళ్ళు. గోపిరెడ్డి స్వయంగా తన బల్లెంను దాని గుండెలకు గురిపెట్టి ఒడుపుగా విసిరి చీల్చివేశాడు. అం గాండ్రిస్తూ యమలోకం చేరుకున్నది. ఈ సాహస కార్యంతో అతడు ప్రజలకు మరింత ప్రీతి పాత్రుడైనాడు

## బందిపోటు దొంగలముఠా

పల్నాటిసీమ ఎటుచూసినా కొండగుట్టలతో మిట్టలతో కూడి జీబుటడవులతో నిండి ఉంటుంది. ఆ యా తావుల్లో క్రూర మృగములేగాక మహాక్రూరులైన బందిపోటు దొంగలకు కూడా సావరమైయుండేది ఆ రోజుల్లో. ప్రధానంగా నెమలి పురంకనుమ, గుత్తికొండ కనుమ, పాపాయపాలెం కనుమలు బందిపోటు దొంగలకు నిలయాలుగా ఉండేవి. వాళ్ళు ఆ యా గ్రామాల పై మెఱుపుదాడులు జరుపుతూ ప్రజల ధనప్రాణమానాలకు దినదిన గండం నూరేళ్ళాయుస్సుగా ముప్పుతెచ్చి పెట్టారు. పొలాల్లో సిద్ధంగాఉన్న పంటను ఎతుకొని పోవటం. బీళ్ళలో కట్టివేసిన పశువుల్ని తోలుకొని పోవటం మామూలైపోయింది. ప్రజలు మళ్ళా తమ రక్షకుడైన గోపిరెడ్డి వైపు దీనంగా చూశారు. అతడు బందిపోట్లను నేలరాచివేయటానికి ప్రతిన పట్టాడు. తన బృందం సభ్యులతో కలిసి అనుసరించవలసిన పథకం గురించి సమాలోచనలు చేశాడు. ఒకరోజు సర్వసన్నద్ధుడై జాగ్రత్తగా ఏరుకొని ఎన్ను కొన్న ఉక్కుదుంటల్లాంటి వందమంది అనుచరుల్ని తీసికొని చీకటిపడే సమయానికి హఠాత్తుగా దొంగల ముఠాస్థావరంపై మెఱుపుదాడి సాగించాడు. దొంగలు అనుకోకుండా జరిగిన ఈ దాడికి నిశ్చేష్టులై బేజారెత్తిపోయారు.

ఆ పరిస్థితిలో దొంగలముఠా నాయకుడైన కొండదొర తన బలంకంటే శత్రుబలమే మిన్నగా ఉన్నదని గ్రహించాడు. తనకు చిక్కుతెచ్చిపెట్టే ఈ అసమయము. అసందర్భము ఐన పోరులో ఇరుక్కోకుండా తప్పించుకొని పారిపోవాలని ఎత్తువేశాడు. కాని గోపిరెడ్డి శత్రువుల ఎత్తును వమ్ముచేసి పోరు తప్పని పరిస్థితిని కల్పించాడు. అప్పటికి బాగా చీకటిపడింది. ఇరు పక్షాల మధ్య రెండు గంటలపాటు నిర్విరామంగా తీవ్రమైన పోరు కొనసాగింది. దొంగలు పైనుండి గోపిరెడ్డి బృందంమీద పెద్దపెద్ద కొండరాళ్ళను దొర్లించారు. అయినాసరే ఆ రాళ్ళ వర్షాన్ని లెక్కచేయకుండా దొంగలకు నిలయములైన కొండగుహల్లో జొరబడారు గోపిరెడ్డి బృందంవారు. చిక్కిన వాళ్ళను చిక్కినట్లుగా చీల్చిపారేశారు. కొండదొర స్వయంగా చాలా గట్టివాడు. అయినా లాభంలేదని గ్రహించి తనకు చావు మూడుతుందని భయపడి హతశేషులైన కొద్దిమంది అనుచరుల్తో పలాయనం చిత్తగించాడు. కాని గోపిరెడ్డికి తీరని నష్టం సంభవించింది. కుడిభుజంలాంటి ఎల్లమందారెడ్డి వీరమరణం పొందాడు. ఈ విజయంతో గోపిరెడ్డి ప్రజల ఆరాధ్య దైవమయ్యాడు.

## ఈర్ష్యా రక్కసికి బలియైపోయిన గోపిరెడ్డి

ఏ కథలోగాని విలన్‌లేకుండా హీరో ఉండడుగదా ! మనిషి మనస్సులో ఒకసారి ఈర్ష్యారక్కసి ప్రవేశించిందా వాడికి లోకంలో ప్రతిమంచీ చెడుగానే కనపడి గ్రుడివాణ్ణి చేసేస్తుంది. బాల్యంనుండీ గోపిరెడ్డి పొందుతున్న పేరుప్రతిష్ఠల్నిగాని ప్రజల హృదయాల్లో అతనిపైగల ప్రేమాభిమానాలను గాని అసలతని కుటుంబానికున్న కీర్తి ప్రతిష్ఠల్నిగాని చూసి కొన్ని గొప్పకుటుంబాల పెద్దమనుషులు

కళ్ళల్లో నిప్పులు పోసుకోటం మొదలుపెట్టారు. వాళ్ళలో మన్నె సుల్తాన్‌పాలెం గ్రామకరణం గోపాలకృష్ణయ్య, పిల్లుట్ల గ్రామానికి చెందిన నందారెడ్డి ముఖ్యులు. వీళ్ళిద్దరూ కలిసి కుట్రలుపన్ని నడి వయస్సులో ఉన్న గోపిరెడ్డిని పొట్టన పెట్టుకొని పుణ్యం గటుకున్నారు.

గోపాలకృష్ణయ్యకు కూడా గోపిరెడ్డితో సమానంగానే పచ్చిక బీళ్ళున్నాయ్. ఆ రోజుల్లో గుంటూరు, కృష్ణా జిల్లాల్లో పశుసంపద బాగా ఉన్న పెద్దింటి రైతులు తమ పశువులకు సంవత్సరమంతా సరిపోయ్యేంత గ్రాసం తమ తావుల్లో లేనందువల్ల వాటిని పల్నాటి సీమకు తోలి అక్కడ పుల్లరికి తీసుకొన్న బీళ్ళలో కొన్నాళ్ళు మేపుకుండేవాళ్ళు. గోపిరెడ్డి యొక్క ఔదార్యాన్ని మంచితనాన్ని విని వాళ్ళు సాధారణంగా గోపిరెడ్డితోనే ఎక్కువగా పుల్లరికి సంబంధించిన ఒప్పందాన్ని కుదుర్చుకొనేవాళ్ళు. పై పెచ్చు గోపిరెడ్డి క్రింద పశువులు సురక్షితంగా ఉండగలవనీ, అతడు తమ పశువుల్ని జాగ్రత్తగా తమకు అప్పచెబుతాడన్న నమ్మకం గూడా వాళ్ళకతని మీద వుండేది. ఇందువల్ల పుల్లరివల్ల వచ్చే ఆదాయం గోపాలకృష్ణయ్య కంటె గోపిరెడ్డికి ఎక్కువగా ఉండేది. దీంతో ఈర్ష్యతో కాలిపొయ్యేవాడు గోపాలకృష్ణయ్య. ఈర్ష్యవిషంగామారి గోపిరెడ్డిని హతమార్చే ప్రయత్నాలు ప్రారంభించాడు.

కామారెడ్డి గోపిరెడ్డికి మేనమామ. ఇతడు గోపాలకృష్ణయ్య గ్రామమైన మన్నె సుల్తాన్ పాలానికి చెందినవాడు. ఇతడికి సుగుణవతి, అందాలరాశియైన మంగమ్మ అనే కూతురుంది. చిన్నప్పటినుంచీ మంగమ్మ గోపిరెడ్డికి భార్యగా నిర్ణయింపబడింది బంధువర్గంలో. కాని గోపాలక్రిష్ణయ్య కామారెడ్డిని తన చెప్పుచేతల్లో ఉంచుకొని గోపిరెడ్డిపై పగసాధించే దుర్బుద్ధితో కామారెడ్డికి ఏమేమో నూరిపోసి ఆ పెళ్ళికాకుండా చెడగొట్టాడు. కాని గోపిరెడ్డిని మనసారా ప్రేమించిన మంగమ్మ ధైర్యంచేసి తన తండ్రిని వదిలిపెట్టి గోపిరెడ్డికి ఇల్లాలైంది. దీంతో కామారెడ్డికి గోపిరెడ్డిమీద విరుచుకు తిందామనేంత ద్వేషం ప్రబలింది. అది అవకాశంగా తీసుకొని గోపాలకృష్ణయ్య కామారెడ్డికి పురెక్కించి గోపిరెడ్డిమీదకు ఉసికొల్పాడు.

నందారెడ్డిది పిల్లుట్ల. వయసు మళ్ళిన వాడు. మంగమ్మను రెండోపెళ్ళి భార్యగా పొందుదామని ఆశపడి ప్రయత్నించాడు. లాభంలేకపోయింది. తనకు దక్కకపోతె మానె ఆ గోపిరెడ్డికి దక్కింది, మొదటినుంచీ గోపిరెడ్డినిచూసి అసలే కుళ్ళుతున్నాడేమో పగతీర్చుకోటానికి కామారెడ్డితోను, గోపాలక్రిష్ణయ్యతోను చేతులు కలిపాడు. ఈ దుష్టత్రయము కలిసి కుట్రపన్ని గోపిరెడ్డి ప్రాణాలు తీశారు.

## దొంగలతో షరీకైన పెద్ద మనుషులు

తమ కుట్రను నెఱవేర్చుకోటానికి ఈ ముగ్గురూ కలిసి బందిపోటు దొంగల ముఠానాయకుడు కొండదొరను కలుసుకొని అతని సహాయాన్ని కోరారు. లోగడ గోపిరెడ్డి చేతుల్లో చావు దెబ్బతిన్నందువలన అతనికి సహజంగా గోపిరెడ్డి పైన కసి ఉంటుందని ఆ కసితీర్చుకోటానికి అతడు కూడా ఎదురు చూస్తూ ఉంటాడని అంచనా వేసుకొన్నారు. ఈ ముగ్గురూ, గోపిరెడ్డిని ముఖాముఖి ఎదుర్కొనే దమ్ములు తమకు లేవని దానికి నీవే సమర్థుడవని పొగిడి పురెక్కించటానికి ప్రయత్నించారు. వాళ్ళ కడుపులో ఉన్న అసలు మాటేమిటంటే ఒకవేళ హత్యానేరం పట్టుబడే పక్షంలో అది తమ మీదికిరాకుండ కొండదొరనెత్తిన పడేటట్లు చూడటమే. గోపిరెడ్డి తడాఖా లోగడ రుచిచూసిన వాడవటం వల్ల కొండదొర మొదట్లో ఈ అఘాయిత్యానికి ఒప్పుకోలేదు. కాని చివరికి ధనాశకు లొంగిపోయాడు

గోపిరెడ్డి ప్రతి రోజు ఉదయమే లేచి గుఱ్ఱం మీద బీళ్ళను, పశువుల్ని చూసుకోటానికీ, పనివాళ్ళను హెచ్చరించటానికి బయలు దేరి పోవటం మామూలుగా అలవాటు. కుట్రదార్లకు అతని అలవాట్లు తెలుసుకాబట్టి ఆ సమయంలోనే గోపిరెడ్డిని అంత మొందించడానికి పూనుకొన్నారు.

ఒక రోజు మామూలుగా అలవాటు ప్రకారం గుఱ్ఱమెక్కి పొలాల వెంబడి పోతున్నాడు గోపిరెడ్డి. ఒక చోట దారి ప్రక్కగా ఒక పొద దగ్గఱ చెవులు రెండు కోయబడి ఆ బాధకు తట్టుకోలేక అంబా అంటూ వణికిపోతూ పడిపోయిన ఒక ఆవు దూడను చూశాడు. ఇది కుట్రదారులు అక్కడ గోపిరెడ్డిని అపటం కోసం జాగ్రత్తగా ఆలోచించి అంచనా వేసి పన్నిన ఎత్తుగడ. దయార్ద్ర హృదయుడైన గోపి రెడ్డి దూడనుచూచి అగకపోతాడా మరి ? వారి పథకం చక్కగా పారింది. ఆ దూడనుచూచి గోపి రెడ్డి గుండె జాలితో నిండిపోయింది. ఆ దూడను అట్లా చేసిన తుంటరులమీద కోపంకూడా వచ్చింది. ఆ దూడకు సహాయ పడి దాని బాధను మాన్పాలనే ఉద్దేశంతో గుఱ్ఱాన్ని అపాడు. దిగాడో లేదో ఇంతలో అతని మీద, గుఱ్ఱం మీద ఉచ్చులు వేశా రెవరో ! ఆశ్చర్యపోతూ గోపి రెడ్డి తనను తాను కూడదీసు కుంటుండగనే హఠాత్తుగా పొదచాటున నక్కిన నలుగురు దుండ గులు అతనిమీద పడి బరిశెలతో దిగబొడిచి అంతలోనే మాయ మయ్యారు. గోపి రెడ్డి రక్తపు మడుగులో పొర్లాడుతున్నాడు. గుఱ్ఱానికి దెబ్బలేం తగలలేదు. పాపమాజంతువు ఉచ్చులోంచి బయటపడాలనే పెనుగులాడుతున్నది. అది చూట్టానికి, తన యజ మానికి సంభవించిన దుస్థితినిగూర్చి ఇంటికిపోయి తెలియచేయ టానికి ఆదుర్దాగా వ్యర్థ ప్రయత్నం చేస్తున్నదా అన్నట్లుది.

ఇంతలో ఆ దారినపోయే గోపిరెడ్డి జీతగాడు తన యజ మానికి వాటిల్లిన దురవస్థకు దుఃఖిస్తూ పరుగెత్తుకుంటూ పోయి ఇంటో చెప్పాడు.

అది వినంగానే భార్య మంగమ్మ, కుటుంబ సభ్యులు గ్రామ వాసులు గుండెలు బాదుకుంటూ గుంపులు గట్టుకొని వచ్చారక్కడికి. ఆ స్థితిలోఉన్న తన స్వామిని చూడగానే గుండె పగిలి మంగమ్మ అతని ప్రక్కనే పడి చచ్చిపోయింది. గోపిరెడ్డిని బ్రతికించాలనే ఆశకొద్ది వెంటనే దాచేపల్లి అసుపత్రికి తీసికెళ్ళారు. దాచేపల్లి పొలిమేర చేరుకోగానే ప్రాణాలు విడిచిపెట్టాడు గోపిరెడ్డి. శవాన్ని పిల్లుట్లకు తీసికొచ్చారు. అక్కడ తన భర్తతో కలిపి

అంతిమ యాత్ర సాగించటానికి ప్రతీక్షిస్తూ సిద్ధంగా ఉన్నది మంగమ్మ శవం. ఆ రోజు సాయంత్రం సూర్యుడస్తమించిన తరువాత ప్రజల హాహాకారాల మధ్య కన్నీటి జోహార్ల నడుమ ఆ పుణ్య దంపతుల కళేబరాల్ని స్వాహా చేసుకున్నాడు అగ్నిదేవుడు.

## గుట్టాలవారి సంఘసేవ

గోపిరెడ్డి నిస్సంతు. తన యావదాస్తినీ అతడు పిల్లుట్ల గ్రామాభివృద్ధికి, ప్రజాసౌకర్యాలకు వినియోగించాడు. అతడు చేసిన ధర్మ కార్యాల్లో ప్రధానంగా పేర్కొనవలసింది అతడు పిల్లుట్లలో స్థాపించిన అనాధ శరణాలయం. ఇది చుట్టుపట్లగల గ్రామాల్లోని బాలబాలికల విద్యాభివృద్ధికి ఉద్దేశించబడింది. అతడు మరణించడానికి కొద్ది రోజుల ముందు తన యావదాస్తినీ అనాధ శరణాలయానికిచ్చేశాడు. ప్రప్రథమంగా గోపిరెడ్డినిగూర్చి చారిత్రిక విషయాలను వ్రాసినవాడు శ్రీ రామచంద్. వారు గోపిరెడ్డి జీవితంమీద, అతని ఆశయాల, ఆదర్శాలమీద పేర్కొనదగిన పరిశోధనలు చేశారు. ఆయన తన రచనల్లో గోపిరెడ్డి ఆరువందల ఎకరాల భూమిని అనాధశరణాలయానికిచ్చివేసినట్లు పేర్కొన్నారు.

గోపిరెడ్డి అన్నగారైన వీరారెడ్డికి కూతుళ్ళతోబాటు గోపాలకృష్ణారెడ్డి అనే ఒక కొడుకుగూడా ఉన్నాడు. అతడు ఇంగ్లండ్ వెళ్ళి బారిష్టరై తిరిగి వచ్చింతరువాత శ్రీ కందుకూరి వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమంచే ప్రభావితుడై ఆయనకు శిష్యుడయ్యాడు. పాపం ఆ ఒక్క వంశాంకురంకూడా చాలా చిన్న వయస్సులోనే కీర్తిశేషుడైనాడు.

—: o :—





చూచినంత మేర భూముల పచ్చని పంట
మనసుకి కలిగిస్తుంది సంతోషపు విలువ
పోగొడుతుంది కడుపులోని ఆకలి మంట
అది కూపర్ డీసెల్ పంపుసెట్టు చలవ



**కూపర్** డీసెల్ పంపుసెట్టు




వర్టికల్ ఇంజిన్స్ 3.5-15 బి.హెచ్.పి.
హారిజాంటల్ ఇంజిన్స్ 5-50 బి.హెచ్.పి.
కూపర్ ఇంజినీరింగ్ లిమిటెడ్

# కర్నూలు జిల్లాలో కొత్త పరిశ్రమలకు అవకాశాలు

## లఘు పరిశ్రమలు

### కాలిషియం కార్బొనేటు

కర్నూలు జిల్లాలో అధిక మొత్తంలో ఉత్తమ శ్రేణి సున్నపురాయి లభిస్తుంది. అనేక రసాయనిక పరిశ్రమలలో ఉపయోగించే కాలిషియం కార్బొనేటును తయారు చేయడంలో దీనిని ఉపయోగించవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో యీ వస్తువును తయారుచేసే యూనిట్లు లేవు. 1965 లో ఆంధ్రప్రదేశ్‌లో రు. 1875 టన్నుల కాలిషియం కార్బొనేటును వినియోగించినట్లు అంచనా. జిల్లాలో యీ వస్తువు తయారుచేయడానికి మంచి అవకాశాలున్నాయి.

### రాతి పైపులు

బంక మన్నుతో తయారుచేసే రాతి పైపులను మురుగు నీటి పారుదలకు వినియోగిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో వాటిని తయారుచేయడానికి మూడు యూనిట్లు ఉన్నాయి. ప్రస్తుతం పని చేస్తున్న యూనిట్లు ఎటువంటి తీవ్రమైన పోటీని ఎదుర్కోవడం లేదు. అంతేగాక రాష్ట్రం అవలి ప్రాంతంలోకూడా తమ వస్తువులను విక్రయిస్తున్నాయి. ఈ పరిశ్రమకు అవసరమైన బంక మన్ను జిల్లాలో లభిస్తున్న దృష్ట్యా యీ వస్తువుల తయారీకి యిక్కడ మంచి అవకాశాలు ఉన్నాయి.

### ఎముకల పిండి తయారీ

వధించబడిన లేక చనిపోయిన జంతువుల ఎండు ఎముకలను చితుకగొట్టి పిండి తయారు చేస్తారు. ఎరువుల మిశ్రమాలలో ఎముకల పిండి ఉపయోగిస్తారు. చితకగొట్టిన ఎముకలను విదేశాలకు కూడ ఎగుమతిచేస్తారు 1961-62 లో మన దేశంనుండి రు. 2.60 కోట్ల విలువగల చితుకగొట్టిన ఎముకలను ఎగుమతి చేశారు. ముడి సరుకు లభిస్తున్న దృష్ట్యాను, ఎముకల పిండి, చితుకగొట్టిన ఎముకలకు డిమాండుబాగాఉన్న దృష్ట్యాను యీజిల్లాలో యిటువంటి పరిశ్రమ స్థాపనకు మంచి అవకాశాలు ఉన్నాయి.

### పండ్లు భద్రపర్చడం

యీ ప్రాంతంలో మామిడి పండు, యితర అనేక రకాల ఫలాలు లభిస్తున్నప్పటికీ, యిక్కడ పండ్లను భద్రపరచే పరిశ్రమ యింకా అభివృద్ధి చెందాల్సి ఉంది. దేశంలో పండ్ల తాండ్ర, పండ్ల హల్వా, పండ్ల రసం కలిపిన పానీయం, పండ్ల ముక్కల వంటి భద్రపరచిన పండ్లకు డిమాండు బాగా ఉంది. రాష్ట్రంలోపల రాష్ట్రం అవలి ప్రాంతాలలో ఉన్న యూనిట్లతో పోటీ ఎదుర్కోవాల్సి ఉంటుంది. ఈ పరిశ్రమను నెలకొల్పడానికి అవసరమైన లైసెన్సులను నాగపూర్‌లోని కేంద్ర ప్రభుత్వ ఆహార, వ్యవసాయ మంత్రిత్వ శాఖ మార్కెటింగ్ సలహాదారు నుండి పొందాల్సి ఉంటుంది

### రంగుల పెంకు

ముడి సరుకు లభిస్తున్న దృష్ట్యా కర్నూలు జిల్లాలో రంగుల పెంకును తయారుచేయవచ్చు రాష్ట్రంలో యీ పెంకు తయారీకి నాలుగు యూనిట్లు ఉన్నాయి. 1965 లో రాష్ట్రంలో రు. 5 లక్షల విలువచేసే రంగుల పెంకు అవసరమని అంచనా. ఈ ప్రాంతంలో యిటువంటి పరిశ్రమ స్థాపనకు మంచి అవకాశాలు ఉన్నాయి.

### టాల్కమ్ పౌడర్

టాల్కమ్ పౌడర్ మన నిత్య జీవిత అవసరాలలో ఒకటైంది జిల్లాలో దాని డిమాండు బాగా ఉంది. ఈ ప్రాంతంలో ఈ పరిశ్రమను నెలకొల్పదలచిన పారిశ్రామికులు రాష్ట్రమంతటా తమ ఉత్పత్తులను విక్రయించవచ్చు. అవసరమైన కొన్ని ముడి సరుకులు యీ జిల్లాలో లభిస్తాయి. ఈ ప్రాంతంలో యిటువంటి పరిశ్రమను లాభసాటిగా ప్రారంభించవచ్చు.

### సర్జికల్ దూది

సర్జికల్ దూదిని వైద్య అవసరాలకు వినియోగిస్తారు. జిల్లాలో యీ దూది కొల్లలుగా లభిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో సర్జికల్

దూదిని తయారుచేసే ఐదు యూనిట్లు ఉన్నాయి. 1962 లో యీ రాష్ట్రంలో రు. 3.55 లక్షలు విలువచేసే సర్జికల్ దూదిని విని యోగించారు. యీ జిల్లాలో యిటువంటి దూదిని తయారుచేసే పరిశ్రమను నెలకొల్పడానికి అవకాశాలున్నాయి.

## గృహ నిర్మాణపు యినుప సామగ్రి

గుడిదెలు, నాగవాసం, తలుపు హేండిల్ మొదలైన వస్తువులు గృహ నిర్మాణపు యినుము సామాగ్రిలో చేరుతాయి. ఈ వస్తువులను తయారుచేసే యూనిట్లు జిల్లాలో లేవు. జిల్లాలో రు.2 లక్షలు విలువచేసే యీ వస్తువులకు డిమాండు ఉంది. జిల్లాలో యీ వస్తువులకు డిమాండు బాగా ఉన్న కారణంగానూ, తయారు చేసే యూనిట్లు లేని కారణంగానూ ఈ పరిశ్రమ స్థాపనకు మంచి అవకాశాలు ఉన్నాయి.

## నూనె, ప్రత్తి కర్మాగారాల విడి భాగాలు

కర్నూలు జిల్లాలో నూనె, ప్రత్తి కర్మాగారాలు అనేకం ఉన్నాయి. ఈ కర్మాగారాలకు అవసరమైన విడి భాగాలు తయారు చేసే యూనిట్లు యిక్కడ లేవు. ఈ జిల్లాలో వార్షికంగా రు. 1.70 లక్షలు విలువచేసే విడి భాగాలు అవసరమవుతాయని అంచనా. స్థానికంగా వాటికి ఎక్కువ డిమాండు ఉన్న దృష్ట్యా జిల్లాలో యీ పరిశ్రమను నెలకొల్పవచ్చు.

## డిస్టెంపర్స్

భవనాలు, గోడలకు రంగు వేయడానికి డిస్టెంపర్స్‌ను ఉపయోగిస్తారు. ఈ వస్తువులను తయారు చేయడానికి జిల్లాలో యూనిట్లు లేవు. జిల్లాలో వార్షికంగా రు 1.00 లక్షవిలువ చేసే డిస్టెంపర్స్ అవసరమవుతాయి. వాటిని తయారు చేయడానికి ముఖ్యమైన సున్నం, పసుపు వర్ణమన్ను యీ ప్రాంతంలో లభిస్తాయి. ఈ పరిశ్రమ అభివృద్ధికి యిక్కడ మంచి అవకాశాలు ఉన్నాయి.

## కార్డుబోర్డు పెట్టెలు

ఈ ప్రాంతంలో ప్యాకింగ్ ప్రయోజనార్థం ఒక పెద్ద యూనిటుకు కార్డుబోర్డు పెట్టెలు చాలా అవసరం. ఈ యూనిటు ప్రస్తుతం కార్డుబోర్డు అట్టలలో తమ ఉత్పత్తులను ప్యాకింగ్ చేస్తున్నది. ఈ యూనిటుకు పెట్టెలను తయారుచేసిన పక్షంలో వార్షికంగా రు 30,000 లు విలువచేసే కార్డుబోర్డు పెట్టెలకు డిమాండు ఉంటుంది. అయితే యిటువంటి యూనిటును నెలకొల్ప దలచిన పారిశ్రామికులు, యీ పెట్టెలు అవసరమైన తుంగభద్ర పరిశ్రమల సంస్థను సంప్రదించవచ్చు.

## చర్మపు వాషర్

ప్రత్తి కర్మాగారాలలోని యంత్రాలలో చర్మపు వాషర్స్‌ను ఉపయోగిస్తారు. శుద్ధిచేసిన గేదెల చర్మంతో వాటిని తయారు చేస్తారు. కొన్నిసమయాలలో స్థానికచర్మకారి పనివారలు తయారుచేసినప్పటికీ యిటువంటి వాషర్స్ రాష్ట్రం అవలి ప్రాంతంనుండి వస్తున్నాయి. జిల్లాలో వార్షికంగా రు 3.60 లక్షలు విలువచేసే యీ వస్తువులు అవసరమవుతాయి. జిల్లాలో యీ ఉత్పత్తులను తయారు చేయవచ్చు.

## పశుగ్రాసం మిశ్రమాలు

నూనెతీసిన వేరుశనగ పిట్టు, ప్రత్తి గింజలు, జొన్నలు మొదలైన వాటితో పశుగ్రాసం మిశ్రమం తయారు చేస్తారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పశుపోషణ శాఖ వారు యీ వస్తువులను ఎక్కువగా కొనుగోలు చేస్తున్నారు. ప్రస్తుతం వాడుతున్న పశుగ్రాసంకన్నా యీ మిశ్రమంచాలా ఉపయోగకరమైనది. రాష్ట్రంలో 1961-62లో రు 40.00 లక్షలు విలువచేసే పశుగ్రాసం మిశ్రమాన్ని వినియోగించారు. జిల్లాలో యీ వస్తువును తయారుచేసే పరిశ్రమను నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

# పెద్దతరహా పరిశ్రమలు

## శుద్ధిచేసిన ప్రత్తిగింజల నూనె

జిల్లాలో ప్రత్తి గింజలు పుష్కలంగా లభిస్తాయి. ప్రత్తి గింజల నుండి తీసిన నూనెను శుద్ధిచేసి, ఖాద్యపునూనెగా ఉపయోగించ వచ్చు.

## వెదురు బోర్డు

వెదురుబోర్డులు తయారు చేయడానికి వెదురు చాపలను వినియోగించవచ్చు జిల్లాలో వెదురు కొల్లలుగా లభిస్తుంది. దిగుమతినిర్బంధాల కారణంగా యీ పరిశ్రమకు అవసరమైన యంత్ర పరికరాలను సేకరించడంలో కొన్ని యిబ్బందులు ఉండవచ్చు.

## వేరుశనగ పొట్టుతో అట్టలతయారీ

వేరుశనగ ఉత్పత్తికి ముఖ్యకేంద్రమైన యీ ప్రాంతంలో వేరుశనగ పొట్టు లభిస్తుంది. వేరుశనగ పొట్టుతో అట్టల బోర్డులు తయారు చేయవచ్చు.

సిద్ధేంద్ర యోగి రచిత

# భామాకలాపం

—నటరాజ రామకృష్ణ

నుగు భాషలో భాగవత సంప్రదాయానికి చెందిన ప్రాచీన, ముఖ్యమైన సంగీత ప్రబంధము యోగి సిద్ధేంద్ర విరచిత భామాకలాపము.

కృష్ణ సత్యభామల ప్రణయ కలహం, యీ కలాపంలోని కథ. కథేమంత ముఖ్యమూగాదు, విశేషించి పెద్దదీగాదు, ప్రతి కుటుంబములో భార్యాభర్తల మధ్య జరిగే ఒక చిన్న ప్రణయ కలహం. కానీ ఆ చిన్న సంఘటనను వర్ణించిన తీరు, పాడిన విధానం, అభినయించిన పద్ధతి—అతి రమణీయమై, ఆకర్షణీయమై, అశేష ప్రజానీకానికి ఆనందదాయకమై, ఆంధ్ర భాగవత కళారీతికి అమరకీర్తిని సంపాదించి పెట్టినది.

వెన్నదొంగ చిన్నికృష్ణుడు తన లీలలు యతి నారాయణ తీర్థులచే వర్ణింపజేసుకొని, నర్తకులచే నాట్యమాడించుకొని, ప్రజా హృదయాలను దొంగిలించి తృప్తిచెందాడు శ్రీ కృష్ణలీలా తరంగిణిలో—

ప్రేమ మూర్తిగా, జగన్నాధునిగా—రాధా మాధవుల ప్రణయ లీలలుగా, తన గాధ గీత గోవింద రూపంలో జయదేవునిచే కీర్తింపజేసుకొని, అతని పత్ని పద్మావతిచే నర్తనమాడించుకొని శృంగార మూర్తిగా గీత గోవిందంలో సాక్షాత్కరించాడు, మోహనమురళీ— భారతావనికి మిగిలిన అతి ప్రాచీన నృత్య సంగీత లక్ష్య ప్రబంధము జయదేవ కవి గీత గోవిందమొక్కటే.

జయదేవ కవి అష్టపదుల్లో పొందుపరచిన మధుర భావ పరంపర, నృత్య అభినయాలద్వారా భారతదేశ కళాకారులచే ప్రచారములోనికి తేబడింది.

యతి నారాయణ తీర్థుల— తరంగాల్లోని కృష్ణ కథ నృత్యాలకు అనుగుణంగా తీర్చిదిద్దబడింది.

కాని ఒక్క విశేషం— ఈ రెండు రచనలూ సంస్కృత భాషలోనే వున్నవి. ఉన్ననూ ఆ భాష సామాన్య ప్రజలకు అర్థం గాకపోయిననూ, నవనీతచోరుడు ఆ జగన్నాధుని కథ యెంతటి మహిమాన్వితమైనదో, అతనిపేరు ఉచ్చరించినంతనే, తముదా మరచి, తన్మయత్వంతో నోలలాడుతుంది భారత ప్రజానీకం.

నృత్తం, నృత్యం, అభినయం— యీ మూడు విభిన్న రీతులను చక్కగా ప్రయోగముజేసి, కృష్ణ కథను ముచ్చటగా సామాన్య ప్రజలకుకూడ అందించాలన్న సంకల్పమే - సిద్ధేంద్రుల వారు తెనుగు భాషలో— భామాకలాప రచనకు కారణం.

అదియే విశేష ప్రచారమునొందింది, అనేకులచే ఆరాధింపబడి, అనేక నూతన పద్ధతుల్లో మరల మరల వివిధ కవులచే రచింపబడి, అభినయించబడి, నర్తించబడి, ఆదరించబడి, పోషింపబడి నేటికి అభిమానింపబడుటకు ముఖ్యకారణము.

భామా కలాపము, కలాప నర్తనరీతి, కలాప కళాకారుల గూర్చి వివరంగా చర్చించుటకు ముందుగా మనదేశంలోని నృత్య రీతుల గూర్చి కొంత తెల్పుట అవసరము.

నట్టువ మేళము, నాట్య మేళము— అని భరత విద్య అనాదిగా మనదేశంలో రెండు సంప్రదాయాలుగా పెంపొంది, ప్రచారములో నున్నది. స్త్రీలచే చేయబడే ఏకపాత్ర నృత్య రీతి, నట్టువమేళము. పురుషులచే ప్రదర్శింపబడే బహు పాత్ర నాట్య రీతి, నాట్యమేళము—. ఈ నాట్యమేళమే భాగవత మేళమని గూడా పిలువబడుతుంది. ప్రాచీన కాలమునుండి నృత్యమూ, సంగీతమూ హైందవ ఆరాధనలో ఒక భాగమైనట్లు, సంగీతకళ మత ప్రచారానికి ఒక చక్కని సాధనగా వుపయోగించినారు పూర్వము మత ప్రచారకులు! యోగులు, యతీంద్రులు. కాకతీయుల కాలంలో నాట్య మేళముల వారు శివలీలలను చక్కని నృత్య కథలుగా రూపొందించి, వూరూరా! వాడవాడా తిరిగి శైవ మత ప్రచారము నృత్యగానాలద్వారా జేసినారు. శైవము, వీర శైవముల యొక్క ప్రాబల్యము ఆంధ్రలో తగ్గి వైష్ణవము యెక్కువగా ప్రజాదరణ పొందినప్పుడు భాగవత కథలు ప్రచారములోనికి వచ్చినవి. నాటినుండి నాట్య మేళములు భాగవత మేళములైనవి— నర్తకులు భాగవతులైనారు. వైష్ణవము రెండు విధాలుగా ప్రచారమందున్నది. మహావిష్ణు ఆరాధన ఒక విధము. అవతార పురుషుడు శ్రీకృష్ణుని ఆరాధన మరొక విధము. అందులో రాధా మాధవుల ఆరాధన మధుర భక్తి సంప్రదాయము— కృష్ణభక్తి, విశేషించి, మధుర భక్తి, దేశంలో ప్రచారములోనికి వచ్చిన

పిదపనే— నృత్య అభినయ కళలకు అనువైనట్టి అనేక రసవత్తర సంగీత రచనలు దేశ సాహిత్యములో సృష్టించ బడినవి.—

అట్టి వానిలో మొదటిది రాధా మాధవుల ప్రణయలీలా వర్ణన గీత గోవిందము — అటుపై అస్సాముకు చెందిన శంకర దేవ అనే యోగి పుంగవుడు. కృష్ణ కథల నెన్నింటినో నృత్య రచనలుగా చేసినాడు. అతడు కేవలము కవియేగాడు. సంగీతము నృత్యముల చక్కగా నెరిగి నృత్య గానాలతో మురళీధరుని ఆరాధించి, వైష్ణవ మతాన్ని ఆ దేశంలో ప్రచారముచేసినాడు. ఆయన వ్రాసిన వాటన్నింటిలో పారిజాత కథ ముఖ్యమైనట్టిది.

అటుపై చైతన్య మహా ప్రభువు వంగ దేశమందును, అతని శిష్యుడు రామానంద ఓఢ్ర దేశంలోనూ కృష్ణ భక్తిని నృత్య సంగీత కళలద్వారా ప్రచారము జేసినారు. వల్లభాచార్యుడు ఆంధ్రదేశానికి జెందినవాడైననూ గుజరాత్ ప్రాంతానికి వెళ్లి ఆ ప్రాంతీయుల్లో వైష్ణవము ప్రచారము గావించినాడు. ఆ కోవకు జెందిన యోగి పుంగవుడే యోగి సిద్దేంద్రుడు. రాధా మాధవుల ప్రణయగాధ, కృష్ణ జననము మొదలుకొని రుక్మిణీ కళ్యాణం వరకూ భాగవత కథను జయదేవ, నారాయణ తీర్థులు అప్పటికే రచన జేసిరి—. మిగిలిన కృష్ణ జీవితములో అతి రసవంతమైనట్టి భాగము కృష్ణ సత్యభామల కథా భాగము— ఆ గాథను సిద్దేంద్రులవారు రచించారు. యతి నారాయణ తీర్థులవారు "కృష్ణ పారిజాతము"— యక్షగానంగా రచించినా అది సిద్దేంద్రుల వారి రచన యంతటి రసవంతముగా లేనందున గాబోలు 'భామా కలాప' మంత ప్రచారములోనికి రాలేదు.

భామా కలాపము కథా భాగము— ఇదివరకే తెల్పియున్నాను. కథ ఏమంత పెద్దదిగాదు— ఒకనాడు సత్యభామ, పడకటింటిలో హంస తూలికా తల్పము మీద నిదురించి యుండగా, శ్రీకృష్ణుడు ఏతెంచి, నిదురలేపి, సర్వాభరణములను ధరింపజేసి, నిలువుటద్దములో నీడ జూపించి— వారిద్దరిలో యెవరు చక్కని వారని అడుగగా— స్వాధీనపతినీ, సౌందర్య గర్విత తానే చక్కనిదని చెప్పగా, కృష్ణుడు కోపగించుకొని, అలిగి వెళ్లిపోగా, మాధవి ద్వారా రాయబారము నంపి, మరల అతని కరుణకు పాత్రురాలౌతుంది—. కథ యింత చిన్నదే గాని, దీనిని తొమ్మిది రాత్రిళ్లు వరుసగా ప్రజా రంజకముగా నాటిన కళాకారులు యెంతటి పండితులో, విజ్ఞానవేత్తలో, కళానిధులో మన మూహించుకో వచ్చును. ఎంతో పాండితీ ప్రతిభ వుండినగాని అంత గొప్ప గ్రంథమును కల్పించలేరు. తొమ్మిది రాత్రుల గ్రంథము, మూడు రాత్రులు, ఆపై ఒక రాత్రి నేటి కాలంలో రెండు గంటల గ్రంథంగా సంక్షిప్త రూపం దాల్చింది.

ఆ యోగి పుంగవుడు— ఈ కలాపమును రూపొందించిన వేళా విశేషమెట్టిదోగాని, ఆంధ్రదేశంలోని మారుమూల ప్రాంతాలోని కళాకారుల్ని గూడా ఆకర్షించింది ఆ భాగవతము. నేటి వలే రాకపోకల సౌకర్యములు లేని ప్రాచీనకాల మది. అయిననూ ఆ కథ దేశమంతటా ప్రచారమైనది. తూర్పున బరంపురం, గంజాం మొదలుకొని, రాయలసీమలోని కర్నూలు జిల్లాలవరకూ వుండే కళాకారులు— ఈ భామా కలాపము నభిమానించారు, అభ్యసించారు. అంతేగాక వారి ప్రాంతాల్లో కవి పండిత సంగీతజ్ఞులచే నూతన రచనలు జేయించి, ప్రాచీన కలాపంతో జేర్చి ఆడుట ప్రారంభించారు ఆ విధంగా అనేక కవులయొక్క రచనలతో కూడిన అనేక కలాపములు, అనేక నృత్య సంప్రదాయాలు ప్రచారములోనికి వచ్చినవి. కూచిపూడి వారు గూడా యితర సంప్రదాయాల్లోని రచనలను సిద్ధేంద్రుల వారి రచనతో చేర్చి ఆడుతూ వచ్చారు. గ్రంథము విస్తరించుటవల్ల, నేటి కాలములో పూర్తిగా సిద్ధేంద్రుల వారి కలాపమేదో తెలిసికొనుట కష్టమైనది.

## భామాకలాపము-రచనా రీతులు

ఈ కలాపమునకు మూలము యోగి సిద్ధేంద్రుల వారి రచన అటుపై రచన చేసిన వారిలో ముఖ్యులు— నగరికంటివారు, నెల్లిమర్ల వారు, దువ్వవారు, చింతల పాటి వారు, నరసింగపల్లి వారు, కేశవపురి వారు, వంకాయల వారు, శ్రీ దాసు శ్రీరాములు గారు, యిత్యాది కవుల రచనలను గూడా భాగవతులు చేర్చి ఆడుచున్నారు.

సిద్ధేంద్రుల వారి రచనతో పాటు నగరి కంటి వారి, దాసు శ్రీరాములు గారి, కేశవపురి వారి, రచనలను కూచిపూడి వారు ఆడుచున్నారు.

నెల్లిమర్ల వారి, దువ్వ వారి, నరసింగపల్లి వారి, కేశవపురి వారి గ్రంథములను సిద్ధేంద్రుల గ్రంథంతో జేర్చి తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని దేవదాసీలు ఆడుచున్నారు.

వంకాయల వారి, చింతలపాటి వారి, నరసింగపల్లివారి గ్రంథాలను సిద్ధేంద్రు కలాపముతో జేర్చి తూర్పు భాగవతులు, శ్రీకాకుళం జిల్లా, విశాఖ జిల్లాలలోని కళాకారులు ఆడుచున్నారు.

రాయలసీమ, కోటకొండ భాగవతులు సిద్ధేంద్రుల రచన, నగరికంటి వారి, కేశవ పురి వారి రచనలతో చేర్చి ఆడుతున్నారు.

తెలంగాణా ప్రాంతంలో యక్ష గానములు ప్రచారములో వున్నవి గాని— భామా కలాపం భాగావతులచే ఆడబడుట లేదు.

## భామా కలాపము-సంప్రదాయము

కలాప సంప్రదాయాలను నాలు విధాలుగా విభజించవచ్చును. కూచి పూడి సంప్రదాయము, దేవదాసీ సంప్రదాయము, తూర్పు సంప్రదాయము,కోటకొండ సంప్రదాయము.

పై నాల్గు సంప్రదాయాలలో దేవదాసి బాణీయందు తప్ప మిగిలిన అన్ని రీతులందూ పురుషులే స్త్రీ పాత్రను ధరింతురు.

భారత దేశంలో ఏప్రాంతములో చూచిననూ భాగవత సంప్రదాయము పురుషులు మాత్రం ఆరాధించుచున్నారు. స్త్రీలుఈ విద్యలో పాలొనరు. కేరళలోని కథకళి, ఉత్తరాదిని రామలీలా, నౌటంకీ బంగాళలోని కీర్తన ఒరిస్సాలోని సొక్కినట, కర్నాటక దేశం

లోని యక్షగానము యీ సంప్రదాయాలన్నీ నాట్యమేళానికి చెందినవే. ఇందులో యెచ్చటనూ స్త్రీలు పాల్గొనుట గాంచము. కాని ఆంధ్రదేశంలో స్త్రీ నర్తకినులు భరత నాట్యమునే గాక, ఈ భాగవత విద్యను, ముఖ్యంగా భామా కలాపము అభ్యసించి అద్వితీయ ప్రతిభతో ప్రదర్శించిరి. ఇది ఆంధ్రులకెంతో గర్వకారణము.

సిద్ధేంద్రుల వారు 'భామా కలాపము' కూచిపూడి వారిచే అభ్యసింప జేసి, గోల్కొండ పాదుషాల నుండి కూచిపూడి అగ్రహారము వారికి దానముగా యిప్పించి, ఆర్థిక చింతన లేకుండా ఆ కళాకారులు కళారాధన చేయుటకు అవకాశము కల్పించినారు.

బనగానపల్లి నవాబు, కొన్ని భాగవత కుటుంబాలను రాయల సీమకు ఆహ్వానించి కోటకొండ కపటాల్రి గ్రామము వారికి యినాముగా నిచ్చి పోషించి వారిచే రాయల సీమలో ఆ కళను ప్రచారం జేయించినారు.

తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోని అగ్రహారీకులు, విద్యావంతులైన రసిక భూస్వాములు దేవదాసీ కళాకారులను పోషించారు. పిఠాపుర సంస్థానాధీశులు రావు గంగాధర రామరావు గారు ప్రత్యేకంగా కలాప రచనల జేయించి ఒక నర్తక కుటుంబానికి శిక్షణ నిప్పించి పోషించారు. అదే నెర్లిమర్ల వారి కలాపం.

తూర్పు ధనికులైన భూస్వాములు కలాప కళాకారులను పోషించుటయేగాక, వారి కలాపములను నేర్చుకొని ఆడేవారు. వంకాయల బలరామ భక్తగారు కలాపము రచించి, వుచితంగా నేర్పించి కళాకారులకు ఆర్థిక సహాయము చేసి ప్రచారం చేయించినారు. చింతలపాటి వారు, క్షత్రియులు ప్రత్యేక కలాప రచన చేయించి ప్రచారంలోనికి తెచ్చినారు. అట్లే నర్సింగాపల్లి వెంకు నాయుడు ఆ వూరిలో వెలిసిన వేణుగోపాలుని కంకితంగా ఒక కలాపం రచన చేయించి పోషించినారు. ఈ విధంగా సిద్ధేంద్రుల వారు నాటిన బీజము, మర్రి విత్తనము నుండి మహా వృక్షమైనట్లు, వృద్ధిజెంది అనేక శాఖోపశాఖలుగా వృద్ధి చెందినది.

## కొందరు ప్రఖ్యాత కలాప కళాకారులు

కూచిపూడికి చెందిన ప్రసిద్ధ కళావేత్తలు— శ్రీ చింతా వెంకటరామయ్య గారు, వెంపటి వెంకటనారాయణగారు, వేదాంతం లక్ష్మీనారాయణ గార్ల గురించి కళాలోక మెరుగును.

కూచిపూడి తరవాత ప్రసిద్ధి గాంచినది మండపేట. మండపేటలో ఒక ప్రఖ్యాత నర్తకీమణి వుండేవారు. ఆమెయే దుగ్గిరాల మాణిక్యం. ఆమె యెందరికో ఆ విద్య నేర్పినది. పూర్వం మండపేటలో పదహారు మేళములుండేవట. వారు కలాపములనే గాక కర్నాటకము గూడ ఆడే వారు. నేటికి మండపేటలో కొందరు వృద్ధ కళాకురిణిలున్నారు. అందు ప్రసిద్ధులు శ్రీమతులు పందిరి వేంకటరత్నం, నాయకుడు సత్యం. పిఠాపురంలో పెండేల సత్యభామ ప్రసిద భాగతారిణి, కుంతి మాధవ స్వామి ఆలయ నర్తకిని—ఆమె గతించినది. రాజావారు పోషించిన సంప్రదాయము నెరిగిన నర్తకీమణి శ్రీమతి కోనె చిట్టిరాజా జీవించి యున్నది. ముమ్మిడి వరంలో అన్నాబత్తుల బులి వేంకటరత్నం ప్రసిద్ధ భాగవతారిణి.

తూర్పు బాణిని—బొబ్బిలి బాణీ అంటారు. ఆ బాణీలో ప్రసిద్ధులు శ్రీ నందిగామ వెంకయ్యగారు. ప్రసిద్ధ వైణికులు తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారి బావగారు శ్రీ వెంకయ్యగారు. కొంతకాలం భాగవత కళనాడి విరమించి కేవలం గాత్ర సంగీతము నారాధించుటలో జీవితము గడిపినారు. ఈ బాణీలో ఎందరో ప్రముఖులు నేటికి ఆడుతున్నారు. అందు కొందరు ముఖ్యులు శ్రీ వరదా ఆదినారాయణ, శ్రీ దూడల శంకరయ్య, శ్రీ బొంతల కోటి జగన్నాథంగార్లు.

కోటకొండ వారిలో ప్రసిద్ధులు శ్రీ చల్లా భరతశాస్త్రం లక్ష్మీనారాయణగారు వీరుగాక యింకెందరో ఈ కలాప విద్యను నారాధించి ప్రచారములోనికి దెచ్చినారు.

## ఈ బాణీలలోని విశిష్టత

తూర్పువారు పాడి ఒప్పిస్తారు—ఇతర ప్రాంతముల వారు ఆడి, అభినయించి ఒప్పిస్తారు.

కూచిపూడి బాణీలో, దేవదాసీల ఆటలో నృత్త, నృత్య అభినయాలు పోషింప బడునవి. తూర్పువారు గంటల తరబడి ఒక దరువును గానంచేసే రీతిని వృద్ధిపరచినారు. పాడలేని భామ వేషధారిని ఆ ప్రాంతీయులు ఆదరించరు. అది ఆ దేశ సాంప్రదాయము గనుకనే ధ్రుపద వాద్యము ప్రాచీన పద్ధతిలో వినవలెనన్న మనం తూర్పు ప్రాంతానికే వెళ్ళవలసి వుంటుంది. ధ్రుపద రీతిలో మృదంగము వాయించే వారిలో ప్రసిద్ధుడు శ్రీ కోరుకొండ సత్యం. ఈ వాద్య విధానము ఉత్తర హిందూస్థానం వారిలో వుంది. ధ్రుపద అనగా దరువు. ఈ దరువు వాద్యము ప్రాచీన రీతి, తూర్పున తప్ప ఆంధ్రలో మరెచ్చటనూ గాంచము కూచిపూడిలో గూడా లేదనే చెప్పాలి.

## నేను సేకరించిన కలాపములు—అభ్యసించిన రీతులు

ప్రథమంలో శ్రీ విస్సా అప్పారావుగారి ప్రోత్సాహంతో శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణగారి వద్ద కూచిపూడి సాంప్రదాయం కలాపం అభ్యసించే అవకాశం లభించింది. అటుపై పిఠాపురం శ్రీమతి పెండేల సత్యభామ సంప్రదాయం నేర్చినాను. మారంపల్లి గ్రామం, పశ్చిమగోదావరి జిల్లాలో చిత్తజల్లు వారు ప్రసిద్ధ కలాప నర్తకినులు—శ్రీమతి వైదేహి ఇందువదన వద్ద కొన్ని ముఖ్యమైన దరువులు అభ్యసించాను. మిగిలిన ప్రసిద్ధ కళాకారుల పాట, ఆట జూచే అవకాశము లభించినది. వారు ప్రదర్శించే గ్రంథముల వ్రాత ప్రతులు సేకరించినాను. మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీనుండి—భామా కలాపం, సిద్ధేంద్రులవారి రచన

వ్రాయించి తెప్పించినాను. ప్రతి సాంప్రదాయంలోనూ కొన్ని ముచ్చటైన దరువులున్నవి. చక్కని సంగీతము, ముద్దులొలికే భావముతో నిండి, నృత్యాభినయాలకెంతో అనువైనట్టి రచనలవి. అట్టివి వీరికూర్చి సర్వాలంకార శోభితమైన – భామా కలాపము – రూపొందించి నేటి కాలానికి సరిపడు రీతిని ప్రాచీన రీతులను విడనాడక, నాట్యమును తీర్చిదిద్దినాము. ప్రదర్శించుచున్నాము. ప్రచారము చేయ సంకల్పించినాము. ఈ కలాపంలో ఆంధ్రలోని భాగవత కళ సంపూర్ణ స్వరూపము ప్రతిబింబింప జేయగలమని ఆశించుచున్నాము.



తోలుబొమ్మలాట నిర్వాహకులతో రాష్ట్రపతి. ఫిబ్రవరి 23న రాష్ట్రపతి భవనంలో తోలుబొమ్మలాట ప్రదర్శన జరిగింది.

# తోలుబొమ్మలాట ప్రదర్శనం

అస్పృశ్యత, వర్ణ విచక్షణను తొలగించడానికి గాంధీజీ చేసిన కృషిని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ, యాత్రిక శాఖవారు తోలుబొమ్మలాట రూపంలో ఫిబ్రవరి 28 న సేవాగ్రాంలోని "మహదేవ భవన్"లో ఒక ప్రదర్శన ఏర్పాటుచేశారు.

అస్పృశ్యతను నివారించడానికి గాంధీజీ చేసిన మహత్తర కృషిని ఇతివృత్తంగా తీసుకొని ఈశాఖ రూపొందించిన తోలబొమ్మలాటను ఆచార్య వినోబాభావే ప్రశంసించారు. అయితే అనారోగ్య కారణం వల్ల ఆయన ఈ ప్రదర్శనాన్ని చూడలేకపోయారు. కీర్తిశేషులు శ్రీ రామదాస్ గాంధీ సతీమణి శ్రీమతి నిర్మలగాంధీ, ఈ ప్రదర్శనను తిలకించారు. సమాచార, పౌర సంబంధ, యాత్రిక శాఖ అసిస్టెంటు డైరెక్టరు శ్రీ యన్. వి. నారాయణరావు, ఆచార్య వినోబాభావేకు ఈ తోలుబొమ్మలాటలోని ముఖ్యవిశేషాలను వివరించి చెప్పారు.

సేవాగ్రాం ఆశ్రమ అధికారుల కోరికపైన, సమీపంలోని గ్రామంలో మరొక ప్రదర్శన ఏర్పాటు చేయడం జరిగింది.

ఈ తోలుబొమ్మలాటను ఫిబ్రవరి 23 వ తేదీన రాష్ట్రపతి భవనంలో శ్రీ వి. వి. గిరి తిలకించారు. న్యూఢిల్లీలోని మాస్ కమ్యూనికేషన్ సంస్థ, ఆంధ్ర స్కూల్‌లో కూడా ఈ ప్రదర్శనలు ఏర్పాటు చేయబడ్డాయి. దీనికి ఖర్చులు తక్కువే ఆయినా ఇది ఇంచుమించు టెలివిజన్ మాదిరేవుంది, అని దీన్ని గురించి ఒకరు వ్యాఖ్యానించారు.

# ఉగాదితో ముఖాముఖీ

ఆద్దేపల్లి
రామమోహనరావు

పాతతరం వాడిపోయి పడమట రాలిపోతున్నప్పుడు
కొత్త తరం తూర్పున ఊపిరి కిరణాలు చిమ్ముతూ లేస్తున్నప్పుడు
మధ్యలో ఆశాజ్వాలవలె నిలబడ్డ ఓ ఉగాదీ!

గడిచిన ఏటిని కాలపు గోతిలో తోసి
కొత్తఏటిని చేతిలో యింద్రధనస్సులా మెరిపిస్తూ
ప్రతిఏడూ ప్రజలముందు నిలుస్తావు—

మూడువందల అరవై రోజుల కలల్ని
కవిత్వాలుగా మార్చిన కవులచేత
ప్రతియేడూ నీరాజనాలందుకుంటావు—

కాని

నిర్దాక్షిణ్యంగా ఆ కలల కంఠాలు నరికేసి
కాలం ముఖాన్ని నెత్తురు జీరలతో వికృతం చేస్తావు—

కిందటేడు నిన్నునమ్మి కీర్తించాను కాని!
నేను కళ్ళ ఎదుట చూచిందేమిటి?
అన్నదమ్ముల్ని ఒకళ్ళచేత ఒకళ్ళని పొడిపించి
వారి నెత్తురితో స్వార్థపరుల గాసులు నింపడం చూశాను!
దేశంలో మనిషికీ మనిషికీ మధ్య ద్వేషాన్ని పెంచి
వాళ్ళ గుండెలమీద కత్తుల్ని పదునుపెట్టడం చూశాను!
మనిషినింకా యింకా డబ్బుకి దాసున్నిచేసి
అసమత్వంలోనుండి పిండిన కన్నీటితో నువ్వు ముఖం కడుక్కోవడం చూశాను
ప్రతి విషయాన్నీ చీలికలు చీలికలు చేసి
అనైక్యతను పీలికలుగా ఒంటినిండా వేళ్ళాడదీసి
నా దేశం గుండెమీద వికార తాండవం చెయ్యడం చూశాను!
ముందుకు పోయేదేశం కాళ్ళకు బందాలువెయ్యడం చూశాను!
ఎత్తిన మానవత్వపు చేతిని ఖండించడం చూశాను
ఇటువంటి నిన్ను
ఈ ఏడాది ఏమని కీర్తించను ఉగాదీ!
ఎంతచెడ్డా కవిని కాబట్టి
ప్రజల ఆశలకి ప్రతినిధిని కాబట్టి
నిన్నొకసారి హెచ్చరించడం నా బాధ్యత!
ఈ ఏడు మనుష్యులమధ్య దూరాన్ని తగించు—
దేశ సౌభాగ్య బీజాల్ని అడుగడుగునా నాటించు—
కన్నీటితో తడిసిన దేశమాత పెదవులమీద చిరునవ్వులు చిందించు—
ప్రజలందరి గుండెలతో గులాబిమాలనల్లి నీమెడలో ధరించి
వచ్చేఏడు సౌందర్య మూర్తివై కనిపించి
కవుల సంతృప్తిలోనుండి కమనీయ గీతాలు పలికించు!

# ఇటీవలి తెలుగు నవల

మంజుశ్రీ

ఇటీవల తెలుగు సాహిత్యంలో నవలకున్న ప్రచారం, ఆదరం, మరింకే సాహిత్య ప్రక్రియకూ ఉన్నట్లు కనపడదు. బహుశా తెలుగు సాహిత్యంలో ఇది "నవలాయుగ" మేమోనని చెప్పవచ్చు. కథలుకూడ బహుళ సంఖ్యలోనే వెలువడుతున్నా, పాఠకులు నవలను ఆదరించినంతగా, కథను ప్రోత్సహించటం లేదనిపిస్తున్నది. చాలా మంచి కథలు ఇదివరలో వ్రాసిన కథకుల కన్నా, ఒక మోస్తరు నవలలు వ్రాసిన నవలా రచయితలకే, పేరు ప్రఖ్యాతులు రావటం, దీనికొక నిదర్శనంగా చెప్పవచ్చు. నవల ఏదైనా పత్రికలో వెలువడుతున్నప్పుడే దానికి తగినంత ప్రచారం వస్తుంది. ఇట్లా రావటానికి కారణం అది ఒక్కసారిగా కాకుండా, ధారావాహికంగా, పత్రికల్లో వెలువడటమే. అందువల్ల నవల పాఠకుల్లో కొంత ఉత్కంఠనురేకెత్తిస్తుంది. ఎంత మంచి కథైనా, చదివినంత సేపే తప్ప, లేదా పాఠకుల చిత్త వికాసాన్ని బట్టి, ఆ తరవాత ఏ కొద్ది కాలమోతప్ప, నవలలాగా, కొంత కాలం ఆలోచనలను, ఊహలను ఆకట్టుకోదు. అందువల్ల నవల చూపే ఆకర్షణ కథ చూపలేక పోతున్నది. అంతేకాకుండా ప్రతి వార, పక్ష, మాస పత్రికల్లో కథలు అధిక సంఖ్యలో వెలువడుతూ ఉండటమూ, తక్కువ ఖరీదుకే, మూడో, నాలుగో, ఇంకా అంత కన్నా ఎక్కువేనో, కథలను చదువుకొనే అవకాశం ఉండటమూ, కథా సంపుటాలకు, మార్కెట్‌లో తగినంత గిరాకి లేకుండా చేస్తున్నాయి. అందువల్లనే నవలను కొన్నంత మంది పాఠకులు, చదివినంత మంది పాఠకులు, కథల సంపుటాలను కొనటంలేదు. కాబట్టి సంపుటాల్లో చదవటం లేదు. ఏ తావాతా నవలకున్న ప్రచారం, గిరాకీ, మరే ఇతర సాహిత్యశాఖకూ లేకుండా పోయింది.

అయితే ఇటీవల వస్తున్న నవలల ప్రమాణాలు ఎట్లా ఉంటున్నాయి అని ప్రశ్న వస్తుంది. చాలా నవలల్లో వస్తువైవిధ్యం ఉండటం లేదనీ, సాహిత్య ప్రయోజనాన్నిగానీ, ఘనమైన శిల్ప సంపదనుగానీ, ఈ నవలలు లక్ష్యంగా పెట్టుకోవటం లేదనీ స్థూలముగా చెప్పవచ్చు. ఈ అభిప్రాయాలకు అపవాదాలైన నవలలు కూడా ఏ కొద్ది సంఖ్యలోనో వెలువడుతూనే ఉన్నాయి.

రాశినిబట్టి చూస్తే, నవలదే అగ్రస్థానమన్నది సుస్పష్టమే. అయితే ఎప్పుడైతే రాశి అత్యధికంగా ఉంటుందో, వాసి అంతంత మాత్రంగా ఉండటం లోక ధర్మమే. కాల్పనిక సాహిత్యాన్ని ప్రచురించే ప్రచురణ కర్తలందరూ కూడా నవలలు ప్రచురించటానికే పరుగులు తీస్తున్నారు. పత్రికల వాళ్లుకూడా ప్రతి సంవత్సరమూ, ఐదారు వేల రూపాయల బహుమతులను తాము ఉత్తమ నవలలని భావించి, పోటీనుంచి ఎన్నికచేసిన వాటికి ఇస్తూ ఉన్నారు. పాఠకుల సంఖ్య, అందులో ముఖ్యంగా వారపత్రికలు చదివే వాళ్ళ సంఖ్య దినదినాభివృద్ధి చెందుతున్నట్లు అనేక నిదర్శనాలున్నాయి. పత్రికలు ప్రచురించే వాళ్లుగాని, పుస్తక ప్రచురణ కర్తలుగాని, ఈ పాఠక వర్గాన్ని దృష్టిలో పెట్టుకోకుండా వ్యవహరించటానికి వీలులేదు. అట్లా వ్యవహరిస్తే అది మొదలు చెడిన బేరమవుతుంది. ఈ పాఠకవర్గం ఎలాంటిదో, వారి అభిరుచులెలాంటివో, ఏ ఇతివృత్తాలు వారిని అధికంగా ఆకర్షిస్తాయో, బాగా ఆలోచించి, ప్రచురణ కర్తలూ, పత్రికాధిపతులు, అటువంటి సాహిత్యాన్ని అందజేస్తున్నారు. ఈ పాఠకుల్లో పదిహేను సంవత్సరాలనుంచి, ఇరవై అయిదు సంవత్సరాల వయస్సు ఉండే యువతీ యువకులు ముఖ్యులు. వీళ్లు హైస్కూలు పై తరగతుల్లోనూ, కాలేజీల్లోనూ విద్యాభ్యాసంచేస్తూ ఉంటారు. నేటి సాంఘిక వ్యవస్థనుబట్టి అత్యధిక సంఖ్యాకులు అవివాహితులే. తారుణ్యపు తొలి రోజుల ముగ్ధత్వమూ, భవిష్యత్తును గూర్చిన తీయని కలలూ, ఊహాజగత్తులో విహరించటమూ, వీళ్ళ ముఖ్య లక్షణాలు. అసలైన సాంఘిక సమస్యలూ, మనుషుల్లోని అంతస్సులూ, వాస్తవికతకూ, కాల్పనికతకూ ఉండే అంతరమూ, వీళ్ళను బాధించవు. ఇక రెండో వర్గం మధ్య తరగతి ఉద్యోగస్థుల ఇళ్ళలోని ఆడవాళ్ళు. ముఖ్యంగా నగర జీవితానికి అలవాటు పడినవాళ్లు. నిత్యజీవిత సమస్యలైన రోగాలు, రొష్టులు, చాలీచాలని జీతాలు, అప్పులూ సప్పులూ

దూరాల ప్రయాణాలతో సతమతమైపోయ్యే మధ్య తరగతి కుటుంబీకుని ఇల్లాలుకు మానసిక విశ్రాంతినిచ్చేవి పత్రికలూ, పుస్తకాలూ తప్ప వేరే ఏమున్నాయి? ఆ పత్రికల్లో కథలూ, నవలలూ, మానవ జీవితంలోని విషాదాన్ని, యాథార్థ్యాన్ని నిరూపణం చేసేవయితే వాటివల్ల, మానసికమైన వత్తిడునుంచి కొంచెమైనా విశ్రాంతి వాళ్ళకు లభించదు. వీళ్ళలో చాలామంది, వయస్సునుబట్టిగాని, జీవితానుభవాన్ని బట్టిగాని, చదువు సంధ్యలను బట్టిగాని, సాంఘికమైన హోదానుబట్టిగాని, స్థితిగతులను బట్టిగాని, కల్పనకూ, వాస్తవికతకూ ఉండే అంతరాన్ని పోల్చుకోలేని వాళ్ళే. అదీకాక తమ జీవితాల్లో అనుభవానికిరాని, ఇతివృత్తసంఘటనలను, ఉత్కంఠతలో చదువుతారు. ప్రేమికుల వియోగం, సాహసం, వాళ్ళుపడే కష్టాలు, సంఘాన్ని ఎదిరించటం, మొదలైనవన్నీ ఎక్కువగా వీళ్ళను ఆకర్షిస్తాయి అందువల్ల ముఖ్యంగా ప్రేమకథలు, ఆకర్షణీయమైనంతగా, తక్కినవి ఆకర్షించవు వీళ్ళను. ఇక మూడో వర్గం వాళ్ళు, చదువులు పూర్తి చేసుకొని, చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకొనే అవివాహితులైన యువతీ యువకులు. ఆఫీసుల్లో పని చేసుకొనే ఈ వర్గానికి, మనోల్లాసం కావాలి. ఇవాల్టి సాంఘిక వ్యవస్థనుబట్టి, మగవాడు, వీధుల్లో తిరగటమో, లైబ్రరీకి పోవటమో, పార్కులో పోయి కూచోవటమో చేస్తాడుగాని బరువు బాధ్యతలు, సాంఘికమైన కట్టుబాట్లు, విధిగా ఇంటి పనిలో సాయం చేయవలసి ఉండటం మొదలైన వాటివల్ల, చదువుకొనే వాళ్ళైనా, ఉద్యోగాలు చేసుకొనే వాళ్ళైనా, అవివాహితలైన తరుణ వయస్కురాండ్రైన ఆడపిల్లలు, మానసికోల్లాసం కోసం పత్రికలను పుస్తకాలను ఆశ్రయించకతప్పదు. ఇక, పెద్ద దిక్కులుగా చెలామణి అయ్యే, పెద్దలు, స్త్రీ పురుషులుకూడా, అందునా ఎక్కువగా స్త్రీలే, వార పత్రికలు చదవటం చూడవచ్చు. ఎంత మందో బామ్మగార్లు వారపత్రికల్లోని సీరియల్స్‌ను తమకంతో చదువుతూ ఉంటారు. వీళ్ళకు కూడా, సినిమాలలాగానే, పుస్తకాలు వినోద ప్రధానముగా ఉండటమే ఇష్టం.

వినోదమంటే హాస్యంకాదు. సినిమాల్లో కూడా కేవలం హాస్యంమాత్రమే ఉంటున్నది. అవాస్తవికమైన వినోదమూ, నాటకీయ ధోరణి, నమ్మలేని సంఘటనలూ, కృతకమైన సంభాషణలూ, ఉంటున్నాయా లేదా అట్లానే చాలా నవలల్లో. నాటకీయమైన సన్నివేశాలే ఇప్పుడెక్కువగా కనబడుతున్నాయి. అటువంటివాటినే పాఠకులు ఇప్పుడెక్కువగా చదువుతున్నారని అనుకోవలసి వస్తుంది. క్రితం సంవత్సరం ఒక సుప్రసిద్ధ వారపత్రిక నిర్వహించినపోటీలో ప్రథమ బహుమతి పొందిన 'రంగులవల' అన్న నవల, ఇప్పుడు అధిక సంఖ్యాకంగా వెలువడుతున్న నవలల వంటిది కాదు. విలక్షణమైందే. ఉద్యోగం చేసుకుంటున్న, మధ్యతరగతి కుటుంబీకురాలికి కాపురంలో అడుగు పెట్టీపెట్టక ముందునుంచే, ఎదుర్కోవలసిన బరువు బాధ్యతలు కనీసావసరాలు, కనీసమైన విశ్రాంతి నోచుకోని పరిస్థితులు కల్పించే మానసిక సంఘర్షణా, రచయిత నేర్పుతోనే చిత్రించారు. మధ్యతరగతి కుటుంబంలో, పెద్దవాళ్ళైన కుటుంబసభ్యులు ఇంటి కోడలికి బరువ కొడుక్కు బాధ్యత ఎక్కువేనేమో కావచ్చుకానీ, వాళ్ళ ఆలనాపాలనా, సౌకర్యాలూ, తిండితిప్పలూ, అన్నీ చూసుకో వలసింది కోడలే. ఇక అమ్మాయి పగలల్లా ఉద్యోగంకూడా చేయాల్సివస్తే, అదిన్నీ సంక్షుభితంగా ఉండేనగరంలో అయితే, రోజూతాను చూస్తున్న రంగురంగుల వింత ప్రపంచంలో, కొందరనుభవిస్తున్న సుఖసంతోషాలను చూస్తుంటే, తనఒక్కతెదేనా బాధ్యత, తాను సుఖంగా ఎందుకు బతకలేక పోతున్నాను? ఈ బరువు బాధ్యతలేమిటని మనసు తిరగబడకపోదు. ఒక పక్క బాధ్యత తెలీని వయస్సుతో, మనస్సుతో ప్రపంచంలోని మంచిచెడలను ఆకళింపు చేసుకోలేని ఆవేశ తీవ్రతతో మనసుని గాయపరచిన చెల్లెలూ, అతృప్త్యమైన కోర్కెలతో కాపీనంతో మనసు సరిపెట్టుకోలేని, శరీరం చెప్పుచేతల్లోలేని, వృద్ధులైనఅత్త మామలు, స్వార్థపరుడైన లేదా తన మనసులోనినిబ్బరం జారిపోయినప్పుడల్లా అనిపించేభర్తా ఎక్కడా ఆశ్వాసం కనబడని మనసూ, కలబోస్తే పాపం తులసి సంసారం వస్తుంది. అయితే ఈ నవల, పై చెప్పిన పాఠకులని అలరించినట్లు లేదని పత్రికల్లో పడ్డ ఉత్తరాలు, (సంఖ్య తక్కువ) ప్రచురణకర్తల నిరాదరణం నిరూపిస్తున్నాయి. ఇది మనసుకి కష్టం కలిగించే పరిస్థితే. ఈ నవలలో కూడా లోపాలుండవచ్చు. అయితే వాస్తవికదృక్పథంలో ఏ నవలనూ తీసిపోదు. మరి ఎందుకు పేరు ప్రఖ్యాతులురాలేదు. తెలియకుండా ఉంది. తెలుస్తూనూ ఉంది.

మూడు నాలుగేళ్ళక్రితం 'మైనా' అన్న మంచి నవల వచ్చింది. అయితే ఇది ఏ పత్రికలోనూ సీరియల్‌గా రాలేదు అందువల్ల సామాన్య పాఠకులకు చాలా మందికి దీన్ని గురించి తెలీదు. ఈ ఏడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ. ఉత్తమ రచన కిచ్చే బహుమతి ఇచ్చి సబబైనపని చేసింది. రచయిత, కవీ, చిత్రకారుడూ కూడా కాబట్టి, శైలీ, సంభాషణలూ, ఇతివృత్తమూ, శిల్పం దృష్ట్యా ఉత్తమంగా ఉన్నాయి. పెద్ద నవల కాబట్టి పాత్రలూ, మానసిక సంఘర్షణలు, రంగభూమీ, విస్తృతంగా ఉన్నాయి ఒక మంచి నవల చదివిన తృప్తికలుగుతుంది, ఈ నవల చదివినప్పుడు.

ఇటీవలి తెలుగు నవలల్లో, విలక్షణమైన ధోరణి ఒకటి కనబడుతున్నది. అది పల్లెటూళ్ళను ప్రభావితం చేస్తున్న నగర జీవన వ్యామోహమూ, ఆవశ్యకతా. శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి గారు వారధి అన్న మంచి నవలను దీన్ని ఇతివృత్తంగారచించారు. ఆధునికమైన సాంఘిక వ్యవస్థలో ఏ కొంచెంకల కుటుంబాలైనా నిలువగల కుటుంబమైనా, నగరాలు చేరుతున్నాయి. పల్లెటూళ్ళు విడిచి చదువులకోసం లేదా ఉద్యోగాలకోసం. బ్రతుకు తెరువుకు కూడా నగరమే ఆశ్రయం. పల్లె కన్నా నగర జీవితపుప్రభావం, ఆధునికమైన సాంఘిక వ్యవస్థ, పాతకాలపు సంప్రదాయాలను నమ్మిన మనుషులమీద, పాత వ్యవస్థమీద పాత ఆలోచనలపై ఎంతగాపడుతున్నదో, దానిమూలంగా ఎటువంటి సంఘర్షణలకు అవకాశమున్నదో, కందచక్కెరలాంటికమ్మ తెలుగున, తాళ్ళూరి నాగేశ్వరరావుగారు కొత్తఇల్లులో చూపటానికి ప్రయత్నించారు. నేటి రాజకీయాలు, విద్యాబుద్ధులు ఘనంగా నేర్చినవాళ్ళు, నేర్చని వాళ్ళకు నేర్పుతున్న నీతులు, చూపుతున్న మార్గమూ, తద్వారా పాత కొత్తల సంఘర్షణా, ఈ నవల్లో చిత్రించారు. తెలుగు భాషలో సామెతల్లోని స్ఫూర్తీ, అందచందాలూ, కళ్ళబడటం

ఈ నవల ప్రత్యేకత. పల్లెటూళ్ళలో మారిపోతున్న సాంఘిక జీవనాన్ని గూర్చి కూడా, ముఖ్యంగా రాజకీయాల ప్రభావాన్ని గురించి కూడా కొంతమంది నవలలు వ్రాస్తున్నారు. ఇది మెచ్చదగిందే. ఇటీవల తెలుగు నవలల్లో మంచినవలలు వ్రాసిన స్థానం పోలా ప్రగడ సత్యనారాయణమూర్తిగారిది. ఈయన దీపశిఖ చాలా మంచినవల. కందుకూరి వీరేశలింగం పంతులుగారినాటి సాంఘిక రంగాన్ని తీసుకొని, కమనీయంగా కథ చెప్పారు దీపశిఖలో. సాంఘిక ప్రయోజనాన్నీ, సాహిత్య ప్రయోజనాన్నీ, సమన్వయంచేసి నేటి సాహిత్యపు విలువల్ని సంతరించుకొన్న నవలఇది. సంఘం పంచాయతీ రాజకీయాల, పల్లెటూళ్ళ వ్యవస్థమీదవేసిన మంచిచురక. అవసరాల రామకృష్ణారావుగారు వ్రాసిన అది ప్రశ్న–ఇది జవాబు అన్న నవల మనిషి కర్తవ్యాన్నీ, మనసులోని మంచిచెడ్డల సంఘర్షణను, హృదయంలోజరిగే యుద్ధాలలో మంచిచెడ్డల భావాల సైనికుల కవాతులను, కాల్పులను, సందేశాత్మకంగా వినిపించేనవల. మధురాంతకం రాజారాంగారు, త్రిశంకుడి స్వర్గం అన్ననవలను ఇటీవలప్రకటించారు ఈ నవల కూడా నేటి సాంఘిక వ్యవస్థలో మారుతున్న విలువలను, వాటి మంచిచెడ్డలను ధ్వనింపజేసే సాంకేతిక రూపమే. ఎందుకో పాఠకులను అంతబాగా ఆకర్షించినట్లు తోచదు. గాంభీర్యమూ, సందేశమూ, నేటి పాఠకులలో చాలా మందికి పడదు. మహిళలెంతమందో రచనావ్యాసంగంలో మగవాళ్ళను మించిపోయినారు ఇతివృత్తమూ, శిల్పమూ, సందేశం కూడా దృష్టిలో పెట్టుకొని రచించేవాళ్ళు ఎక్కువమందిలేరు వీళ్ళలో కాలక్షేపానికి (పాఠకులకూ, తమకూ కూడా) రాస్తున్న వాళుకూడా కొందరు లేకపోలేదు, శ్రీమతులు ముప్పాళ్ళ రంగనాయకమ్మ, ఆనందారామం, యద్దనపూడి సులోచనారాణి వాసిరెడ్డి సీతాదేవి, లత, మొదలైనవాళ్ళు కొన్ని మంచినవలలు వ్రాశారు. ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి నవలల్లో అతివాద ధోరణి ఎక్కువ. ఆవేశంతో రచనచేస్తారు. కాబట్టి అందచందాలుండకపోవు రచనలో. శ్రీమతి మాలతీ చందూర్ వ్రాసిన మేఘాల మేలిముసుగు నాకు నచ్చినది. ఆపేరు ఎందుకు పెట్టారో మాత్రం పుస్తకం మీది వ్యాఖ్యానంవల్ల తెలుసుకోవలసిందే. అయితే కాల్పనికత వాస్తవికతను మించిపోయిందన్న విమర్శ వినపడకపోలేదు. ఈ నవలనుగూర్చి. అయితే సహజ సౌందర్యం ఉన్నది. ఈనవలల్లో శ్రీమతి ఆనందారామంగారు రాసిన నవలలు పాఠకులను ఇటీవల ఎక్కువ ఆకర్షిస్తున్నాయి. రచనలో ఉద్వేగమైన శైలీ, కల్పనా, ముఖ్యమైన ఆకర్షణాలు ఈమె రచనలో.

ఇటీవలి తెలుగు నవలల్లో విలక్షణమైన ఇంకో ధోరణిని గమనించాలి. తెలుగు భాషలోని మాండలిక భేదాలనుచూపేభాషకు సాహిత్య గౌరవాన్ని కల్పించడమే ఆధోరణి. ఇందుకుగాను శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు చాలాఅభినందనీయుడు. తెలంగాణా ప్రాంతంలోని ఒక సాలెకుటుంబానికి చెందిన ఇతివృత్తంతో కరుణరసాత్మకంగా కమనీయంగా చెప్పారీయన 'ముత్యాల పందిరి' నవలను. ఈయనదృష్టి చాలా నిశితమైంది. భాషపట్టిస్తుందని భయపడుతారుగాని, కొసకంటా చదివితే ఇది ఎంతమంచి నవలో తెలుస్తుంది. వాళ్ళ ఆచార వ్యవహారాలను, మనుగడని, మమతలను, మంచిచెడ్డలను, సుఖదుఃఖాలను ఎంతో చక్కగా కళగా మలిచారు. రచయిత ఈ నవలలో. ఈ నవల చాలా మంచి నవల. హృదయాన్ని కదిలిస్తుంది. అయితే చివరకు సినిమాధోరణీ కొంత చోటుచేసుకుంది, లక్క, రాములు అనే పాత్రలు రైలునుంచి దూకిపోవటం సన్నివేశంలో, ఏమైనా ఒక వృత్తి వారి జీవితాన్ని ప్రత్యంశ సహితంగా ఒక మాండలికంలో రూపొందించటం విశిష్టమైన ప్రత్యేకత.

ఇట్లానే వైద్యవృత్తిని భూమికగా చేసుకొని, వైద్యవృత్తిలోని ఆశయాలను, సాధక, బాధకాలను, మంచిచెడ్డలను శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారు హౌస్‌సర్జన్ నవలలో చూపించారు. ఈ నవలకూడా తెలుగు నవలలో విశిష్టమైనది. మాననీయమైన బలహీనలతలను, సంస్కారాలను, కరుణను కన్నీళ్ళను. సహజంగా చిత్రించారు కాబట్టే ఇది మంచినవలయింది.

బలివాడ కాంతారావుగారు, గొల్లపూడి మారుతీరావుగారు, హితశ్రీ, ఇచ్ఛాపురపు జగన్నాధరావుగారి లాంటి చేయి తిరిగిన రచయితలు ఇటీవల నవలలు ప్రకటించారు. మహీధరరామమోహనరావుగారు, పాలగుమ్మి పద్మరాజుగారు, కొడవటిగంటి కుటుంబరావుగారిలాంటి క్రిందటితరం రచయితలూ ఇప్పుడు వ్రాస్తున్నారు.

అయినా ప్రేమచంద్, శరత్‌బాబు, టాగోర్ లాంటి రచయిత నెవరినైనా తెలుగులో ఎన్నమంచే–ఎన్నతరమా? నాకెన్నతరమా? అని ముదలకించాల్సిందే–

ఇటీవల తెలుగు నవలకు గొప్ప ప్రోత్సాహాన్ని, ప్రాచుర్యాన్ని కల్పించిన ప్రచురణ కర్తలు ఎమెస్కో పాకెట్ బుక్స్‌వారు. వందకుపైగా పాకెట్ పుస్తకాలను ప్రచురించి తెలుగు రచయితలకెంతో ఆత్మవిశ్వాసాన్ని, ప్రోత్సాహాన్ని కల్పించారు. వాళ్ళు తెలుగు దేశానికి మహోపకారం చేస్తున్నారు. చక్కని నవల వ్రాస్తేచాలు, ప్రచురించుకోలేమన్న బాధ తప్పింది వారివల్ల. ఇంకా మంచి తెలుగు నవలలు ముందువస్తాయనే ఆశతోనూ, నమ్మకంతోనూ, నవలాప్రియులమంతా వేచిఉందాం.

—:o:—



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, మార్చి 18న హైదరాబాదులోని జూబిలీహాల్‌లో జరిగిన 'వెనుకబడిన ప్రాంతాల ప్రణాళిక, అభివృద్ధి-రాయలసీమ ప్రాంతం పరిశీలన' చర్చాగోష్ఠికి అధ్యక్షత వహించారు.



ఆస్ట్రేలియా హైకమీషనర్ శ్రీ ఆర్. ఎస్. లాసీ, 19న హైదరాబాదులో ముఖ్యమంత్రిని కలిశారు. ఆర్థిక మంత్రిని, మధ్యతరహా నీటిపారుదల శాఖా మంత్రిని కూడా చిత్రంలో చూడవచ్చు.

# నగరంలో



హైదరా దులో ఫిబ్రవరి 28న జిల్లాపరిషత్తు ఆధ్వర్యాన వర్ణాంతర వివాహం జరిగింది. అధికారులు, తదితరులు యీ ఉత్సవంలో పాల్గొన్నారు.



విద్యాశాఖా మంత్రి శ్రీ పి.వి. నరసింహారావు మార్చి 11న హైదరాబాదులో ఆంధ్రసారస్వత పరిషత్తులో జరిగిన జిల్లా గ్రంథాలయ సంస్థల అధ్యక్షులు కార్యదర్శుల 4వ సమావేశంలో ప్రసంగించారు.



సమాచార, పౌరసంబంధశాఖా మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు, శ్రీ నుదిగొండ వీరభద్రమూర్తి రచించిన 'జయంతి' కావ్యసంపుటిని ఆవిష్కరించారు.



మహిళా సంక్షేమ, యాత్రికశాఖామంత్రి శ్రీమతి రోడామిస్త్రీ, మార్చి 8వ తేదీన హైదరాబాదులోని రిడ్జ్ హోటల్‌లో అమెరికా, కెనడాలకు చెందిన వైద్యుల బృందాన్ని కలిశారు.

# నగరంలో



రష్యా రక్షణశాఖా మంత్రి కమాండరన్ చీఫ్ ఎయిర్‌మార్షల్ పి. ఎస్. కౌటకోవ్, హైదరాబాదు పర్యటన సందర్భంలో ఫిబ్రవరి 19న సాలార్‌జంగ్ మూజియం దర్శించారు.



మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వి. పి. నాయక్, మార్చి 15న ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ప్రసంగించారు. విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులైన ఆంధ్రప్రదేశ్ గవర్నరు యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

# విశ్వవిద్యాలయాల్లో వ్యావహారిక భాష



—డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ

వ్యవహార భాష, వ్యవహారికం, శిష్ట వ్యవహారికం, మొదలైన పేర్లతో ఇప్పుడు మనం పిలిచే భాష కేవలం దైనందిన వ్యవహారంలో ఉన్న భాషాభేదం మాత్రమే కాదు. ఇరవయ్యో శతాబ్దం తొలిరోజుల్లో భాషా విషయకంగా వచ్చిన వివాదం వల్ల 'గ్రాంథికం, వ్యవహారికం' అని తెలుగు భాషలో రెండు ప్రధాన భేదాలున్నట్లు వ్యవహరించడం జరిగింది. అప్పటి పరిస్థితివేరు. ఏ ఒకటి రెండింటిలోనో తప్ప గ్రంథాలన్నింటిలోను ప్రాచీన కావ్య భాషనే వాడేవారు. దాన్నే గ్రాంథికమన్నారు. చదువుకున్న వాళ్లు కావ్యాలను విమర్శించేటప్పుడు, సభల్లో ప్రసంగించేటప్పుడు పాఠం చెప్పేటప్పుడు వాడిన భాషాభేదాన్ని వ్యావహారికమన్నారు. 1910 నుంచి వీటిలో ఆధునికావసరాలకు పనికి వచ్చేది ఏదన్న వివాదం జరుగుతూనేఉంది. అయితే ఇప్పటికి ఏవోకొన్ని పద్య కావ్యాల్లోను, కొందరు సనాతన పండితుల రచనల్లోను, పాఠ్య గ్రంథాల్లోను, తప్పతెలుగు సాహిత్యంలోని అనేక ప్రక్రియల్లో—ప్రముఖంగా వచనరచనల్లో—వ్యావహారికం స్థిరపడిపోయింది. అందు వల్ల 'వ్యవహార భాష, వ్యావహారికం' అనే మాటలకు ఇప్పుడు ఆ వ్యాప్తి వచ్చింది. ఈ భాషా రూపానికి సరైనపేరు "ఆధునిక ప్రమాణిక భాష." పంధొమ్మిదో శతాబ్దినాటి భాషా శాస్త్రజ్ఞులు కూడా ఈ రూపాన్ని ఇదే పేరుతోనే పిలిచారు కొందరు. కొందరు సనాతన పండితులు కాదన్నా భాషాశాస్త్ర దృష్టితో దీని పేరిదే.

ఈ వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయాల పఠన పాఠనాల్లో ప్రవేశపెట్టే ప్రయత్నం జరిగేముందు ఉన్నత పాఠశాలల్లో ప్రవేశపెట్టాలనే ప్రయత్నం 1911 లోనే జరిగింది. గిడుగు రామ్మూర్తిగారు, గురజాడ అప్పారావుగారు అప్పటికి మద్రాసు విశ్వవిద్యాలయం సెనేటులో సభ్యులు. S.S.L.C. బోర్డులోకూడా వారికి స్థానముండేది. షేక్స్పియర్ నాటి భాషలో ఇప్పుడు ఆంగ్ల విద్యాలయాల విద్యార్థులు రాయటంలేదు కాబట్టి నన్నయనాటి తెలుగులో తెలిసీ తెలియని విద్యార్థులు రాయాలన్న శాసనాన్ని తొలగించాలని వారిద్దరూ అధికారులకు నచ్చజెప్ప గలిగారు. ఫలితంగా ఒకటి రెండు వ్యావహారిక రచనలను పాఠ్య గ్రంథాలు చేయించి పరీక్షల్లో విద్యార్థులు ఆధునిక భాషలో రాయవచ్చునని బోర్డువారు నిర్ణయించారు. దాంతో సనాతన పండితులు జయంతి రామయ్యగారి నాయకత్వాన సభలూ, సమావేశాలు జరిపి భాష మైలపడిపోతుందని, ఉత్తర్వు రద్దుచేయమని, ఆందోళన సాగించారు. వాదోపవాదాలు జరిగాయి. కాని గ్రాంథికవాదుల్లో చాలామంది పెద్ద ప్రభుత్వోద్యోగులు, రాజకీయ ప్రాబల్యమున్నవాళ్లు అయినందున బోర్డువారు 1913లో తమ ఉత్తరువు ఉపసంహరించుకొనేటట్లు చేయగలిగారు .అప్పటికి వ్యావహారిక రచనలు చేసేవారి సంఖ్య అత్యల్పంగా ఉండేది. వ్యావహారికాన్ని ఉపయోగించటం మూన్నాళ్ల ముచ్చటయింది.

1914లో మద్రాసు విశ్వవిద్యాలయం కాంపోజిషన్ కమిటీని నియమించింది. ఇంటర్మీడియట్ పరీక్షలకు పాఠ్య గ్రంథాలను నిర్ణయించటం కమిటీ వారి బాధ్యత. అందులో మొదట గ్రాంథిక వ్యావహారికవాదులను సమ సంఖ్యలో వేశారు. తటస్థులిద్దరు ఉండేవారు. మధ్యలో మరి యిద్దరు గ్రాంథికవాదులు సభ్యులు కావటంతో కథ అడ్డంతిరిగింది. 'సరళ గ్రాంథిక' మనే కృత్రిమ భాషా రూపాన్ని సృష్టించి దాన్ని మాత్రమే పఠన పాఠనాల్లో ఉంచాలని నిర్ణయించారు. ఇప్పటి వరకూ అదేస్థితి. అయితే సలక్షణమైన

గ్రాంథికంలో రాయగలిగిన ఉపాధ్యాయులుగాని, విద్యార్థులుగాని చాలా కొద్ది మంది కావటంతో, భాషా సాహిత్యాలనే అభిమానంగా చదివే వాళ్ళను గూడా భాషా దృష్టితో పరీక్షించటం, పరీక్షించ గలగటం ఏనాడో అసాధ్యమైపోయింది. పేరుకు గ్రాంథికం ఉన్నా రాసేవాళ్లు చాలా తక్కువై పోయారు.

1911లో వ్యావహారికాన్ని వ్యతిరేకించటానికి స్థాపించిన 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' 1924లో వ్యావహారిక బహిష్కారాన్ని రద్దుచేయవలసి వచ్చింది. 1936లో 'నవ్య సాహిత్య పరిషత్తు' ఏర్పడగానే వేల సంఖ్యలో వ్యావహారిక రచనలు రావటం మొదలు పెట్టాయి. 1937లో 'జనవాణి' దిన పత్రికకు సంపాదకులైన తాపీ ధర్మారావుగారు పత్రికల్లో వ్యావహారికాన్ని ప్రవేశపెట్టారు. బహు జనాకర్షణగల పత్రికలతోబాటు సినిమాలలో, నాటకాల్లో, రేడియోల్లో, ప్రభుత్వ ప్రకటనల్లో, పెద్ద ప్రయత్నం లేకుండానే వ్యావహారికం ప్రవేశించింది. ఆధునిక విజ్ఞాన శాస్త్ర గ్రంథాల్లో నూటికి తొంభైకి పైగా ఈ భాషలోనే వెలువడుతున్నవి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ పరిస్థితి మూడుపూలు ఆరుకాయలుగా వర్ధిల్లటం మొదలుపెట్టింది. నిర్బంధ విద్యావిధానం ప్రస్తుత ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానాల్లో ప్రధానమైనది. అందరికీ చదువు అందుబాటులోకి రావటం, శాస్త్రీయ దృక్పథం మీద గౌరవాభిమానాలు ప్రజల్లో కలగటం, విద్యావంతులు, విద్యాసంస్థల సంఖ్య పెరగటం, ఈ వాదానికి ఆదరం కలగటానికి ప్రధాన కారణాలు. లోకమెంత మారినా, సాధారణంగా సనాతన దృష్టితో ఉండే విశ్వవిద్యాలయాలు పట్టించుకోలేదు.

ఆంధ్రప్రదేశ్ అవతరణతో తెలుగు రానివారికి తెలుగు చెప్పవలసిన అవసరం కలిగింది. ప్రభుత్వం తెలుగు మాతృభాష కానివారికి చెప్పే తెలుగు పాఠ్య ప్రణాళికను నిర్ణయించటానికి నిపుణుల సంఘాన్ని వేసింది. ఆసంఘంవారు వ్యావహారికం నేర్పితేనే మంచిదన్నారు. ఆ సందర్భంలో వచ్చిన వాదోపవాదాలను పరిష్కరించటానికి తిరుపతిలో కవి పండిత సమావేశాన్ని 1965లో జరిపారు. శాస్త్ర గ్రంథాలలో, తెలుగు మాతృభాషకాని వారి పాఠ్య గ్రంథాల్లో శిష్టవ్యావహారికమే వాడాలని వారు నిర్ణయించారు. వివరాలు చెప్పమని డా. పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ప్రభుత్వంవారు ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఆ కమిటీ నిర్ణయాలను చిన్న తరగతుల పాఠ్య గ్రంథాల్లో అమలు జరిపారు. 1966లో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం (1966లో తొమ్మిదో చట్టం) ప్యాసయింది. ఫలితంగా తెలుగు ఈ రాష్ట్రంలో అధికార భాష అయింది. అధికార భాషగా తెలుగును దిద్ది తీర్చే విధానాలను వివరించడానికి జె.పి.ఎల్. గ్విన్ గారి అధ్యక్షతన ప్రభుత్వం మరో సంఘాన్ని నియమించింది. ప్రభుత్వానికి సంబంధించిన అన్ని వ్యవహారాల్లోను లక్ష్మీకాంతం కమిటీ వారు నిర్దేశించిన శిష్టవ్యవహార భాషనే ఉపయోగించాలని, చట్టాలనుంచి ప్రకటనల వరకూ ఉన్న అన్ని ఇంగ్లీషు గ్రంథాలనూ అవసరమైతే అనువదించడానికీ, ఇతర విషయాల్లో కూడా ప్రభుత్వానికి తెలుగు భాషను అభివృద్ధి పరచటంలో తోడ్పడటానికి ఒక సంస్థను స్థాపించమని, గ్విన్ కమిటీ సిఫారసు చేసింది.

ప్రభుత్వం ఆ సిఫారసును ఆమోదించి 1968 లో 'తెలుగు అకాడెమీ' ని స్థాపించటమే గాక 1969 నుంచి ఇంటర్మీడియట్ లో బోధనా భాషగా కూడా తెలుగే ఉండాలని నిశ్చయించింది. విశ్వవిద్యాలయాలు కూడా అంగీకరించిన మీదట 'ఇంటర్మీడియట్ బోర్డును' ఏర్పాటుచేసి, పాఠ్య గ్రంథాలను తయారుచేసే బాధ్యతను అకాడమికే అప్పచెప్పటం జరిగింది. కొన్ని మార్పులతో లక్ష్మీకాంతం కమిటీ సిఫారసు ప్రకారం శిష్టవ్యవహారంలోనే పాఠ్య గ్రంథాలు వెలువడ్డాయి. అంటే ఇప్పటికి విశ్వవిద్యాలయ స్థాయిలోనే వ్యావహారికానికి ప్రయోజనం కలిగిందని చెప్పాలి.

రమారమి 60 సంవత్సరాలుగా బ్రహ్మాండమైన ఉద్యమం జరిపి ఈ ఆధునిక ప్రమాణ భాషను బోధనా భాషగా చేయగలిగారంటే ఒక సందేహం వస్తుంది. ఎందుకింత ప్రయాస పడవలసి వచ్చింది? ఇందుకు మూలకారణం మానవుడికి సహజంగా ఉండే సనాతన దృష్టి రెండోది మన పూర్వకాలపు విద్యావిధానం. 1820 లో 'ఉపయుక్త గ్రంథకరణ సభ' ను ఏర్పాటుచేసి బ్రిటిష్ వారు పాఠ్య గ్రంథాలను రాయించినప్పుడు వ్యావహారిక గ్రంథాలనే పండితులు రాశారు. గ్రాంథిక వాదానికి మూలవిరాట్టుగా ఉన్న చిన్నయ సూరిగారు నడిపిన పత్రికలోను, సంస్కరించిన వచన గ్రంథాల్లోనూ, మొదట వ్యావహారికమే ఉండేది. 1520 నాటి 'రాయవాచకం' నుంచి ఇదే సంప్రదాయంగా వస్తుండేది. ప్రాచీన విద్యాపద్ధతిని గురుకుల విద్యను తొలగించి ఆధునిక విషయాలను కులమత భేదాలతో నిమిత్తంలేకుండా పాఠశాలల్లో చెప్పించిన నవ దృష్టి ఆంగ్లేయులే చూపారు. ప్రజాస్వామ్య పరిపాలనా పద్ధతిని, ఆధునిక విద్యాబోధన పద్ధతులను, వాళ్ళే ప్రవేశపెట్టారు. కొద్ది మందికి పరిమితంగా ఉండే విద్య అందరికీ అందుబాటులోకి వస్తే ఆ కొందరి ఆధిక్యం తగ్గిపోవటం సహజమే. వాళ్ళ దృష్టితో చూస్తే ఇది భరించరాని పరిస్థితి, అందువల్ల కులమత రాజకీయాది సమస్త శక్తులనూ వినియోగించి అడ్డుపడ్డారు. ఇప్పటికీ విశ్వవిద్యాలయాల్లో చాలావరకు అధికార పత్రాల్లో ఈ పరిస్థితే ఉన్నా ఆచరణలో తొలిగిపోయింది. అధ్యాపకుల్లోనే గ్రాంథిక రచన చేసేవారి సంఖ్య పూర్తిగా సన్నగిల్లింది. శ్రీ వేంకటేశ్వర వి. వి. విద్యాలయం లో Ph.D. పట్టానికి రాసే వ్యాసంలో వ్యావహారికాన్ని అంగీకరించారు—1969లో. పరిపాలనా భాషగా, శాస్త్రబోధన భాషగా, ప్రాచీన భాషారూపం పనికిరాదనేది శాస్త్రదృష్టి—అసాధ్యమనేది లోకదృష్టి. ఈ రెండు ఒక్కటైనప్పుడు ప్రపంచంలోని ఏ శక్తి కాలచక్రాన్ని వెనక్కుతిప్పి ప్రతిఘటించలేదు. తెలుగులో ఇప్పుడున్న ప్రచారసాధనాలన్నీ వ్యావహారికాన్ని ఉపయోగిస్తుండగా, ఒక్క పాఠ్య గ్రంథాల్లో గ్రాంథికాన్ని ప్రయోగించినా ఫలితం ఉండదుగదా? అందువల్ల ప్రభుత్వం తలపెట్టిన ప్రజాహిత చర్యల్లో ఇది సర్వోత్తమమయింది.

ఆధునిక ప్రమాణభాషే పనికివస్తుందనటానికి కొన్ని ముఖ్య కారణాలు—శాస్త్రీయమైనవి—ఉన్నాయి. శాస్త్రవిజ్ఞానాన్ని తెలుగులో అందించేటప్పుడు అనేకంగా అన్య దేశాలను పరిభాషా రూపంలో గ్రహించవలసి ఉంది. కావ్యభాషా లక్షణం ఇందుకు సరిపోదు.

లక్షలమంటి ఉద్యోగులు అనుక్షణం అధికార భాషను ఉపయోగించేటప్పుడు తమ నిత్యవ్యవహారంలో ఉన్న మాటలనే ఉపయోగించగలుగుతారు గాని కావ్యభాషను అభ్యసించి ఆ పద్ధతిలో పూర్వ వ్యాకరణాల ప్రకారం వ్యవహరించలేరు. ప్రచార సాధనాలన్నింటిలోనూ ఉన్న భాషారూపం వ్యావహారికమేగాని వేరుకాదు. సంఘజీవి అయిన మానవుడు వీటి ప్రభావానికి దూరంగా మడిగట్టుకొని ఉండలేడు. తెలుగు సాహిత్యంలోనే 14 శతాబ్ది నుంచి అన్యదేశ్యాలూ వ్యావహారిక రూపాలూ ప్రవేశించాయి. 'గద్య చింతామణి, బాలకవి శరణ్యం' వంటి పుస్తకాల్లో ఈ సంప్రదాయం ఎలా ఉండేదో, ఎంత బలవంతమైనదో, నిరూపించారు. పైగా అందరూ కావ్యభాషనే నేర్చుకోవాలని నిర్బంధించటం అసాధ్యమూ, అసమంజసమూకూడా. పూర్వపు చదువంతా కావ్యవ్యాకరణాదులను నేర్చుకోవటం మాత్రానికి పరిమితంగా ఉండగా, ఇప్పుడు సంవత్సరానికి ఒక కొత్త శాస్త్రం వెలువడుతూ నవీనతకు చిహ్నంగా శాస్త్రవిజ్ఞానం ఉన్నది. అందువల్ల నూతన శాస్త్రాలను నూతన భాషలోనే చదవటం, రాయటం, మాట్లాడటం అవశ్యకర్తవ్యమౌతున్నది.

కొందరు విద్వాంసులు వ్యావహారిక రచనలవల్ల పూర్వ సాహిత్యాన్ని చదవటం తగ్గుతుందని, తెలుగు పండితులకు ఉపాధి పోతుందని, ఇటీవల పత్రికల్లో వాదిస్తున్నారు. అది పొరపాటు, ప్రమాదకరం కూడా. షేక్స్పియర్ చదివేవాళ్లు అయన భాషలో కాక ఇప్పటి ఆంగ్ల భాషలోనే వ్యవహరిస్తున్నారు. అంతమాత్రాన ఆ మహాకవి రచనలను చదివేవాళ్ళ సంఖ్య తగ్గలేదు. తెలుగులోనూ అంతే. పూర్వ సాహిత్యాన్ని సంప్రదాయన్ని వివరించి చెప్పగల సపుణుల అవసరం ఎప్పుడూ ఉంటుంది. అంటే తెలుగు పండితుల ఉపాధి పోతుందనుకోవటం భ్రమ మాత్రమే. ఇలాంటి అపోహలు పూర్తిగా తొలిగితే తప్ప విశ్వవిద్యాలయాల్లో అన్ని స్థాయిల్లోనూ ఆధునికప్రామాణిక భాషకు స్థానం కలగదు. అయితే ఆ పరిస్థితి ఎంతో దూరంలో లేదని మాత్రం చెప్పవచ్చు. ✦

# దిగిరండి దిగిరండి దేవతల్లారా!





ఆకుపచ్చని చేలు ఆమనివరాలు
శ్రీకరమ్మగు వనశ్రీ కాకరాలు ;
చెఱకుదోటలు చెంతచెలువౌ పథాలు
అఖిత నెయ్యెదకాననౌ జనపదాలు;

నెత్తమ్ములన్నింట నెలవుకొని పొదలి
హత్తుకొని యెదుగు తేయాకుతోంపాలు ;
ఈడులేకున్నట్టి ఇంపౌవనాలు
చూడ చౌలూరించు సుమధుర ఫలాలు;

అరటిమ్రాకులు, బీళ్లు. అందాకుమళ్లు
అరిగాపు దోటలు అందాలపీళ్లు
మబ్బు కన్నెలగూడి మంతనాలాడి
తబ్బిబ్బుచెందు హింతాల వృక్షాలు
ఒడలుపూనక మంది జడలు విరబోసి
జరిగట్టి తూగాడు చౌకువనాలు.
గిరి సానువుల బలుపుగిలుచాడి పెరిగి
కెరలాడు సిరి పీలగిరి పాదపాలు.

కెలన నోయన బల్కుగిరి గహ్వరాలు
చెలువుగూర్చెడి చిత్రచిత్ర శిఖరాలు
వాలివంకలు వోవు వన విఝ్ఝరాలు
శైలప్రపాతాల సలిల పాతాలు.
మేరమీరని అకూపార తీరాలు
పారాల సర్వతో భద్రహర్మ్యాలు.
దిగిరండి దిగిరండి దేవతల్లారా
దిగివచ్చి ఈ దీవి తిలకించిపోరా.
కనువిందుగొల్పు చక్కని పగిసరాలు
అనిమిషత్వముపొందనావాహనాలు.

దిగిరండి దిగిరండి దేవతల్లారా
దిగివచ్చి ఈ దీవి తిలకించిపోరా.
దిగిరండి దిగిరండి దేవతల్లారా
దిగివచ్చితిర దీని దీవించిపోరా.

ఏటికీ చాటింపు ఇటువచ్చినారా
మాటవిని మీరొక్కమారు మనసారా
ఇలనుండి ఇకపైకి ఎగసిపోగలరా
తిలకించి తిలకించి పులకించిపోరా.
తనివిదీరగ దీని దర్శించినారా
మనసు పరవశమంది మైమరచిపోరా.

మీ లోకమునకన్న మిన్నగానున్న
ఈ లోకమే నాక మిది సత్వమెన్న
తూకాన నాకమే తూలిపైకెగసి
లోకాల నెటకాన రాకనేపోయే.
మోరీసు మాత్రమే మొనసితూకాన
భారమై ధరణిపై ప్రత్యక్షమాయె.
అందుకే మీలోక మదృశ్యమాయె
అందుకే ఈ నాక మవతారమాయె.

ఎక్కడో మీలోక మెగసి పైబడగ
చెక్కలు ముక్కలై చెదరిపోబోలు
అందులోపలి యంశమదృష్టముండి
సింధుజలధికివచ్చి చేరెగాబోలు

ఆపడినపాటులో అమృతభాండమ్మె
త్రోపుడు వడికొంత తొణికెనో, లేక
తొఅగి భాండ శిలాలు దొరలెనోభువికి
చెఱకుదోటలు రసశ్రీలు సొంపారె

ప్రవిమలాంబువులమృతవారి పూరములు
పావనమ్ములు సరోవరము లింపారె

ఆ గడియలోపనే హరి విల్లువిరిగి
సగమాయెనో యేమొ చదల పైనవుడు
సగమే కనవచ్చునా మిగిలిన సగమ్మే
నగము పై బడి నగునగయ్యేనేమొ
సత్యమిది యనుటలో సందేహమేమి?
నిత్యమీ దీనియందీ చందమేమి ?

హరివింటి వాసమను ఆ పేరదేమి ?
హరివిల్లు కిచటనే ఆ వాసమేమి ?
ఇచ్చోట లేకున్న ఏ వింతయేమి ?
అచ్చుపడినట్లున్న ఆ రంగులేమి ?
ఊాడ చోద్యమేగాని సత్యమ్ము నుండు
ఏడురంగుల భూమి నిట చూచిపొందు

ఆకాశగంగలో నరపాయ దొలగి
ప్రాకటమ్ముగ పంప్రవసములో పడెనో
బంగారు తామరలు పరిమళించెడివి
చెంగలువలొక పక్క చెలువు చూపెడిని.

జలకన నోలాడి చదల తేలాడి
అలసిన రాయంచ లారగింపంగ
అచ్చోట చక్కగా సమరంగ నిడిన
పచ్చలకంచాల పంక్తిదోచెడిని.

మురిపెంపు నడలన్ని ముదితలకిచ్చి
అరుదైన సుగుణమ్ముల వనిపై నిల్పి
చదువులో సబ్రహ్మచారులే యైన
దోదోలతోగూడి దోబూచులాడి
ఏ దూర తీరాలకేగెనో లేక
ఎదురు కోల్సలు పంగనేగెనో మీకు

ఏ లీలచూచినా ఏ మూలకనినా
కైలాసమే కొంత కనిపించు నిచట
ఏ కొండకరిగినా ఏ కోన గనినా
వైకుంఠమే కొంత వటలు నిచ్చోట
ముక్తజీవులె యిందు మురియుచున్నారు.
భక్తిపథమున పరమపదము గన్నారు
అన్నదమ్ములవలెను అందరున్నారు
పున్నెముల పంట పెంపొందించినారు.

—డా. వేటూరిఆనందమూర్తి

—:O:—

# సమైక్యత ద్వారా సంపూర్ణ వికాసం

# సారవకోట సమితిలో మానవతా కార్యక్రమములు

—కుసుమ ధర్మారావు

శ్రీకాకుళంజిల్లాలో సారవకోట సమితి 94 పంచాయితీలు, 297 గ్రామాలతో, 1,16901 జనాభా కలిగియున్నది యింత విశాలమైన ఈ సమితి వివిధ రంగాలలో ఒక మైలురాయి అభ్యున్నతివి సాధించినదిగానే చెప్పకోవచ్చును. కాని హరిజన గిరిజనుల జీవన విధానంలో మాత్రం ప్రభుత్వం ఆశించినంత ప్రగతి లేదు. అందుచేత స్వచ్ఛందమైన కార్యక్రమములు ఎక్కువ ఆసక్తిని చవి చూడడానికి అవకాశం ఏర్పడినది. ప్రభుత్వ పరంగా జరిగే కార్యక్రమములు, ప్రజల సహకారంతో జరిగే కార్యక్రమాలు ఈ వర్గం ప్రజలలో ఒక నూతన చైతన్యము సృష్టించినది. ప్రభుత్వము తమకోసం ఎంతో కృషి చేస్తుందనే భావం వారిలో కలిగినది.

## గిరిజనులు

ఈ సమితో 34230 మంది హరిజన, గిరిజనులు వున్నారు ఈ 20సం॥ స్వాతంత్ర్య పరిపాలనలో వీరి సాంఘిక, ఆర్థిక, విద్యాస్థాయి ఏమాత్రం మెరుగుపడలేదు. వీరిని, ఇతర సమాజంతోపాటు వున్నతస్థితికి తీసుకొని రావడానికి ప్రభుత్వయంత్రాంగం కొంత మందకొడిగానే పనిచేసినది. ఈ సత్యాన్ని గుర్తించిన ప్రభుత్వం_వీరి అభివృద్ధికి వివిధ రంగాలలో ఎంతో కృషి చేయడం జరుగుతున్నది. ఈ సమితో రూ 16 వేలు విలువచేసే 120 జతల ఎద్దులను, 120 కుటుంబాలకు దీర్ఘకాలిక ఋణాలపై సరఫరా చేసిరి. దీనివలన వ్యవసాయం గల గిరిజనులు మరో మెట్టు పైకి పోవడానికి అవకాశం ఏర్పడినది. దీనికితోడు 380 ఎకరాలకు సరిపోయే ఐ. ఆర్.‌_8 వరి విత్తనాలు ఖరీఫు పంటకాలంలో ఉచితంగా సరఫరా చేశారు. దీని పర్యవసానంగా 300 కుటుంబాలు తమ వ్యవసాయ సంపదను అభివృద్ధిచేసుకోవడం వీలు కలిగినది. ముఖ్యంగా గిరిజనులలో కట్టెలు అమ్మికొని జీవించే విధానమే ఎక్కువ. అందుకుగాను దానిని ఆదుకొని_వారి జీవన భృతికి అవకాశము ఏర్పరచుటకుగాను; దాసుపురం, తెంబూరు గ్రామములో "కట్టెల డిపో"లు ప్రారంభించియున్నారు. అవి సక్రమంగా పనిచేయడానికి ఎంతగానో కృషి జరుగుతున్నది. దీనికి అనుబంధంగా "బియ్యం" డిపోలుకూడా ప్రారంభించడంతో సరసమైన ధరలకు గిరిజనులు బియ్యం కొనుక్కొనే సౌలభ్యం ఏర్పడినది. నక్సల్‌బరీ వుద్యమానికి ఒకప్పుడు ఆటపట్టుగా పేరొందిన అత్తికొండలలోని గిరిజనులకు వైద్య సదుపాయాలతోపాటు 50 మందికి విలువైన 50 జతల ఉన్ని దుస్తులు ఉచితంగా సరఫరా చేసిరి. ఇవి పర్లాకిమిడి కేథలిక్ మిషన్ వారు బహూకరించిరి. డబారు గిరిజన వలసలో 3 వేల మందికి ప్రజల సహకారంతో అన్నదానము 50 మంది గిరిజన స్త్రీ పురుషులకు బట్టలు పంచారు. డి. ఐ. జి. యం. నారాయణరావు, కలెక్టర్ శ్రీ బి. యన్. యుగంధర్ సమక్షమున_సారవకోటలో 54 మంది గిరిజనులకు వస్త్రదానము, తెంబూరులో 100 మంది గిరిజనులకు వస్త్రదానము ఏర్పాటు చేయబడినది. సబ్ కలెక్టర్ శ్రీ టి. మునివెంకప్ప సమక్షంలో పూలపర గిరిజన వలసలో 3 వేల మందికి అన్నదానము 150 మందికి వస్త్రదానము జరిగినది. బంచపల్లి, పెదలక్ష్మిపురంలో 2 వేల మందికి అన్నదానము, 50 మందికి వస్త్రదానము నిర్వహించబడినది. ఈ సందర్భంలో మెళియాపుట్టి సి. ఆర్. పి అసిస్టెంటు కమాండర్ శ్రీ జగన్నాధరావు కృషి_శ్రద్ధ ఎంతో శ్లాఘించతగది. యివన్ని కేవలం ప్రజల సహకారంతో చేయబడిన సహాయ కార్యక్రమాలు. యికపోతే ప్రభుత్వ పరంగా ఎంతో కృషి జరుగుతున్నది.

బందపల్లిలో 40 కుటుంబాలకు, శివరాం పురంలో 40 కుటుంబాలకు గృహనిర్మాణం చురుకుగా సాగుచున్నది. తెంబూరు, పాతపట్నం గ్రామాలలో ఏజన్సీ వస్తు, క్రయ, విక్రయ, సహకార సంఘములు సుమారు పదివేల మంది గిరిజనుల దైనందిన అవసరాలను ఆదుకొంటున్నవి.

ప్రభుత్వం, ప్రజలు సమైక్యతతో చేయున్న ఈ మానవతా కార్యక్రమాల పర్యవసానంగా గిరిజనులలో పరివర్తన ఏర్పడుతుంది. సమాజంలో వారు ఒక తెగగా పురోగతిని సాధించడానికి ఎంతో వుత్సాహం చూపుతున్నారు.

ఇకపోతే, హరిజన వర్గంయొక్క శ్రేయస్సు గురించి ఎంతో శ్రద్ధ వహించడం జరుగుచున్నది. గాంధీజీ శతజయంతి సందర్భంలో 104 మంది హరిజన స్త్రీపురుషులకు సారవకోటలో వస్త్రదానము ఏర్పాటు చేయబడినది. $2\frac{1}{2}$ బస్తాల బియ్యం పంపకం జరిగినది. అయిదు గ్రామాలలో 64 హరిజన స్త్రీ పురుషులకు వస్త్రదానము కలెక్టర్‌గారి సమక్షంలో జరిగినది. ఇవిగాక సారవకోటలోను కొత్తపల్లిలోను హరిజనులకు గృహనిర్మాణము చురుకుగా సాగుచున్నది. దీని పర్యవసానంగా 55 హరిజన కుటుంబాలు నూతన గృహములు కలిగివుంటారు.

అయిదు గ్రామాలలో 60 హరిజన కుటుంబాలకు_పక్కా గృహముల నిర్మాణం ఆలోచనలో వున్నది.

ఈ రకంగా వివిధ రంగాలలో బలహీనవర్గాలను ఆదుకోవడానికి ప్రభుత్వం, ప్రజలు ఎంతో వుత్సాహంతో పని చేయడానికి ఇచ్చిన సహాయాన్ని సద్వినియోగపరచడానికి బి.డి. ఓ శ్రీ యన్. వేణుగోపాలరావు కృషి సర్వదా మెచ్చదగినది. కలెక్టర్ శ్రీ బి. యన్. యుగంధర్, సబ్‌కలెక్టర్ శ్రీ టి. మునివెంకప్పల యొక్క సేవాదృక్పథము ఈ సమితిలో మానవతా కార్యక్రమములు నిర్వహించడానికి దోహదకారిగా వున్నది. 

# ఢింసా నృత్యం: పోథార్ తోళా

—పోకూరి శ్రీరాములు

మానవుడు ఉల్లాసంగా వున్నప్పుడు తన ఆనందాన్ని ఇతరులకు తెలియ జేయుటకు గెంతుతాడు. క్రమానుగతమైన ఆ కదలికకే నృత్యం అని పేరు. నింగిలో ఉరుమును విన్న మయూరి వనంలో పురి విప్పి ఆహ్లాదంతో నాట్యమాడుతుంది. సన్నసన్నని గాలుల చల్లచల్లని స్పర్శకు కెరటాలు నీటి తుంపరలను లేపి తమ హర్షాన్ని వ్యక్తం చేస్తాయి. వీటన్నిటినిబట్టి చూస్తే ఆనందం అనే భావానికీ, నృత్యానికీ ఏదో అవినాభావ సంబంధం ఉన్నట్లు కనబడుతుంది. నాగరికతతో పాటు నృత్యం పుట్టి పెరిగినదనీ, క్రమంగా వికాసం చెందుతూ వచ్చిందనీ కొందరు వాదిస్తారు. ఈ వాదన సరికాదు ఎందుకంటే నాగరికత అనేది బుద్ధి సంజనితము. నృత్యమో హృదయంలోని కోమలతంతువులకు, మనోవేగానికి సంబంధించి నట్టిది.

చారిత్రకంగా భారతీయ నృత్యకళను స్థూలంగా మూడు దశలుగా విభజించవచ్చు 1. ప్రారంభదశ: ఇది ఒక్కింటి ప్రాచీనమైనది. సంథాలులు మొదలైన అదిమ నివాసులు, ఆటవికుల నృత్యాలు ఈ కోవకు చెందినవి 2. జానపద నృత్యం: అదిమవాసుల నృత్యం కన్న కొంచెం మెరుగులు పుణికి పుచ్చుకున్నది. కళాత్మకతను కొంతవరకు సంతరించు కున్నది ఇది. ఈ శైలి సహజ స్వాభావికము. కేవలం ఆనందాతిరేకాన్ని వ్యక్తం చేసే ఉద్దేశ్యంతో చేయబడేది. 3. శాస్త్రీయ నృత్యం: జానపదం అనే నల్లరాతినుండి మలచుకొన్న దివ్యసుందర మంగళ రూపం. నియమాలనే బంగారు గొలుసులచే బంధింపబడి లయతాళ భావబద్ధమైన శైలి. నృత్యాలలో కెల్లా బహుజనాదరణ పొందినట్టిదీ, అందరికీ సులభంగా అర్థమై సామాజికుణ్ణి భావావేశంలో ముంచెత్తేదీ జానపద నృత్యం ఆంగ్లకవి వాషింగ్టన్ ఇర్వింగ్ చెప్పినట్లు, ఏదైనా దేశంగురించీ, దాని చరిత్రగురించీ తెలుసుకోవాలంటే ముందు ఆ దేశవాసుల వినోదాల గురించిగానీ, వారి కాలక్షేప విధానాల గురించిగానీ తెలుసుకోవాలి. నిజానికి జానపద నృత్యాలు ఒక జాతి సంస్కృతినీ, దాని రీతి రివాజుల్నీ, అలవాట్లనూ ప్రతిఫలింపజేసే దర్పణాల్లాంటివి

విశాఖపట్నానికి 71 మైళ్ళ దూరంలో సముద్ర మట్టానికి మూడువేల అడుగుల ఎత్తున ఉండే అరకులోయ ప్రకృతి సౌందర్యానికే కాక చిత్రవిచిత్ర సంప్రదాయాలుకల ఆటవికులకు కూడా అందాల ఆటపట్టు. ఎటుచూచినా కొండలూ, కోనలూ, వాగులూ, సెలయేళ్ళూ, పోడుసేద్యంచేసే పచ్చని భూములూ, కాఫీ, ఏలకుల తోటలతో ఘుమఘుమలాడే ఈలోయలో గదబ, కోటయా, దొంబు కోడు, గోండు, పెంజబోడియ మొదలైన సుమారు 25 రకాల తెగల అదిమ వాసులు ఉన్నారు. వీరికి సంగీతమన్నా, నృత్యమన్నా మహా ఇష్టం పంటకోతల సమయంలో, పండుగలు వేడుకలు జరుపుకునే సమయంలో వీరు తమతమ ఆనందాన్ని రకరకాల నృత్యాల ద్వారా వ్యక్తీకరిస్తారు. వీరు ప్రదర్శించే నృత్యాలలో కెల్ల 'ఢింసా నృత్యం' అన్నింటికన్న సుప్రసిద్ధమైన అదివవాస నృత్యం. సంగీతమూ, సందర్భమూ, సాంఘిక ప్రయోజనాన్నీ బట్టి స్థూలంగా ఢింసాను పది తరగతుల క్రింద పేర్కొనవచ్చు



పోథార్ తోళా అడ్డాకుల నృత్యం

వీటిలో 'బోడ్డెఢింసా' భూతప్రేతాల్ని ఆవహింపజేయడానికి ఇతర నృత్యాలకు ముందు నాందీ ప్రస్తావనగా చేయబడే నృత్యం ఇష్టఫదార్థాల్ని సిద్ధింపచేయడానికి తోడ్పడతాయనే నమ్మకమే ఈ నృత్యానికి మూలకారణం ఒరిస్సా భాషలో 'బోడే' అనగా పెద్ద, గొప్ప అని అర్థం. ఈ నృత్యంలో 'నిసానీ దేవుని' లేక 'బోడే దేవతను' ఆవాహన చేసి వా రక్షించ వలసిందిగానూ ఢింసా నృత్య ప్రదర్శనలో ఆడు గున వారికి మార్గదర్శకత్వం చేయవలసిందిగానూ ప్రార్థిస్తారు. ప్రదర్శనను రక్తి కట్టించడానికి జోడు కొమ్ములు, మోడి, కిడిది, తుడుము, డప్పు వాయిద్యాలను ఉపయోగిస్తారు. కుడివైపున నర్తకులు ఎడమవైపున నర్తకీమణులు వెనుకవైపుగా ఒకరిచేతులు మరొకరు గట్టిగా అదిమి పట్టుకుని సుళ్ళు తిరుగుతూ వలయాకారంలో నృత్యం చేస్తూ వెనుకకూ ముందుకూ వంగుతూ కడియాలతో సవ్వడిచేస్తూ 'హే ... హూ' అని రవళిచేస్తూ సరళ రేఖలో తిరిగి నిలబడు

తారు. రెండు దళాలకు చివర ఇద్దరు పురుష లుంటారు. సాధారణంగా వీరు దళనాయకులుగా వ్యవహరిస్తారు. చేతిలో నెమలి రెక్కల్ని పట్టుకుని బ్యాండు మేస్టారు లాగ నృత్యప్రదర్శనకు దర్శకత్వాన్ని వహిస్తారు. త్వరితంగా పదచాలన చేయడం బోడె ఢింసా విశిష్టత

'కుందాఢింసా' సహనర్తకుడ్ని మేల్కొల్పడానికి గాను చేయబడే రెండవశైలి. 'కుందా' అంటే ఒకరి భుజాలను మరొకరు తాకిస్తూ లయబద్ధంగా ఎగరవేయడం అని అర్థం. ఆద్యంతమూ శరీరావయాల్ని విపరీతంగా కదపడంలోనూ, భుజాల్ని ఎగరవేయడంతో నిండివున్న కుందా ప్రదర్శన మహారసవత్తరంగా వుంటుంది.

మానవునిలో నిద్రాణమైన జడత్వాన్ని మేలుకొలిపి వ్యవసాయకాలంలో పొలం పనులవైపు అతని మనస్సు చైతన్యవంతం చేయడమే 'కుందా' ముఖ్యోద్దేశం.



కుందాఢింసా

అన్ని అడవి జంతువులలోకెల్లా భయంకరమైనదీ, క్రూరమైనదీ శార్దూలము. గిరిజన ప్రాంతాలలోని పశు సంపద దీని వాత పడి హరించిపోతూండడం అందరికి తెలిసిన విషయమే. ఇట్టి వన్య మృగాల బారినుండి తప్పించుకోవాలంటే మానవుడు ఎంతో అప్రమత్తత, వ్యుత్పన్నమతిని ప్రదర్శించడం అవసరం. అట్టి అప్రమత్తతను సమయస్ఫూర్తిని ప్రస్ఫుటంచేసేది 'బాగ్' ఢింసా. బాగ్‌ఢింసాలో నర్తక బృందం రెండు జట్లుగా విడిపోతుంది. ఒక జట్టు చేతులు కట్టుకొని వృత్తం గీస్తుంది. కట్టుకున్న చేతుల్ని క్రిందకు పైకీ కదుపుతూ వూపుతూ ఎడమ కాలి బొటన వ్రేలును నేలపై అదుముతుంది. ఇంతలో రెండవ జట్టు వేగంగా వర్తులాకారంలో కదలుతూ మొదటి జట్టు వలయంలో ప్రవేశించి సర్పంవలె చుట్టు చుట్టుకుంటుంది. ఇదే పద్ధతి అనేక పర్యాయాలు చేయొచ్చు.

తొలినుండి మానవుడు ప్రకృతి సాహచర్యంలో వుంటూ వచ్చాడు. ఇలా వుండటంలో అతనిపై ప్రకృతి ప్రభావం విపరీతంగా పడుతూ వచ్చింది. అందుకే కాబోలు అనేక జానపద నృత్యాలకు ప్రకృతి ఆలంబనంగా ఉండటం మనం చూస్తాము. అమెరికాలోని 50 వ రాష్ట్రం అయిన హవాయి రాష్ట్రం జానపద నృత్యాలకు పుట్టినిల్లు. అక్కడ కనుపించే చిత్ర విచిత్ర శైలులు, జగత్ప్రసిద్ధి చెందినట్టివి. ఈ రాష్ట్రం నలువైపులా పసిఫిక్ (ప్రశాంత) మహా సముద్ర జలాలచే ఆవరింపబడి ఉన్నది. హవాయి ద్వీపంనిండా ఖర్జూరపు చెట్లే. అందుచేత అక్కడి జానపద నర్తకుల అంగవిన్యాసంలో గాలికి కదలాడే ఖర్జూరపు చెట్ల ప్రభావమూ, పసిఫిక్ మహా సముద్రంలో హొయలు ఒలకరిస్తూన్న అలల ప్రభావమూ కనబడతాయి. మానవునిపై ఇటువంటి ప్రకృతి ప్రభావాన్ని సూచిస్తున్న నృత్యమే "పోథార్‌తోళా" అనే అడ్డాకుల సేకరణ నృత్యం. అరకూ ఏజన్సీలోని ఆటవికులు తమ నిత్యావసరాలకుగాను అడ్డాకులు సేకరించి వారం వారం జరిగే సంతల్లో వాటిని అమ్ముతుంటారు ప్రతి ఆటవికుడూ నిత్యం అడవికెళ్ళి అడ్డాకులు కోసి సేకరించడం తన దినచర్యగా భావిస్తాడు. ఒరిస్సా భాషలో "పోథార్" అంటే ఆకు, తోళా అంటే సేకరించుట అని అర్థము. కుందా ఢింసా మాదిరి ఈ శైలిగూడా "పని పూజవంటిది" అనే సిద్ధాంతాన్ని అన్యోక్తంగా తెలియజేస్తుంది. నర్తకులు రెండు జట్లుగా విడిపోయి ప్రతి జట్టులోనివారు ఒకరి వెనుక ఒకరు నిలబడతారు. నర్తకుడు తన రెండు చేతులూ ముందు నిలబడివున్న నర్తకుని భుజాలపై వేసి తలను అటూ ఇటూ ఆడిస్తూ ముందుకు నడుస్తాడు. ప్రతి జట్టు అత్యంత మనోహరంగా పద విన్యాసం చేస్తూ అడ్డాకుల సేకరణ కార్యక్రమానికి ప్రతీకగా మారుతుంది. అడ్డాకు అరకు లోయలో ప్రధానంగా లభించే ముడి పదార్థం. దాని నార తీసి త్రాళ్ళు అల్లుతారు. దాని పండులోని గుజ్జును కాల్చి తింటారుకూడాను.

అరకులోని అదిమ నివాస తెగల్లో భర్త మరణిస్తే భార్య అతని చితిలో దూకి అగ్ని జ్వాలలకు ఆహుతి అవడమనే ఆచారం వుంది. ఇటువంటి ఆచారాన్ని తెలిపే నృత్యాన్నే వారు "సతియా హరి" అంటారు.

వారిలో ఎవరైనా మరణిస్తే దహనసంస్కారం చెయ్యడం, పాతి పెట్టడం రెండు ఆచారాలూ ఉన్నాయి. ఉదాహరణకు "గడబ" తెగలోని ఒక వ్యక్తి మరణించినప్పుడు వారంతా కలసి పెద్ద దినం జరుపుకుంటారు. ఆ రోజు వారంతా ఒక చోట చేరి మేకలు, గొర్రెలు, దున్నపోతులు మొదలైన ఏటల్ని బలి ఇస్తారు. ఏటల్ని బలి ఇచ్చే స్థలమంతా రక్తసిక్తమైన వధించబడిన జంతువులచర్మాలతో చూడడానికి చాలా బీభత్సంగా వుంటుంది. బలి స్థలాన్ని పరిశుభ్రంచేసే విధానాన్ని చూపించే నృత్యమే "గాథేర్ ఢింసా". గిరిజనులు తమ తమ పరిసరాల్ని ఎలా పరిశుభ్రంగా, నిర్మలంగా ఉంచుకోవాలో పరోక్షంగా ఉద్బోధించే ఆశయంతో ఈ నృత్యం చేస్తారు.

కేవలం ఆదిమ నివాసుల సాంఘికాచారాలను, వారి పారిశుద్ధ్యాన్ని తెలిపే నృత్యాలేకాక వ్యక్తుల మనో భావాల్ని ఆధారంగా తీసుకొని చేసే నృత్యాలుకూడా ప్రచారంలో వున్నాయి. ఇందుకు ఉదాహరణగా ఒక వృద్ధుని మనో భావాల సౌకుమార్యాన్ని ఇతివృత్తంగా గ్రహించి అతి సునిశితంగా భావాల గొడుగును విప్పే

"గొడిబెట" నృత్యం పేర్కొనవచ్చు. ఈ నృత్యం వెనుక ఒక జన శృతి ఉంది. ఎప్పుడో కొన్ని సంవత్సరాలకు పూర్వం, ఒక వృద్ధ దంపతులు తమ గుడిసె ముందు కూర్చుని ఉంటారు. కటిక నేలపై కూర్చోడం వారికి ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. ఒక్కొక్క రాయి పోగుచేసి అరుగు ఆకారంలో వాటిని పరిస్తే సుఖంగా కూర్చోవచ్చుగదా అని వారికి స్ఫురిస్తుంది. వెంటనే ఆ వృద్ధుడు రాళ్ళు సేకరించమని భార్యను ఆజ్ఞాపిస్తాడు. పాపం ఆ ముసలి అవ్వ, వెదురు బద్దలాగ నడుము వంగిపోయినా భర్త అభీష్టాన్ని ఎలాగైనా నెరవేర్చాలనే సంతోషంతో రాళ్ళను ఏరనారంభిస్తుంది. ఆమె వంగి ఒక్కొక్క రాయి ఏరి గుట్టగా చేరుస్తూ ఉండడం దూరాన్నుండి ఆమె భర్త తిలకిస్తూ ఉంటాడు. రాళ్ళకోసం చాచే ముడతలుపడిన ఆమె బలహీనమైన చేతులూ, జవసత్తువలు ఉడిగిన ఆమె ప్రతి అవయవమూ ఎంతో సొంపుగానూ ఒయ్యారాన్ని ఒలకబోస్తున్నట్లుగానూ కనబడతాయి అతని కళ్ళకు. ఆ అవయవాల వంపులను పరికిస్తూ తన్నుతానే మరచి ఉంటాడా వృద్ధుడు. ఆదర్శ దాంపత్యాన్ని ఒళ్ళు పులకరించేవిధంగా ప్రదర్శించే ఈ నృత్యం తరతరాల నుండి అరకు ఆదిమ నివాస కుటుంబాల్లో విశేషమైన ప్రచారం కలిగివుంది, వివాహ సమయంలో వధువును ఇంటికి తీసికెళ్లేటప్పుడు గూడ వీరు 'గొడిబెట' నృత్యం చేస్తారు

అరకులోయలోని ఆదిమ నివాసులు కొన్ని పండుగల్ని మహావైభవంగా జరుపుకుంటారు. పంట కోతలపని అయిపోయి వ్యవసాయపు పనులన్నీ ముగిసిన తరవాత 'చైత్ర' లేక ఈటల పండుగను కడువైభవోపేతంగా చేసుకుంటారు. నెల పొడవున జరిగే ఈ పండుగ సమయంలో వారు ఏపనీ ప్రారంభించరు. ఈ పండుగ రోజుల్లో దేహదార్ఢ్యంగల ప్రతి ఆటవిక యువకుడు అడవికి వెళ్ళి ఏదో ఒక వన్యజంతువును వేటాడి వధించేవరకు ఇంటికి రారాదు. సాధారణంగా అతడు వేటాడే జంతువు 'సాంభర్' అయివుంటుంది. సాంభర్ మృగాన్ని వేటాడి ఇంటికి తీసుకవచ్చిన పిదప దానిచుట్టూ పురుషులు స్త్రీలుచేరి ఉల్లాసంతో ఓ రకమైన నృత్యంచేస్తారు. నృత్యం అవగానే సాంభర్ మాంసాన్ని వండి అందరూ కలిసిభుజిస్తారు. సంపూర్ణత్వాన్నీ, నిండుదనాన్నీ సూచించే ఈ నృత్యాన్నే 'సాంభర్ లచ్చన్' అంటారు అరకు లోయవారు.

చైత్ర పండుగను ఆదిమనివాసులు తమ గ్రామం వరకే జరుపుకొని సంతృప్తిచెందక పొరుగుగ్రామంలో జరిగే వేడుకలో గూడపాల్గొనటానికి తరలి వెడతారు. ఓ సంవత్సరం ఒక గ్రామం ఆతిథ్యం ఇస్తే మరోసంవత్సరం మరోగ్రామం ఆ గ్రామాన్ని ఆహ్వానించి ఆతిథ్యం ఇస్తుంది. వంతులు వంతులుగా ఇచ్చే ఈ ఆదాన ప్రదాన కార్యక్రమానికి అరకు ఆదిమనివాసి 'సంకిడికెల్బర' 'కిండిడి కెల్బర' అని ప్రియమైన నామధేయాల్ని ఇచ్చాడు.

అరకు ఆదిమనివాసుల గ్రామదేవతపేరు 'నిసానీ దేవత'. ఈ గ్రామ దేవత ఏ వ్యక్తిని పూనుతుందో అతణ్ణి 'గురుమాయ' అని పిలుస్తారు వారు. గురుమాయకు శివం వచ్చినపుడు వారంతా వర్తులాకారంలో నిలబడి శక్తిపూనినప్పుడు తల ఆడించినట్లుగా ఆడిస్తారు. పూనకంలో వున్న గురుమాయ తెగలోని ఏఏ వ్యక్తి సంప్రదాయ కట్టుబాట్లను ఉల్లంఘించిందీ వారి పేర్లతో సహా చెబుతాడు. గురుమాయకు చుట్టూనిలబడి చేసే ఈ నృత్యం పేరు 'బయాఢింసా.' బయా అంటే ఒరియా భాషలో 'శక్తి' లేదా 'శివం' అని అర్థం. సాధారణంగా ఇతర నృత్యాల మాదిరి బయాఢింసా నృత్యాన్నిచేయరు అరకు లోయలోని ఆదిమవాసులు. శక్తి పూనినపుడు మాత్రమే ఈ నృత్యంచేసే రివాజు. శివం దిగిందాక నృత్యం నడుస్తుంది.



గొడిబెట నృత్యం

పైన పేర్కొన్నవిగాక అరకు ఆదిమనివాసులు ప్రత్యేక సందర్భాల్లో చేసే చిన్నతరహా నృత్యాలు ఇంకా ఎన్నోవున్నాయి. ఉదాహరణకు మనస్సంతా ఆనందంతోనిండి ఆవేగం కట్టలు తెంచుకోవడాన్ని చూపించేది 'ఉసుకు' నృత్యం. చిరవాంఛితాలు నెరవేరినపుడు కూడా 'ఉసుకు' చేయడం కద్దు. ఒకేవ్యక్తి చేసే ఆదిమవాసీ నృత్యం 'నటికరి' (సోలో). ఈ నృత్యం ప్రధానంగా వాల్మీకి తెగవారు దీపావళి సందర్భంలో చేస్తారు. ఈ కార్యక్రమంలో నర్తకులు మాత్రమే పాల్గొంటారు

మానవుని హృదిలో భావాలనే కొండవాగు అనవరతమూ పరవళ్ళు తొక్కుతూవుంటుంది. అది కట్టలనే బంధాల్ని తెంచుకుని బయటకు పొంగిపోవాలని అనుక్షణమూ మథనపడుతూంటుంది. అవకాశం లభించగానే అది ఒకకళారూపాన్ని ధరించుకుని ప్రకటితమౌతుంది. రంగురంగుల కళారూపాల్ని తొడుగుకున్న ఈ ఆదిమవాసుల నృత్యాలు ఆయాజాతి జీవన విధానాన్ని ప్రతిబింబించే దర్పణాల్లాంటివి. కృత్రిమ నాగరికత అనే నాచును పీకివేసి జాతి, సంస్కృతిలోని నైర్మల్యాన్ని అద్దంలాగా చూపించే ఈ సనాతన నృత్యసరోవరాల్ని నాశనం కాకుండా మనం ఎంతతొందరగా కాపాడ గలిగితే అంత మంచిది.



—సోమసుందర్

అయ్యోయ్యో వెర్రి నాగమ్మల్లారా
మీ చిరునవ్వుల్ని ఏ కీకారణ్యంలో పారేసుకున్నారర్రా....
మీ కలల పన్నీటిని ఏ బంటాలలో ఒంపేసుకున్నారర్రా
అయ్యోయ్యో వెర్రి నాగమ్మల్లారా
మీ నాగేటి చాళ్లలో తెగిపడిన మీ చేతులే
మొలిచి తలలూచు తున్నాయి; గిల్లితే
నెత్తురోడ్చుతున్నాయి; జల్లితే
నవ్వుల నువ్వు విత్తులు, పల్లేరు
లిన్నేసి మొలిచాయే మర్రా ?
పొడిచేసిన కన్నుల్లారా, కుట్టేసిన పెదవుల్లారా
నిన్ననే కదర్రా లేచారు సింగపు కొదమల్లాగ
ఇంతల్లోకే విడి విడిగా నిలిచారే మరి
పగిలిన కడవల్లాగ
ఇంతల్లోకే చెవి పుచ్చిన కుక్కల్లాగ. . . .
మీ చుట్టూ మీరు, రూపాయల మోతల చుట్టూ
మీరు, అసమర్థ నిరీక్షణల చుట్టూ మీరు,
చోరికలు కట్టిన అణగారిన కోరికల చుటూ మీరు,
పీడ చుట్టూ మీరు, పాడె చుటూ మీరు,
అరెరే జోరీగల్లారా, అయ్యోయ్యో వెర్రి నాగమ్మలారా!
మొన్న మొన్న జ్ఞాపకం ఉందా— గాలి సముద్రాన్ని
రెండు చంకల్లోనూ యిరికించుకొని
మీ నట్టింట ఒలక పోసింది, జ్ఞాపకం లేదూ?
దారి వార నూట యాభై ఊడలతో నిల్చిన
మీ ముత్తాత వేసిన మర్రి చెట్టుని
సుడిగాలి అమాంతం పీకి మీ గుడిసె నడి కొప్పుమీద
భద్రపరిచింది జ్ఞాపకం లేదూ, వెర్రి నాగమ్మలారా!
కారాలూ మిరియాలూ నూరిన
ప్రళయోరు ప్రభంజనం నీ రెండు చెవులూ
పీకేసి కన్నుల మీదపెట్టి కుట్టేసింది జ్ఞాపకంలేదూ
నాలుగు రోజులకిందటే పవుద్రంలోకి ఏటకెళ్లిన నాగేశూ
వాడపిల్లీ దవియాలూ— ఎక్కడున్నారో
కలకటేరు నడిగేవా కడలి నడిగేవా
మడుగు నడిగేవా తెగిపడిన తొడిమ నడిగేవా
జడిమనడిగేవా దేవుణ్ణడిగేవా
ఎలా అడుగుతావులే వెర్రి నాగామ్మా ?
నీ నోరు విడదు, పెదవులు కుట్టేయ బడ్డాయి;
కళ్లకి గంతలు కట్టేయ బడ్డాయి;
నీ తలపై నడికొప్పుల బరువులు పడ్డాయి
నువ్వు మాట్లాడవు, నీ చు నీవు
అధికారుల పాదాల చుట్టూ నీవు
కన్నీటి సుడిగుండాల చుట్టూ నీవు
గుండ్రంగా ... గుండ్రంగా ... గుండ్రంగా ... ★

# పూలతో అలంకారాలు

-ఎ. లక్ష్మీరమణ

సృష్టిలో అన్నిటికన్నా అందమైనవి పూలే ననిపిస్తుంది. నాటినుండీ నేటివరకు కవుల కావ్యాలుచదివినా, చిత్రకారుల చిత్రాలు చూచినా, శిల్పకారుల శిల్పాలు పరిశీలించినా పూల ప్రత్యేకత అగుపిస్తూనేవుంటుంది. అజంతా ఎల్లోరా శిల్పాలలో నేమి, తాజ్‌మహల్ పాలరాతి చెక్కడాలలో నేమి పలురకాల పూలూ, లతలూ అగుపిస్తాయి. చిత్రకారుల దృష్టిని ముఖ్యంగా ఆకర్షించేవి పూలు. కవుల కన్నులను ఆకర్షేవి పూలే.

రారాజుల హృదయాలూ, రమణుల మనసులూచూరగొనేవీ అందాల పూలే! అందుకే కాబోలు నవరత్నాలతోనూ, వజ్ర వైఢూర్యాలతోనూ అలంకరించుకున్న అంతఃపుర కన్యలకన్నా, శకుంతల దుష్యంతుని నయనాలకు అతిలోకసుందరిగా అగుపించింది.

అన్ని శుభకార్యాలూ పూలతోనే ప్రారంభమవుతాయి. అందుకే ఆది దైవమైన విఘ్నేశ్వరుడ్ని పూజిస్తూ "దాసిమ్మ మరువము, దర్భ విష్ణుకాంత, యుమ్మెత్త దుర్వార యుత్తరేణి, కలువలు మారేడు గన్నేరు జిల్లేడు, దేవకాంచనరేగు దేవదారు, జాజి బలురక్కసి, జమ్మి దాచెన పువ్వు" అంటూ ఏన్నో పూలతో పూజిస్తాము. దేవీ పాద పద్మాలపైన అలంకరించబడ్డ పూలు అపురూపమైన అందంతో వెలుగొందుతాయి. శ్రీకృష్ణపరమాత్మని కంఠంలో పూలహారం అద్వితీయమైన అందంతో ప్రకాశిస్తుంది. ఎలాంటి పూవుకానీ, ఎక్కడ అలంకరించనీ, ఆ తావుకు అందమే అపాదిస్తుంది.

అందాల పూలు చెట్టుపైనున్నా, పుట్టపై పెట్టినా, జడలో చేర్చినా, సిగలో తురిమినా, గుచ్ఛెమ్మలో గుచ్చినా, ద్వారానికి కట్టినా అందాలే వెదజల్లుతాయి. ప్రపంచంలో అన్ని దేశాలవారికీ అన్ని మతాలవారికీ హృదయాహ్లాదం కలిగించేవి పూలు.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క ప్రత్యేకతతో ఒక్కొక్క పరిమళంతో పరవశింపజేస్తాయి. కాశ్మీరులో ఎటు చూచినా కనుల పండువగొల్పేది పుష్పాలే. మొగల్ గార్డెన్సులోను షికారీలలోనూ, కొండలమీదా, గుట్టలమీదా అగుపించే ఆ పూల అందాలు చెప్ప నలవికాదు.

జీవిత కాలములోనేకాకుండా, జీవితాంతంకూడా ప్రశాంతత గొల్పేది పూలే ననిపిస్తుంది. గాంధీజీ ఇంగ్లండు వెళ్ళినప్పుడు కలుసుకున్న ఒక చిన్న బాలిక మేరీ అన్న ఆమె యీ మధ్యనే వారి జ్ఞాపకార్థంగా, వారిసమాధిపైన పూలు అలంకరించవలసిందిగా కోరిందట. ప్రేమకూ, పవిత్రతకూ చిహ్నాలు పూలు. పూలతో మనసుల దాగిన మమకారాలు వ్యక్తపరచటం కద్దు.

పూలకు గొప్ప, బీద అన్న తారతమ్యాలులేవు. అవి అందరికీ అందుబాటులోనే వుంటాయి. అందమైన అజంతా సిగకు ఓ వక్కగా విచ్చీ విచ్చని గులాబిపూవు చేర్చుతుందొక నవీన నాగరికురాలు. పొలం గట్టుమీదపెరిగే బంతిపూవును తనకొప్పులో తురుముకొంటుం దొక పల్లె పడుచు. ఈ యిద్దరికీ ఒకే విధమైన అందమూ, అహ్లాదమూ లభిస్తాయి.

ఈ విధంగా సిగలో పూలు అలంకరించుకునేతీరు, జడలో మాలలు కూర్చుకునే వరుస ప్రాంతానికీ ప్రాంతానికీ వేరువేరయినా దేని అందాలు దానివే. మల్లెలువిచ్చే వేసవిలో జడనిండా మల్లెలు చిక్కగా కుట్టుకోవాలని ఉబలాట పడుతుందొక కన్య. జడపైన నాగరంచుట్టూ మల్లెమొగ్గలదండ, ఆ క్రింద వయ్యారంగా వేలాడే మల్లెమొగ్గల వాలు జడ, ఆనాటికీ యీనాటికీ కన్నుల పండువే గొల్పుతుంది. అదే తీరుగా చేమంతుల జడ, మొగలి రేకుల జడలుకూడాను. మల్లెలు పరిమళాలు వెదజల్లితే చేమంతులు పసిడి బంగారు ఛాయలతో అందాలు ఒలకబోస్తాయి. అందుకే కాబోలు "పూవు పూవున గలదు మధురమౌ పరిమళము____ మందార మెరుపు, మరితమ్మె సౌరు" అన్నారొక కవి భావపూరితంగా. మద్రాసు కదంబమాలకూర్చినా, కనకాంబరాలు మాలగా కట్టినా, సింహాచల సంపంగెలు గుత్తిగా గుచ్చినా, సన్న జాజులు దండగాకట్టినా, రెండు లిల్లీపూలు జతజేర్చినా ఒక ముద్దబంతి పూవు ముడుచుకున్నా, కురులకు వన్నెలు చిన్నెలే గూర్చుతాయి, ఆయా పూలు ఏరికోరుకునే వారి అభిరుచులనుబట్టె వుంటుంది.

ఈ లోగా వనితలు వారి వారి కట్టు, బొట్టు, గాజులను బట్టి పూలు కూడా అదే రంగులలో ఏరికోరి పెట్టుకోవటం కద్దు. అలంకరణలో ఒక ప్రత్యేకత వ్యక్తపరచటం ప్రశంసనీయమే కదా. లిల్లీ పూవు, గులాబి పూవు తమ తమ లావణ్యాల గురించి వాదించుకొంటున్న సందర్భంలో పద్మం ఆ వివాదం పురస్కరించుకొని మధ్య నిలచిందనీ సరోజినీ దేవి చక్కని పద్యం కట్టారు. పూల అందచందాలలో ప్రత్యేకతలు ఏలాంటివో పూల అలంకరణలో భిన్నత్వాలు కూడా అలాంటివే నని చెప్పవచ్చును.

అందాల పూలతో అలంకరణలు పలువిధాలు. చిన్నారి సిగలోనూ, కంఠహారాలలోనూ, చే గుచ్ఛాలుగానూ, వాజులలోనూ వాటి అందాల ప్రభావాన్ని ప్రకటిస్తూనే వున్నాయి. అన్ని శుభ కార్యాలలోనూ పూల ప్రభావం ప్రకటించుకొంటాయి, పెండ్లిండ్లు పేరంటాలు పూలతోనే ప్రారంభిస్తారు. అలాంటి శుభ సమయాలే కాకుండా, నిత్య జీవితంలో కూడా మన కండ్ల ఎదుట పూలు అగుపిస్తుంటే మనస్సుకు అదో విధమైన ఆనందం, తృప్తి లభిస్తాయి. అందుకే నలుగురు అతిథులు కూర్చుండే Drawing room లోనూ, భోజనం చేసే dining table మీదా, వాలివాజస్‌లోనూ పూలతో అలంకరించటం మామూలై పోయింది. ఈ పూల కూర్పులు వివిధ దేశాలలో, వివిధ తీరులలో అలంకరించు కొంటున్నారు. అందులో Traditional Style అనీ, Oriental Style అనీ, Modern Style అనీ పలువిధాలు.

వాజెస్(Vases) లో పూల అలంకరణ అనేక విధాలు. ముందుగా చక్కని వాజ్ ఎన్నుకోవలసివుంది. అందమైన పీసాలు పింగాణీతోనూ, గాజుతోనూ, చెక్కతోనూ, బొంగులతోనూ కూడా వాజస్ వుపయోగించుకోవచ్చును. వాజస్ ఎన్నో కొత్త నమూనాలలో కూడా లభిస్తున్నవి, వాజస్ ఆకారాలలో కూడా గుండనివి, వెడల్పుగానూ, ఇవెల్ షేపులోనూ, పొడవుగానూ, ముక్కోణాకారంలోనూ ఎన్నెనో మార్పులు. అంతేకాకుండా అవి జంతువులు పక్షులు, హంసలు, నెమళ్ళు, చేపల ఆకారాలలో కూడా లభిస్తున్నాయి. ఆ వాజస్ పైన రంగులు, చిత్రాలు కూడా పలువిధాలు లభిస్తున్నాయి. మన గది, కర్టెను రంగులనుబట్టి ఆయా వాజస్ ఎన్నుకోవచ్చును. వాజు ప్రత్యేకంగా అగుపించాలంటే, దాని క్రింద చెక్కగానీ బట్టగానీ మనకు నచ్చిన ఆకారంలో రంగులో అమర్చుకోవచ్చును.

పూలు వాజిలో నిలవటానికి ముఖ్యంగా దానికి నట్టు (Holder) కావాలి. అది కూడా వాజ్ సైజ్‌నిబట్టి అమర్చుకోవలసివుంటుంది. వాటి ఆధారంగా పూలు, ఆకులు, కొమ్మలు కూర్చవచ్చును. గట్టి కొమ్మలూ ఆకులూ వాటంతట అవే (Holder) లో నిలబడితాయి కానీ సున్నితంగా వుండే లతలూ ఆకులూ వాటంతట అవి నిలబడనప్పుడు ఒక గట్టి కొమ్మను ఆధారంగాచేసి వీటిని అమర్చవలసి వుంటుంది. ఈ కొమ్మ ఆధారంగా మాత్రమేకాకుండా పూల అలంకరణకు ఒక విధమైన శోభ కూడా చేకూర్చుతుంది. ఈ కొమ్మ యీ విధంగా అమర్చే ముందు రంగులు కూడా వేసుకోవచ్చును. పచ్చగా వున్నప్పుడే కొమ్మను మనకు నచ్చిన ఆకారాలలో తిప్పి దారంతోకాని వైరుతో కానీ కట్టి వుంచవలసి వుంటుంది. బాగా ఎండిన తరువాత, మన వాజ్‌కు తగిన రంగులు కూడా వేసుకొని అమర్చవచ్చును. ఆ వంపులు తిరిగిన కొమ్మలలో నుండీ పూలు మరింత అందగా చీపురు పుల్లలు, కొబ్బరి యీనలు కూడా వాడవచ్చును.

పూల తోటలు లేనివాళ్ళు Flats లో వుండేవాళ్ళు పూలు అలంకరించాలంటే, అవి లభించటం కష్టం. అందువల్ల పూలంత అందంగానూ తయారు చేయబడుతున్న Plastic Flowers తో అలంకరించుకోవచ్చును. ప్లాస్టిక్ పూలుకూడా మామూలు పూల లాగనే అలంకరించవచ్చును. అవి చిరుచుగా కూడా వుండటం వలన అలంకరించటం కూడా సులభంగానే వుంటుంది.

ఈ మధ్య నేనొక పూల ప్రదర్శనలో ఒక ఆకర్షణీయమైన కూర్పు గమనించాను. ఒక అందమైన గులాబీ ప్రక్కన జీరా ఫైడ్సు అమర్చివుంది. దాని నిండా ముళ్లు, ఆ పూవు సీతాదేవి, ఆ జీరా ఫైడ్సు రావణాసురుడు అన్నభావం చాలా అర్థ పూరితంగా వుంది. ఆ విధంగా పూలతో కథలల్లి చెప్పవచ్చును. అందుకే నండూరు కవి "పూలతో వియ్యాలు, పూలల్లో కయ్యాలు, మానవ్లె నన్నుంచి, తానె పూవౌనేమొ!" అన్నారు.

పూల కూర్పుతో జపాను దేశస్థులవి అందువేసిన హస్తాలని పేరు. అందుకే వారి Ikebana Style ని గురించి తెలుసుకోవాలని కుతూహల పడటం సహజమే. పూల కూర్పులో ఒక భావం, ఒక సందేశం వ్యక్తపరచటం వారి పూల కూర్పులో ప్రత్యేకత. మనం సూక్ష్మంగా పరిశీలించి చూస్తే, కొన్ని పూలు ఆకులూ చెట్లు, కేవలం అందంగా అగుపించడమే కాకుండా, ఏదో ఒక భావాన్ని గాఢంగా వ్యక్తపరుస్తున్నట్లుంటాయి ఉదాహరణకు, దేవదారు వృక్షం ఆ వృక్షం బలంగా దృఢంగా వుంటుంది, అందుకే ఒకవిధమైన స్థిరత్వాన్నీ, సంపూర్ణతనీ చాటుతుందని భావం. ఆవిధంగా వారు ఎన్నుకునే ఆకులు పూలు, కొమ్మలు ఒక అర్థం స్ఫురింపచేసే విధంగా వుంటాయి. అందులోనూ సహజత్వానికి కూడా వారు ప్రాముఖ్యత నిస్తారు. వారు ఎన్నుకునే పూలుకానీ, కొమ్మలుకానీ, బేసి సంఖ్యలో అంటే 3,5,7,11 ఎన్నుకుంటారట. వారు ఎన్నుకునే మూడు కొమ్మలు ఒకటి ఆకాశం వంక చూస్తున్నట్లుంటుంది, అది స్వర్గం సూచిస్తుందని వారి భావం. మధ్యనున్నది మానవుడనీ, క్రిందకు సూచించేది భూమి అనీ వారి భావం. వారి పూల అలంకరణ అతి సున్నితంగానూ సుందరంగానూ అగుపిస్తుంది. వారి నుండి మనం నేర్చుకోదగ్గవి చాలా వున్నాయనే చెప్పవచ్చును. మన పూలలో కూడా మన్మథ బాణాలనీ, పంచ పాండవులనీ, వెన్నముద్దలనీ ఎన్నెన్నో వున్నాయి. మనకు అందుబాటులో వున్న పూలను బట్టి కొత్త భావాలు జతజేర్చి, మన పూల కూర్పులో కొత్త మార్పులు చేర్చుకోవచ్చును. అదేవిధంగా వాలీ వాజెస్‌లోకూడా ఆ వాజ్‌నుబట్టి వెనుకనున్న గోడరంగునుబట్టి వంపులు తిరిగిన బోగన్‌విలాలాంటి కొమ్మలు మనీ ప్లాంట్ లాంటి కొమ్మలూ అమర్చవచ్చును. ఆపూలూ, కొమ్మలూ గోడకు కొత్త శోభను కూర్చుతాయి.

నేను పూల ప్రదర్శనలో పాల్గొన్నప్పుడు నాల్గు పలకల వాజ్ ఎన్నుకొన్నాను. దానికి నాల్గువైపులా నాల్గు రకాల చక్కని Paintings వుండటంవల్ల, అందులో రంగులనుబట్టి ఆకులూ, కొమ్మలూ, పూలూ ఎన్నుకొన్నాను. ఆ విధంగా వాజ్ Shape and Colour Combination ని బట్టి కూడా పూలు అలంకరించవచ్చును. పూల అలంకరణలో ఎన్నెన్నో కొత్త పద్ధతులు నేర్చుకుంటాం కానీ మనం కూర్చే పూల కూర్పులో మన భావాలకు ప్రాధాన్యం వుండాలి. మన భావాలు జతజేర్చి, పూలు కూర్చినప్పుడే, ఆ అలంకరణ, సహజంగానూ, రమ్యంగానూ రాణిస్తుందని నా భావం.

# జిల్లాల నుండి

## వ్యవసాయదారులకు స్టేట్ బ్యాంకు ఋణాలు

నల్గొండ జిల్లా, రామన్నపేటలోని హైదరాబాదు స్టేట్ బ్యాంకు బ్రాంచి మేనేజరు శ్రీ కె రామచంద్రన్, రామన్నపేట తాలుకాలోని 110 మంది వ్యవసాయదారులకు, లఘు పారిశ్రామికులకు బావులు త్రవ్వకొనుటకు, ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్ పంపు సెట్లు కొనుటకు రూ. 5 లక్షలను ఋణాలుగా యిచ్చి ఎంతో సహాయపడ్డారు.

## నూరు శాతం పన్నులు వసూలు

1969–70 సం॥లో కృష్ణాజిల్లా, బందరు పంచాయతీలోని చిన్నాపురం గ్రామ పంచాయతీ నూరు శాతం పన్నులు వసూలు చేసింది.

నల్గొండ జిల్లా, రామన్నపేట తాలుకా, గోకారం సర్పంచి శ్రీ సింహాచార్య, గ్రామసేవకుడు శ్రీ ఉమరఖాన్ సహాయంతో నూరుశాతం ఇంటి పన్నులు, ఇతర పన్నులు వసూలు చేశారు. గ్రామీణ రేడియో గోష్టినికూడా సర్పంచ్ ప్రారంభించారు.

## మెదక్ జిల్లాలో 25,000 ఎకరాలు పంపకం

మెదక్ జిల్లాలో లభించిన మొత్తం 40,000 ఎకరాలలో 25,000 ఎకరాలు పంపకం చేశామనీ, మిగిలిన 15,000 ఎకరాల పంపకం తెలుగు సంవత్సరాది ఉగాది నాటికి పూర్తి చేస్తామనీ ఫిబ్రవరి 27న ఆందోలు తాలుకా బైరానుదిబ్బ గ్రామస్థుల నుద్దేశించి మాట్లాడుతూ జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. చక్రవర్తి చెప్పారు.

జిల్లాలో మొదటిసారిగా శ్రీమతి రాధాచక్రవర్తి సీటీకుళాయి మరను నొక్కి ప్రారంభోత్సవం చేశారు. అంతకుముందు కలెక్టరును, ఇతరులను బ్యాండు వాద్యాలతో బోరింగు బావి దగ్గరకు తీసుకవచ్చారు.



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మార్చి 14 వ తేదీన గుంటూరులో ఆంధ్రి లూథరన్ విద్యా కళాశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు.



తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ ఎల్. మాలకొండయ్యా, రాజమండ్రి సమీపంలోని కతేరు వద్దనున్న కేంద్రీయ పొగాకు పరిశోధనా సంస్థ క్షేత్రంలో [illegible] రు.

అ—౦—౦

## నెల్లూరులో 38,000 ఎకరాల పంపిణీ

నెల్లూరు జిల్లా రెవిన్యూ అధికారి శ్రీ పి. ఎల్. సంజీవరెడ్డి గత బుధవారం నాడు కొవ్వూరు పంచాయతీ సమితిలోని బొడ్డువారి పాలెంకు చెందిన 32 యానాది కుటుంబాలకు గుడిసెల నిర్మాణానికి రు. 3200ల గ్రాంటును పంపిణీచేస్తూ యీ డబ్బును సద్వినియోగం చేసుకోవాలనీ, ఆ కాలనీకి రాజకీయ బాధితుడైన శ్రీ వి. సాయప్ప పేరును పెట్టాలనీ సలహా యిచ్చారు. ప్రత్యేక సంక్షేమ కార్యక్రమం క్రింద యీ కాలనీలో మంచినీటి బావి త్రవ్వకానికి రు. 1000 లు కేటాయిస్తామని ఆయన హామీ యిచ్చారు.

జిల్లాలో గత మూడు నెలలలో భూమిలేని రైతులకు హరిజనులకు, గిరిజనులకు 38,000 ఎకరాల భూమిని పంపిణీ చేశారని ఆయన అన్నారు. ప్రస్తుత సంవత్సరంలో 1970 మార్చి ఆఖరు నాటికి భూముల సేకరణ, గుడిసెల నిర్మాణం క్రింద రు. 83,600 లు ఖర్చు చేస్తారని ఆయన వెల్లడించారు.

పంచాయతీ సమితి అధ్యక్షుడు, శ్రీ కె. శ్రీనివాసులు రెడ్డి ప్రసంగిస్తూ గుడిసెల నిర్మాణానికి యిప్పుడు యిస్తున్న గ్రాంటును రు. 100 ల నుంచి రు. 250 లకు పెంచాలని విజ్ఞప్తి చేశారు.

రాచర్లపాడులోని రిజర్వు అడవుల నుండి 200 ఎకరాలను సేద్యం నిమిత్తం యానాదులకు యివ్వడానికి సహాయపడాలని జిల్లా రెవిన్యూ అధికారికి శ్రీ పి. చంద్రశేఖరరెడ్డి విజ్ఞప్తి చేశారు.

## తుఫాను బాధితుల ఇండ్లకాలనీకి ప్రారంభోత్సవం

సమాచార, పౌరసంబంధశాఖ మంత్రి శ్రీ ఎ వాసుదేవరావు గత శనివారంనాడు గుంటూరు జిల్లా, బాపట్ల నుండి మూడు మైళ్ళ దూరంలోవున్న మురుకొండపాడులో రు. 1.30 లక్షల ఖర్చుతో నిర్మించిన వృషభనగరం కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిసూ భవిష్యత్ పురోభివృద్ధికి బాటలు వేయడంలో మన గత సంస్కృతి, విజ్ఞానాలను ఉపయోగించుకోవాలని అన్నారు, మన తరువాతి తరంవారు గర్వించే విధంగా మన విజయాలు ఉండాలని ఆయన ఉద్ఘాటించారు.

మన ప్రజా ప్రతినిధులు తమ నడవడి, నిజాయితీ, క్రమశిక్షణలతో ప్రజలకు మార్గదర్శకులుగా వ్యవహరించాల్సిన సమయము ఆసన్నమైనదనీ, లేని పక్షంలో ప్రజలే ఏదో ఒకనాడు వారికి తగిన గుణపాఠం నేర్పుతారనీ ఆయన అన్నారు. బాధ్యతాయుతులైన ప్రజాప్రతినిధులుగా మనం, సాంఘిక, ఆర్థిక వ్యత్యాసాలు, అసమానతల తొలగింపునకు కృషి చేయాలని ఆయన అన్నారు.

ధనికులు, పేద ప్రజలను తమ స్వప్రయోజనానికి వినియోగించుకోవడాన్ని నివారించాలి. పేదల ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచి తద్వారా సంక్షేమ రాజ్య స్థాపనకు కృషిచేయాలని ఆయన అన్నారు. సమీకృత ఆంధ్రప్రదేశ్ లో నాలుగుకోట్ల మంది తెలుగు ప్రజల సమైక్యతకు మనం పాటుపడాలని ఆయన ఉద్బోధించారు.



సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ డైరెక్టరు శ్రీ పి. వామనరావు మార్చి 6 వ తేదీన వేములవాడలో శివరాత్రి సందర్భంగా ఏర్పాటైన ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు.

పార్లమెంటు సభ్యులు శ్రీ జి. ఎస్. రెడ్డి ప్రసంగిస్తూ క్రైస్తవ సహాయక సంస్థ జిల్లాలోని తుఫాను బాధితుల నిమిత్తం 200 యిండ్లను నిర్మించిందనీ, మరో 800 యిండ్లను నిర్మిస్తుందనీ అన్నారు

క్రైస్తవ సహాయక సంస్థ డైరెక్టరు ప్రొఫెసర్ విండె ప్రసంగిస్తూ గ్రామంలోని నివాసితులందరు యానాదులనీ, 109 రోజుల్లో నిర్మాణం పనులు పూర్తి చేశారనీ అన్నారు.

## గిరిజన హాస్టల్ భవనానికి శంకుస్థాపన

ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి నర్సింగరావు, ఖమ్మం జిల్లా, అశ్వారావు పేటలో ఒక్కొక్కటి రు 30,000 ల ఖర్చుతో నిర్మించే షెడ్యూల్డు కులాల హాస్టల్, గిరిజన హాస్టల్ భవనాలకూ, రు. 11,000 ల ఖర్చుతో నిర్మించే పశువైద్యం—కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం భవనానికీ శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో ఆయన ప్రసంగిసూ రాష్ట్ర సమగ్రతను, సమైక్యతను కాపాడడానికి కృషి చేయాలని అన్నారు. సర్పంచులు అందజేసిన విజ్ఞాపన పత్రాలకు ఆయన సమాధానమిస్తూ రాష్ట్ర ఆర్థిక పరిస్థితి మెరుగ్గాలేనప్పటికీ దశలవారీగా అనేక అభివృద్ధి కార్యక్రమాలను ప్రభుత్వం అమలు జరుపుతున్నదని అన్నారు.

అంతకుముందు ఉప ముఖ్యమంత్రిని ఊరేగింపుగా తీసుకెళ్ళి ఘనమైన స్వాగతం చెప్పారు.

ఆ తర్వాత ఉప ముఖ్యమంత్రి సమితిలోని లోతట్టు గ్రామాలలో పర్యటించి, వినాయకపురంలో గిరిజనులకు పట్టాలను పంపిణీ చేశారు. తమ భూములను యితరులకు విక్రయించవద్దనీ, తమ అభ్యున్నతికై తీవ్రంగా వ్యవసాయం చేయాలనీ ఆయన గిరిజనులను



పద్మశ్రీ బిరుదు పొందిన శ్రీ వేదాంతం సత్యనారాయణను కరీంనగర్ జిల్లా కలక్టరు శ్రీ ఎస్. వి. సుబ్రహ్మణ్యం సత్కరిస్తున్న దృశ్యం

ఉద్బోధించారు. గిరిజనులు ఉత్తమ జీవితాన్ని గడపడానికి అవసరమైన విద్య, వైద్య, రాకపోకల సౌకర్యాలను అభివృద్ధి చేస్తారని ఆయన హామీ యిచ్చారు.

అశ్వారావు పేట సమీపంలో బూలేరుపై ఉన్న కాజ్‌వేను ఆయన పరిశీలించి వంతెన నిర్మాణానికి అవసరమైన ప్రతిపాదనలను పంపాల్సిందిగా ఆయన ఇంజనీర్లను ఆదేశించారు.

## అలంపూరు సమితికి రూ. 21 లక్షల బ్యాంకు రుణాలు

మహబూబునగర్ జిల్లాలోని మనోపాడు పంచాయతీ సమితి అధ్యక్షుడు, శ్రీ యన్. రామిరెడ్డి, కర్నూలు సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఏజెంటు శ్రీ రాధాకృష్ణ, ఫీల్డు ఆఫీసరు శ్రీ యం. ఎ. మజీద్, బి. ఎ. పి. ఆర్. ఓ శ్రీ వి. వెంకటేశ్వరరావు గారలు పంచాయతీ సమితికి చెందిన ఇటిక్యాల, పెద్దదిన్నె గ్రామాలను దర్శించారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన పెద్ద బహిరంగసభలో సమితి అధ్యక్షుడు మాట్లాడుతూ సన్నకారు రైతుల మేలుకొరకు ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను గురించి వివరించి చెప్పారు. వ్యవసాయాభివృద్ధికి రైతులకు రుణాలిచ్చేందుకు సెంట్రల్ బ్యాంకు అధికారులు చర్యలు తీసుకొన్నందుకు ఆయన వారిని అభినందించారు.

సెంట్రల్ బ్యాంకు ద్వారా రైతులకొరకు రూపొందించిన వివిధ పథకాలను బ్యాంకు ఏజెంటు వివరించి చెప్పారు. ఆలంపూరులో నూటికి 40 వంతుల రైతులకు రుణాలివ్వడం జరిగిందని, వ్యవసాయం కొరకు ఇంతవరకు రు. 21,22,000లు అప్పులివ్వడమైందని ఆయన తెలిపారు.



నల్గొండ జిల్లా, మోతుకూరు సమితిలోని ఆరెగూడెం గ్రామంలో మార్చి 6వ తేదీన ఒక ఆవుకు ఒకే కాన్పులో మూడు దూడలు పుట్టాయి.



—కౌముది

పట్టుచీరెల జరీ అంచులు
పల్లవములై చెలగగా
సిగల విరిసిన మల్లెపూవులు
సిరుల ముక్తామణులుగా
మావి చివురుల ఎఱ్ఱడాల్తిల
కమ్మ అందము చిందగా
తుమ్మెదల ఝుంకారములు అం
దెల ఝణం ఝణ లీనగా
పుడమి చేడియ నవ్య జీవన
మునను పుల్కలు దేరగా
కడిమి పూవులయందముల్మది
గలిసి ఐక్యము నందగా
పూవుతీరమి మధుప కులములు
ముగ్ధ గీతము పాడగా
మూగవోయిన గండుకోయిల
ముచ్చటల్చివురింపగా
నదుల స్నానార్థము జలముప్ర
సన్నతల్ వెలిబుచ్చగా
సకల మానవ హృదయముల్ స్వా
గతము లాలాపింపగా

తరలి రాగదవే ఉగాదీ !
తరలిరా కవితాను మోదీ !




# ఉల్లాసపు పానీయం ఎప్పుడైనా చవిగొన్నారా?




FANTA IS A REGISTERED TRADEMARK OF THE COCA-COLA COMPANY

ఫాంటా ఆరంజి
రుచినేమందును?
మరిమరీ దాహం కావాలని
పించును!

ఫాంటా కోకా-కోలా కంపెనీవారి ఉత్పత్తి

CMCF-8-203

## సమీక్ష

# అంపశయ్య

ఈ నవల చాలా కొద్దిపాటి లోపాలతో, ఇంతవరకూ తెలుగు భాషలోరాని వినూతనమైన గుణసంపదతో, మన నవలలో ఒక మలుపుగా రావలసిన మనస్తత్వపు అవగాహనతో, సాంఘిక ప్రయోజనాన్ని విడిచిపెట్టని అత్యాశ్చర్యకరమైన ప్రయోగపద్ధతితో తెలుగు నవలల్లో ఒక కొత్త మార్గానికి ప్రతినిధిగా ఉంది.

యూనివర్సిటీ హాస్టలు స్టూడెంటైన అతిబీదవాడైన రవి గడిపే పదహారు గంటల్లో, ఒక సంపూర్ణ జీవితపు అంపశయ్యను పరచాడు రచయిత. ఆకలి, కామం, ప్రేమ, ఆశ, నిరాశ, మంచి, చెడు మొదలైన సర్వజీవిత సమస్యలూ ఒక్క రోజులో చూపించిన ఈ నవల. "ఒక గుప్పెడు మట్టిలో మృత్యుభయాన్ని చూపిస్తా" నన్న ఇలియట్ మాటలాంటిది.

ఈ నవల మొదట ఉపోద్ఘాతంలో Stream of Consciousness శిల్పాన్ని ప్రయోగిస్తున్నానని ఈ రచయిత చెప్పారు. కాని ఇంగ్లంలో జాయిస్ మొదలైన వాళ్ళగాఢ శిల్పాన్ని ఈ నవలతో అన్వయించి ఎవరూ నిరాశ పడరాదు. ఈ రచయితకి సమాజం కావాలి. అన్యాయపు దోపిడిమీద తిరుగుబాటు కావాలి. దాన్ని స్పష్టంగా చెప్పడానికి Psychological Experiment ఉపయోగపడాలి. అందుకే, రవి, కిరణ్మయికోసం సినిమా హాలుకి వెళ్ళేముందు అప్పు అడగడానికి చేసే ప్రయత్నమూ, ఆకలితో ఆపిల్‌పండు దొంగలించబోయిన ఘట్టము, నవల ఆద్యంతాలూ_ ఇటువంటి కొద్దిచోట్ల మాత్రమే Psychology నీ, Streamనీ, యింతవరకూ తెలుగుభాషలో ఎక్కడాలేని విధంగా వ్రాసి, అందరి మనస్సుల్లోని అంతరాంతర భావధారని స్పృశించగలిగాడు.

కొంతమందికి మనస్తత్వపు నవలమీద అభిమానంలేదు. కారణం, సరైన అవగాహనలేదు. ఎందుకంటే అది సాంఘిక ప్రయోజానికి దూరమౌతుందనే భయం. కాని, ఈ లోకం. వ్యక్తి సంఘాల మధ్యకలిగే సంఘర్షణ. వ్యక్తి సంఘంమీద తిరుగుబాటు చెయ్యడానికి వ్యక్తియొక్క వ్యక్తిత్వపు పరిపూర్ణతా కావాలి. సాంఘికమైన సమిష్టితత్వమూ కావాలి. ఈ రెంటిలోనూ వ్యక్తిత్వ వికాసం ముఖ్యం. ఉత్తమ వ్యక్తివికాసంలో నుండే. సరైన సాంఘిక విప్లవంరాగలదు. వ్యక్తిత్వపు పరిపూర్ణత సాధించడానికి మనస్తత్వ శాస్త్రపరిచయం కావాలి. మనస్సులోపల Sub-Conscious levelsలో నిద్రించే భావాల్ని, Conscious levels కి తీసుకురావాలి. ఈ ప్రయోజనాన్ని నెరవేర్చే నవలలు ఇంతవరకూ "అంపశయ్య" అంత సమగ్ర విధానంతోరాలేదు. ఇటువంటి నవలలకి ఇదే మొట్టమొదటి అతి తీవ్ర రూపకల్పన. రవి మనస్సులోని పై పొరల అనుభూతుల్ని, లోపలి పొరల్లోని అంతః ప్రవాహంగా ఉన్న ఆలోచనల్ని, ఏకకాలంలో నడిపే ఈ నవలలోని శిల్పం, పై ప్రయోజనానికి అభిముఖంగా ఉంది. నవల చివర రవి, అతని మిత్రులతో కలిసి, తమను Exploit చేసే ఒక గుంపుతో పోట్లాడిన ఘట్టం. నవలా ప్రయోజనపు దిక్సూచిన ఎఱ్ఱని పువ్వు. రవి లాంటి వ్యక్తి: పిఱికివాడు, తిరుగుబాటు చెయ్యడంలో ఉండే మానసిక క్రమాన్ని కళ్ళకు కట్టినట్లు చూపుతుంది. ఇట్లా ఈ నవలలోని శిల్పం, వస్తువుయొక్క ఉద్దేశానికి సంపూర్ణంగా సహకరించడం ఈ నవల ప్రత్యేకత.

కిరణ్మయి పాత్రవచ్చేదాకా అక్కడక్కడ నవల విసుగు పుట్టిస్తుంది. సంభాషణలు, చర్చలు పెంచడం దీనికి కారణం. కాని కిరణ్మయి వచ్చినదగ్గర నుండీ పాఠకుని ఊపిరి చేత్తోపట్టుకుని చివరిదాకా లాక్కుపోతుందీ నవల. ఈ నవలలోని శైలిలో ఉన్న వేగం, యింతవరకూ ఉన్న తెలుగు నవలల్లో నాలుగైదింటిలో మాత్రమే ఉంది. కొన్నిచోట్ల బూతుపదాలుపయోగించడం అనవసరం. Perverted sex యొక్క లక్షణాన్ని Psychological గా నిరూపించడం నవలలో చాలా సమగ్రంగా, యితరచోట్ల జరిగినప్పుడు, ఈ నాటి సామాన్య తెలుగు పాఠకుడి మనస్సుకి జుగుప్స కలిగించే బూతులక్కరలేదు. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా జనులకోసం వ్రాయబడాలి; పదాల అనుభూతి దేశకాల నిబడమైనదే.

"అంపశయ్య"_ తెలుగు నవలల్లో అవసరంగా రావలసిన, మనస్తత్వ ప్రాతిపదిక మొదటిసారిగా వెయ్యబడ్డ ఉత్తమనవల ఒకమలుపు; ఒక అనుభూతి.

-ఆద్దేపల్లి

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS AND TOURISM, ANDHRA PRADESH HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYREDABAD

